

# స్రవంతి

ఏప్రిల్

1959

శ్రీ బూర్గుల రామకృష్ణరావుగారి

షష్టిపూర్తి సంచిక



శ్రీ బూర్గుల రామకృష్ణరావు దంపతులు,
వారి కుమారరత్నము

ఫోన్: 2066 టెలిగ్రామ్: హిందీసంఘ్

సంపుటి 6 సంచిక 1

# ప్రవంతి

సాహిత్య మాసపత్రిక



శ్రీ బూర్గుల రామకృష్ణరావుగారి

## షష్టిపూర్తి సంచిక

సంపాదకులు

వేమూరి ఆంజనేయశర్మ

సి. నారాయణరెడ్డి

దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర

6-2-959, ఖైరతాబాదు — హైదరాబాదు - 4.

సంవత్సర చందా రు. 3-0-0 ఏప్రిల్, 1959 ఒక సంచిక రు. 0-8-0

# ఈ సంచికలో



★

సంపాదకీయము:

జయ చైత్రంలో ప్రారంభింపబడిన స్రవంతి ఈ సంచికతో ఆరో వసంతంలోనికి అడుగు బెడుతున్నది. గడచిన ఐదు సంవత్సరాలలోనూ ఏ ఒక్క నెలలోనూ ఆగకుండా అవిచ్ఛిన్నంగా స్రవంతి నడచిందని తెలిజేయడానికి మాకు ఎంతో సంతోషంగా ఉన్నది. ఆంధ్ర దేశంలోని సాహితీవేత్తలు ఈ పత్రికను ఆదరభావంతో అభిమానిస్తున్నందులకు వారి కందరికీ మా హృదయపూర్వకమైక ధన్యవాదములు సమర్పిస్తున్నాము. స్రవంతి ఆంధ్ర సాహిత్యరంగంలో వెలువడుతున్న అన్ని 'శైలులకూ, తీరులకూ' ప్రాతినిధ్యం వహించగలదని ఇదివరలోనే మనవిచేసి ఉన్నాము. అదే దృష్టితో ముమ్ముందుగూడా ఈ పత్రిక సాహిత్యసేవ చేయగలదని విన్నవిస్తున్నాము.

ఈసారి వెలువడుతున్న స్రవంతి జన్మదిన సంచికను శ్రీ బూర్గుల రామకృష్ణరావుగారి షష్టిపూర్తి ఉత్సవ సంచికగా ప్రచురించగలుగుట మా అదృష్టమని భావిస్తున్నాము. శ్రీ రామకృష్ణరావుగారు బహుముఖ ప్రజ్ఞా వంతులు. వారికి దాదాపు ౭, ౮ భాషలలో కూలంకషమైన ప్రజ్ఞ ఉన్నది. వారు సాహితీవేత్తలు, రాజనీతి చతురులు, పరిపాలనాదక్షత గలిగినవారు. వారు ఆంధ్రభాషకు చేసిన సేవ అనుపమానమైనది. అప్పుడప్పుడు వారు వ్రాసిన సాహిత్యవ్యాసాలూ, వారు చేసిన ఉమర్ ఖయ్యాం తెలుగు అనువాదమూ, ఈ మధ్య సంస్కృతంలో వారు చేస్తూవున్న రచనలూ వారికిగల పాండిత్య ప్రకర్షను తెలియజేస్తున్నవి. హైదరాబాదు రాజ్యాన్ని నిరంకుశ పరిపాలననుండి విముక్త మొనరించుటతోబాటు శ్రీ రామకృష్ణరావుగారు ఆంధ్రప్రదేశ్ నిర్మాణానికి గూడా మూలకారకులైనారని చెప్పడంలో అతిశ

యోక్తి ఏమీలేదు. ఆంధ్రదేశంలో జన్మించిన ఉత్తమనాయక శ్రేణిలో శ్రీ రామకృష్ణరావుగారు ప్రముఖ స్థానాన్ని వహించి ఉన్నారు. వారు ప్రస్తుతం కేరళరాష్ట్ర గవర్నర్‌గా ఉంటూ వారు కేరళప్రజల మన్ననలతో బాటు అటు కేంద్రప్రభుత్వమూ, ఇటు కేరళప్రభుత్వమూ రెండింటి ఆదరాన్ని చూరగొని ఉన్నారు. వారి వినయం, వారి నమ్రత, సమస్యలను పరిష్కరించుటలో వారు చూపు విచక్షణాశక్తి, అందరితో కలసిమెలసి ఉంటూ ఎదుటివారి హృదయాలను ఆకర్షించే వారి మృదుమధుర స్వభావమూ వారి విజయపరంపరకు కారణభూతములు. ఈ నాటితో వారికి ౬౦ సంవత్సరాలు పూర్తి అయినవి. వారికి స్రవంతిపక్షాన మా హృదయ పూర్వకమైన శుభాకాంక్షలను తెలియజేస్తున్నాము. భగవంతుడు వారికి చిరాయురారోగ్య ఐశ్వర్యములను ప్రసాదించగలడని విశ్వసిస్తున్నాము.



# విచికిత్స

—స్ఫూర్తిశ్రీ

చక్కని భావరత్నముల సానలు దీర్చి సరంబు గూర్చి నీ
యిక్కకుఁ జేరవచ్చిరి కవీంద్రులు గొంద అలంకరింపగా;
నిక్కపుఁ దత్త్వముం దెలియనేరనివారికిఁ దన్మహత్త్వముం
దక్కదుగా! వృథా ప్రలపనమ్ముల వమ్మయిపోయి రీశ్వరా!

మరణపుఁ గాయ మానమున మానక చిక్కనివారు గాని నీ
యరుదగు చెద్దియముం దలఁచి యచ్చెరువందనివారు గాని యు
ర్వరఁ గనరారు; స్వీయ మతి రమ్యములైన కథల్ వచించిపో
యిరి వృథగా! యథార్థము నెరింగి వచింప నశక్యమౌఁ గదా!

తనకు నమస్కరించు జడదారిని గన్గొని రాతిబొమ్మ యి
ట్లనె—"నిటులేల నా పదములందున వ్రాలెదు; సుత్తిపెట్టి కొ
ట్టిన నులితోడఁ జెక్కినఁ గడిందిగ నోర్చి గడించుకొంటి నా
యునికిని; నీవు నట్లె శ్రమకోర్చిన నీ పదముల్ భజింపరే!"

నావలెనే యొకండు లలనాహృదయప్రణయార్థి మున్ను; కాం
తా వికచాంబకంబుల సుధాకరరేఖలు దిద్ది శోభన
శ్రీ విలసిల్ల నామె గళసీమను జుట్టిన తత్కరమ్ము లీ
పావన పాత్రికాకృతికిఁ బాల్పడె నట్టె నశించి మట్టియై!

జాలియె లేని క్రూరమృగజాలము త్రొక్కెడు కంటకంబు లే
బాల కురంగలోచన శుభంకర సుందర కుంతలంబులో!
మేలుగ శీర్ష మెత్తుకొని మిన్నులరాయు భవంతి యే మహీ
పాల కపాల మృత్తికయొ! పల్కుట సాధ్యముకాదు నెచ్చెలీ!

ఏ విభు చిక్కనౌ రుధిర మింకినదో యిట మున్ను గాని నేఁ
డీ వనమందు గుత్తులుగ నెల్లెడఁ గన్పడు నెఱ్ఱపువ్వులే;
ఏ వనితా దృగంత రుచిరేక్షణముల్ విలసెల్లెనో పువుం
దీవలు మోసులెత్తు నతి నిర్మల వర్ణ విభాసురమ్ములై.

కోతల పాలుగాని యొక కోమల పుష్పము నేని విశ్వని
ర్మాత సృజింపఁబోఁడు; కనుమా! నవవారిద మొండు మింటిపైఁ
బ్రీతిని బూని పుష్పవిటపిన్ గురియించును రక్తధారలన్;
భూతలమెల్లఁ గ్రుమ్మరిన బూడిదయొక్కటె దక్కు నిక్కమై.

కలకల నవ్వు కాంతల మొగమ్ములు దుమ్మొనరించి మవ్వపుం
దలఁపుల కాకరంబులగు ధన్యవతీ మధురాధరంబులన్
బోలముల మట్టిలోఁ గలిపి పోడిమి బూడిదచేసి దుఃఖ కీ
లల రగిలించె దుర్విధి; ఫలంబుగ నాయెద మచ్చయేర్పడెన్.

అట నొకనాఁడు బుల్బులు "విహాయస మంటెడునట్టి యీ సుధా
స్ఫటికపు దివ్య సౌధముల సర్వ మహీశ కిరీటకాంతు లు
త్కటముగఁ బాదయుగ్మమునఁ గ్రమ్మగ వందనమందుకొన్న యా
ఘటికుఁడు నేఁడు లేఁ"డని సఖా! ప్రకటించుఁ గుహూరుతంబునన్.



రసధుని : శ్రీ విశ్వనాథ సాహిత్య సమాలోచనము - 6

# శ్రీమద్రామాయణ కల్పవృక్షమునందలి కవితా శిల్పము

—డా. దివాకర్ల వేంకటావధాని

[మహాకవులైన శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి సాహిత్యాన్ని అధ్యయనం చేయడంకోసం అక్టోబరు 26, 27 తేదీలలో 'రసధుని' పక్షాన 'విశ్వనాథ సాహిత్య సమాలోచనము' ఏర్పాటు చేయబడినది. ఈ సమావేశాలలో శ్రీమద్రామాయణ కల్పవృక్షముపై శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు, శ్రీసంపత్కుమారగారు, లఘుకావ్యములపై శ్రీ వేటూరి ఆనందమూర్తిగారు, నాటకములపై శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావుగారు, నవలలపై శ్రీ జువ్వాడి గౌతమరావుగారు, శ్రీ నాగభూషణ్‌గారు వ్యాసములను చదివినారు. ఈ వ్యాసములలో ఇది ఆఱవది.

—సంపాదకులు.]

ఆదికవి వాల్మీకి సంస్కృత భాషలో రచించిన రామాయణము భారత దేశమునందలి యెల్ల భాషలలోనికి ననూదితమైనది. ఆంధ్ర భాషలో దానికి నాలుగైదనువాదము లున్నవి. అనువాదములు గాక యందలి కథను మాత్ర మనుసరించి స్వతంత్రముగా వ్రాయఁబడిన గ్రంథములుకూడఁ గొన్ని యున్నవి. అట్టి వానిలో హిందీ భాషలో తులసీరామాయణంవలెఁ దెలుఁగున మిక్కిలి ప్రశస్తమైనది శ్రీమద్రామాయణ కల్పవృక్షము. దీనికిఁ గవిగారి గృహ నామమును బట్టి శ్రీ విశ్వనాథ రామాయణ మనియుఁ బ్రతీతి యేర్పడినది.

మన భాషలోఁ బూర్వకవి విరచితములైన రామాయణములు పెక్కుండఁగా మరల నీ రామాయణ మేల యని ప్రశ్నించుకొని కవి సమ్రాట్టులు చక్కని సమాధానములు చెప్పియున్నారు. "తలఁచిన రామునే తలఁచెద నేనును నా భక్తి రచనలు నావి గాన" అనునది యందుఁ జాల భావగంభీరమై సమాదరణీయముగా నున్నది. శ్రీరామునియం దెందరికో భక్తి యున్నది. వారికిని ఉన్నది. వారి భక్తి యాంతరమైనది. సాధారణ దృష్టి కది వెంటనే గోచరింపదు. "జాగ్రదవస్థ నేమి యన స్వప్నసుషుప్తులఁ గూడ రామనామ గ్రహణంబె నావయిన మానస జిహ్వలు సేయు" నని యీయన కంఠోక్తిగాఁ జెప్పఁజాలుట యా భక్తి విశేషముచేతనే. అది గ్రంథమున పెక్కు తావులందు

వ్యక్తమగుచుచే యుండును. అందును శ్రీరాము నుద్దేశించే వారాయాకథా సందర్భములందు ప్రయోగించుచుండు సంబోధనలు దానిని మఱింత వ్యక్తము చేయును. రామాయణమును కవు లెందఱు వ్రాసినను గథ యొక్కటిగానే కన్పడవచ్చును కాని రచనలందు మాత్రము వైలక్షణ్య ముండకప్పదు. దాని కా యా రచయితల ప్రతిభలందుఁ గల తారతమ్యము ప్రధాన కారణము. "కవి ప్రతిభలోన నుండును గావ్యగత శతాంశములలోనఁ దొంబదివైన పాళ్లని వారు చెప్పిన దెంతయు సత్యము. కథ యొక్కటేయైనను గవి ప్రతిభానుసారియై రసపోషణము వైశిష్ట్యమును బొందుచుండును.

"దధీచి శిబి కర్ణాదుల్ పునారూప సంస్థానం బందిన" వదాన్యశేఖరులు కవిగారి పితృపాదులు. "వ్రాసిన రామచంద్రు కథ వ్రాసితి నంచనిపించు" కొమ్మని వారు కుమారుని కిచ్చిన యాజ్ఞ. రామకథ యిహపరములు రెండును సమకూర్చఁజాలునని వారి నిశ్చయము. పితాజ్ఞకుఁ గవిగారి యాత్మవేదనయ్యుఁ దోడైనది. వట్టి తండ్రి యాజ్ఞయే యైనచో రచన బలవన్నిర్మితమై కృత్రిమ ముగా నుండును. దానికి జీవుని వేదన వన్నెపెట్టినది. సహజ సుందరమైన మహాకావ్యము తయారైనది. అది కవిగారి "సకలోహవైభవమునకు" బట్టుఁ గొమ్మ. వారి కవితా శిల్పమునకుఁ బరమావధి.

లోకమునఁ గవితా శిల్పు లిరుతెఱఁగులుగా నుందురు. ఒక తెగ వారు యదృచ్ఛా శిల్పులు. ఇట్టి యిట్టి శిల్ప మీ యీ సందర్భములలోఁ బ్రదర్శింతమను ప్రయత్నము వారి యెడ నుండదు. వారు ప్రతిభాప్రేరితులై కావ్యసృజన చేయుదురు. అందుఁ బెక్కుచోట్ల నుత్తమమైన కవితాశిల్పము ప్రేళ్ళు వాఱుచుండును. విమర్శకుఁడు దానిని గ్రహించి వ్యాఖ్యానముచేయును. విన్నవాని కది యథార్థమే యనిపించును. రెండవ తెగవారు జ్ఞాతశిల్పులు. శిల్ప సౌందర్యమంతయు వారికిఁ గరతలామలకమై యుండును. ఇట్టిచోట శిల్ప మీ విధముగా నుండవలెనని వారు నిశ్చయించుకొందురు. అట్లా శిల్పమును రూపొందింతురు. విమర్శకులు దానిని గ్రహింపఁజాలినచో వారి శ్రమ సఫలము. లేనిచో వారు విచారింతురు. కవి సమ్రాట్టులు జ్ఞాత శిల్పులు. వారు తమ కావ్యములం దా యా చోట్ల వివిధములైన శిల్ప సౌందర్యములను వెదఁ జల్లుదురు. ఇది యిచ్చట నిందుకు వ్రాయఁబడినదని వారు చెప్పుదురు. విన్న వారు దాని నంగీకరింపక తప్పదు.

విశ్వనాథ రామాయణమును గల్పవృక్షమన్నట్లే శిల్పవృక్షమనియుఁ జెప్పనగును. కల్పవృక్ష మడిగెడివారికిఁ గోరినదెల్ల నిచ్చును. కావ్యదృష్టితోఁ జదువువారికీ రామాయణము రసరీతిభావధ్వని చమత్కారములనువలె భక్తితో బఠించువారికి మోక్షము కరతలామలకముచేయును. శిల్పదృష్టికలవారి కిందలి కవితాంగములన్నింట నుదాత్తమైన శిల్పరామణీయకము గోచరించును. ఈ శిల్పవృక్షమునకుఁ బద్యము లాకులు. రసములు ఫలపుష్పములు. ఖండములు కొమ్మలు. కథ కాండము. వీనినే కథాకథన శిల్పము, వర్ణనశిల్పము, రసపాత్ర పోషణ శిల్పము, రీతి శిల్పము అను పేర్లతో యథాశక్తిగా వివరింప యత్నించెదను.

"ఇతివృత్తంతు కావ్యస్య శరీరం పరికీర్తిత" మ్మని భరతాచార్యుఁడు. కావ్యాంగములలో నిది చాల ముఖ్యమైనది. ఇతరములైన యంగములు పెక్కు దీని నాశ్రయించుకొని యుండును. కథాకథనము గొప్ప కళ. దీని యందు నన్నయభట్టు కృతహస్తుఁడు. అందుచేతనే యతఁడు కవీంద్రులు తన రచనలోని ప్రసన్న కథా కవితార్థయుక్తిని లోనారసి మేలని మెచ్చుకొందు రని చెప్పినాఁడు. ఆ కవీంద్రులలో శ్రీ కవిసమ్రాట్టు లగ్రగణ్యులు. నన్నయ కథాకథన శిల్పమును వడఁబోసి వడఁబోసి వారందలి సారము నాస్వాదింపఁ గల్గినారు. వారి రామాయణమునందలి కథాకథనశిల్ప మనన్యసాధారణముగా నుండును.

కథ చెప్పు రీతులు పెక్కున్నవి. కథాకథనమున నొక్కొక్క రొక్కొక్క రీతి నవలంబింతురు. అన్ని కథలను ఒకేరీతిగా చెప్పుటకును వీలులేదు. అట్లు చెప్పినచో శిల్పసౌందర్యము భగ్నమగును. అందుచేఁ బాత్రరసభావ సన్నివేశా దుల ననుసరించి కథలను భిన్నభిన్న మార్గములలోఁ జెప్పవలయును. ఈ మార్గము లన్నింటఁ గవిసమ్రాట్టులు నిగ్గుతేరినవారు. ఎవరో యొకరు కథ చెప్పుచుండఁగా వినుచున్నవారిచే వారు మధ్యమధ్య నా కథాకథన పద్ధతులను గూర్చి వ్యాఖ్యానము చేయించుచుందురు. ఆ వ్యాఖ్యానములు వింతగానుండి పఠితలాకథలందలి కళామర్మముల నెఱుంగుట కెంతయో తోడ్పడుచుండును. రామాయణ బాలకాండమునఁ బ్రధానకథ కంగములుగాఁ బెక్కుపకథలున్నవి. అందుఁ జాలభాగము విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులకుఁ జెప్పినవి. కొన్ని జనకపురోహితుఁడైన శతానందుఁడు చెప్పినవి. వీనిలో గంగావతరణము, మేనకా విశ్వామిత్రము ముఖ్యములైనవి. గాధేయుఁడు తన యజ్ఞము పూర్తి

యైన పిమ్మట రామలక్ష్మణులతోడను మునులతోడను గూడి మిథిల కరుగుచుండెను. దారిలో వారందఱు శోణానదీతీరమున విడిసిరి. సూర్యుఁడ స్తమించుచుండ మునులు హుతాశను నర్చించి విశ్వామిత్రుని చుట్టుఁ గూర్చుండిరి. శ్రీరాముఁడు విశ్వామిత్రుని ముందు నిషణ్ణుఁడై యా ప్రదేశమును గూర్చి యడుగుచు,

తపములు కల్గునేమొ యరుదారమహత్తులు కల్గునేమొ యీ
కృపయును గల్గునేమొ మఱి యే ఋషులందుననే రసోల్బణా
నుపమముగాఁ గథాకథనముండదు మీవలె, మాకుఁజెప్పుఁడా

యిపు"డని యర్థించెను. విశ్వామిత్రుఁడు రసోల్బణానుపమముగాఁ గథ చెప్పునని శ్రీరాముని వ్యాఖ్యానము. తరువాత విశ్వామిత్రుఁడు గాధిజనన వృత్తాంతము చెప్పెను. అది నిజముగా నట్లే యుండును. రాముఁడు గంగావతరణ కథ చెప్పుమని యడుగఁగా విశ్వామిత్రుఁడు ముందు కుమారస్వామి వృత్తాంతము చెప్పి,

అడిగినదేమొ చెప్పకువె యా యితరమ్ములమ్ము చెప్పుమా
యడుగక యట్లె వించుఁబడి యుందురు శ్రోతలు నిద్దియేసుమాఁ
గడుసరియౌ కథాకథన కౌశల మేమి యటందు" రని ప్రశ్నించెను.

ఇందుఁ గథాకథనమునఁ గడుసుఁదనముతోఁ గూడిన పద్ధతి వివరింపఁబడినది. చెప్పువాఁ డడుగఁబడినదేదియో చెప్పివైచినచో వినువారి యుత్కంఠ తొలఁగిపోవును. వారికింక వినుటయందు శ్రద్ధయుండదు. అడిగినది వెంటనే చెప్పివేయక దానికిఁబూర్వరంగమైన యింకొక వృత్తాంతమును మొదలుపెట్టినచోఁ దామడిగిన విషయము వచ్చునను తలంపుతో వినువారు తత్పరులై విందురు.

గంగావతరణ కథ యిందు మిక్కిలి రమ్యముగాఁ జెప్పఁబడినది. ఆ కథ యంతయు విన్నపిమ్మట లక్ష్మణుఁడు సాగరుల పట్టుదలను ఆస్తికత్వమును ప్రశంసించెను. అప్పుడు మేల్కొనియున్న ఋషులు,

జామిపువులోని కేసరచ్ఛవి వహించి
ప్రాచితెలివెల్గు గీతలు పారుదెంచె
నేమి సాగరుల్ వారలదేమి ప్రభులు
ఏమికథ యేమిచెప్పుట యేమిసొగసు ?

అని ప్రశంసించి మరల శయ్యాగతులైరి. విశ్వామిత్రుఁడు చెప్పిన సాగరుల కథ ఋషు లన్నట్లుగా నత్యంత సౌందర్యోపేతముగా నున్నది. దితిగర్భము

నమరేంద్రుఁడు చీల్ప నామె కోపించియుఁ దరువాత నతని క్షమించెను. ఈ కథ విన్నపిమ్మట శ్రీరాముఁడు విశ్వామిత్రునిఁ జూచి,

మునిభృశాశ్వుని విద్యలిచ్చినది ఘనము
మునిపతీ ! యీ కథాళి చెప్పినది ఘనము

యని ప్రశ్నించెను. భృశాశ్వ సంబంధులైన యస్త్రవిద్య లిచ్చినప్పటి యానందముకంటె రామునకు విశ్వామిత్రుఁడు చెప్పెడి కథలు వినునప్పుడు కలుగు ఆనందమే యమందముగా నుండెనఁట !

శతానందుఁడు విశ్వామిత్రుఁడు తప మొనరించి బ్రహ్మర్షిత్వము సంపాదించిన విధ మెఱిఁగించెను. జనకుఁ డందలి దివ్యబోధను భావనాతీతమైన మహత్త్వమును వేనోళ్ళఁ బ్రశంసించెను. రాముఁడు లక్ష్మణునితో,

ఈ ఋషు లెవ్వరు చెప్పిన
సారకథా కథనమొక్క చాయనె నడచున్
వీరంతర్ద్రష్టలు బహు
ధారూపిత సూక్ష్మతర కథాంశులు సుమ్మీ.
నీ విశ్వామిత్ర సంగతి చూచినావె వత్స
అన్ని యంశములును జెప్పినట్టితీరు
వేఱు మేనక కథతీరు వేఱుగాదె
యనిన నౌననె లక్ష్మణుం డమృతమూర్తి.

అంతర్ద్రష్టలైన మునులు చెప్పెడి కథలు సారవంతములై యొక్క చాయనే నడచునఁట ! వారు సూక్ష్మతర కథాంశములను బహువిధముల నిరూపింతురఁట ! మఱియు విశ్వామిత్రుఁడు చెప్పిన యితర కథల రీతికిని మేనక కథ శతానందుఁడు చెప్పిన రీతికిని భేద మున్నదఁట !

విశ్వామిత్రుఁడు కేవల ఋషిత్వముతోఁ దృప్తినందక మరలఁ దీవ్ర తపమున కారంభించెను. అంతలో వసంతర్తు వరుదెంచెను. "వసంత నవశోభవచ్చె నప్సరస వోలె" అని కవిగారు చెప్పిన వాక్యమునందలి యుపమాన మెంతో రమ్యముగా నున్నది. అది తరువాతఁ దపోభంగము చేయ నరుదెంచిన మేనక యాగమమును నాటకీయపద్ధతిని సూచించుచున్నది. మేనక పుష్కరతీర్థమున స్నానమాడి నీళ్ళోడుచున్న కేశపాశములతో విశ్వామిత్రు నెదుటి కరుదెంచెను. విశ్వామిత్రుఁ డామెను జూచి నవ్వెను. ఆ నవ్వులలోని యర్థము గ్రహించి

యచ్చరయు నవ్వెను. ఋషి యామె నానిపోవునని తడిసిన యామె కేశము లను విడుపుపెట్ట యత్నించెను.

ఆమె వారించి తుడుచుకో నామె తివురు
నతఁడు వారించి తుడువఁగా నతఁడు తివురు
చేతులందీయుచుఁ బెనంగఁ జివరిదైన
ఫలము తడి కౌఁగిలింతగాఁ బరిణమించె.

తరువాత "క్రిందౌచు మీదౌచు" వారు కేళీవిభవము ననుభవించిరి. విరక్తుడైన మహర్షి మేనకతోఁ జేసిన సరసవిలాసము లద్భుతములు.

"కైలాసముపైని దేవుఁడును లాచిన కామినియందుఁ గల్గు లి
ప్సాసముదక్తుఁడైనఁ బసివాఁడును బోలెఁ జరించునే కదా"

యని విశ్వామిత్రుని శృంగారవిలాసముల సమర్థించుచుఁ గవి వ్రాసిన యర్థాంతరన్యాసము. పది యేండ్లగుసరికి ముని తన తప్పిదము గుర్తించెను. కామక్రోధ పరవశుఁడైన తాను క్షమాసదనుఁడైన వశిష్ఠుని సాధించుట కలలోని వార్తయని గ్రహించెను. ఆతఁడు మేనకపై నాగ్రహింపలేదు. ఆమె సుపర్వరాజు నదుపాజ్ఞలలోనిదని యాతఁడు సానుభూతి చూపెను. అంతలో మేనక యచ్చటి కరుదెంచి యాతనియందు మార్పుగాంచి యధోముఖియై నిలఁబడెను. ఋషి కోపింపక గర్భమును గాపాడి కణ్వమౌని యాశ్రమమున విడువుమని చెప్పి,

పనియేమొ దేవతల యది
వనితా! కూలికిని గాని వచ్చిన యట్ల
య్యును నెడఁద లోతు లిచ్చిన
నిను నేల శపింపవలయునే మధుమూర్తీ!

యని ప్రశంసించెను. ఆమె యాతని కొనర్చినమే లనన్య సామాన్యమైనది. ఇంక నే కోకిల కూఁతయు నాతని గుండియను లాగఁజాలదు. ఆమె కృపాలేశముచే నతని కసలు కోకిల యననేమో యర్థమయ్యెను. అతఁడామెను గాంచి

కోరి ప్రత్యక్ష మన్మథగురువవైతి
కోరక పరోక్షవైరాగ్య గురువవైతి
లంజియా యెంతక్రిందికి గుంజినావొ
యంతపైకిని జనుమార్గ మరసినావు.

అని ప్రస్తుతించి, "నవ్వకు సువ్వే నాదుకథనామీయప్సరః పాళితోఁ గానీచెప్పి" యని పరిహాసముచేసి, "తాను గామము కోసి వేసినట్లు బలారితోఁ జెప్పు"మని రాయబారము పంపి యామెను విడిచి యెటకేనియుం బోయెను.

ఇది శృంగారరసభరితమైన కథ. నాయకుఁడు ముని. నాయిక అచ్చర. మునిచేసిన శృంగారవిలాసములలో నెంత సారస్య మున్నదో యంత యౌచిత్య మున్నది. అతఁడు పదియేండ్లు శృంగార రసలోలుపుఁడై కాలము పుచ్చియు దానికి బానిసకాలేదు. మరల తనస్థితి సింహావలోకనము చేసికొని తమస్సు నుండి బైటఁబడెను. సాధారణునికి మౌనికినున్న భేదమిది. అతఁడు మేనకను శపింపకపోవుట కాతని సార్ద్రమైన హృదయము కారణము. అది దేవేంద్రుని యదుపాజ్ఞలలోనిది. పైఁగా దోషము తనది. ఆమెను శపించుటేల? అతఁ డామెను ప్రశంసించినపద్ధతి వ్యంగ్యవిలసితము. తన కథః పతనము కలిగించిన యామె నాకసమున కెత్తినాఁ డతఁడు. ఇంత వైరాగ్యములో స్వదోష సంజనితమైన గర్భము నెడ నాతడు చూపిన యక్కటికమచ్చెరువు కలిగించును. రసమయమైన యీ కథ చెప్పినతీరు రమ్యాతిరమ్యముగా నున్నది.

కథలను చెప్పుచుఁ గవిసమ్రాట్టు లచ్చటచ్చట వ్రాయు సంభాషణలు సహజములై లోకవృత్తమున కనుకరణములై యెన్నో విధముల ముచ్చట గొల్పుచుండును. వారి శైలి అతి దీర్ఘసమాసభరితమై పండితులకుఁ గూడ నందుపాటులోనుండదని కొందఱి విమర్శ. కొన్నిచోట్ల నది యట్లుండుమాట నిజమే. అది యచ్చట నట్లే యుండవలెను. ప్రౌఢుఁడైన మహాకవి సామాన్య పాఠకుల పరిమితి కెట్లు వచ్చును? పాఠకులు తమ గ్రహణ సామర్థ్యమును బెంపొందించుకొని కవి భావోన్నతి నందుకొనవలయును. నేనిచ్చటఁ జెప్పఁ దలఁచినదేమనఁ గవిసమ్రాట్టులశైలి యంతట నొక్కమాదిరిగా నుండదు. అది సందర్భసన్నివేశములను బట్టి, ప్రయోజనమును బట్టి మాఱుచుండును. వారి సంభాషణలందలిశైలి సరళసుందరమై యతి జాతీయమై శిష్టులైన ప్రౌఢుల చమత్కారయుత సంభాషణములను దలపించుచుండును. యజ్ఞము చూడ వచ్చిన జటాయువుతోడను రోమపాదునితోడను దశరథుఁడు కావించిన సంభాషణము, కౌసల్య శాంతితోఁ జేసిన సంభాషణము, జనకుఁడు విశ్వామిత్ర దశరథులతోఁ గావించిన సంభాషణము. రామ పరశురాముల సంభాషణము ఇందుకు నిదర్శనములు. ఆ సంభాషణ లందలి పరిహాసచమత్కారములు, గౌరవోదాత్తతలు, స్నేహాదరములు వర్ణనాతీతములుగా నుండును. అచ్చట

వారిశైలి వ్యవహారమునకు సన్నిహితమై, సులభమై, రసస్ఫోరకముగానుండును. ఈ సంభాషణలు వారిలోకజ్ఞతకు, రసికతకు, సంవాదరచనా ప్రాగల్భ్యమునకుఁ బట్టుఁగొమ్మలై దృశ్యకావ్య కళాసంపదను బుడికిపుచ్చుకొనుచుండును.

కావ్యము అష్టాదశ వర్ణనల కాలవాలములై యుండవలెనని మన లాక్షణికులు చెప్పుదురు. పూర్వకవులు అవసరానవసరములఁ బరిశీలింపక లక్షణానుసరణమునకై కొన్ని వర్ణనలు చేయుచుందురు. ఆధునికు లనవసర వర్ణనలు కావింపరు. నిజమున కవి కథాగమనమున కాటంకము కలిగించును. రామాయణ బాలకాండమున నచ్చటచ్చట బహువిషయముల వర్ణనమున్నది. వానిలో నెల్ల ఋతువర్ణనము కొంత దీర్ఘమైనది. ఇది విశ్వామిత్రుని తపస్సు వర్ణించు నెడను, సీతారాముల వివాహానంతరమును రెండుసార్లు కావింపఁబడినది. సీతారాముల వివాహమైన తరువాతఁ జేయఁబడిన వర్ణనము దీర్ఘతరమైనది. ఆ యా ఋతువులలో నా యువదంపతు లనుభవించిన పవిత్ర ప్రణయవిలాసము లిందు నిపుణముగా వర్ణింపఁబడినవి. ఈ ఋతువర్ణనములలోఁ గవిసమ్రాట్టులు ప్రదర్శించు నేర్పన్యత్ర దుర్లభమైనది. ఏ ఋతువును వర్ణించునప్పు డావాతావరణమును గల్పించి వారు పఠితలచే ననుభవింపఁ జేయుదురు. వారి ఋతువర్ణనములు పఠించు సహృదయుఁడా స్వల్పకాలములోనే ఋతుషట్కము విలాసవైభవములు భావనాత్మకముగా దర్శించును. అందు సర్వత్ర వారి సూక్ష్మపరిశీలనము వ్యక్తమగుచుండును. ఈ పరిశీలనము భావించినకొలంది పఠిత కానందపారవశ్యము కలిగించును. ఒకప్పుడేదైన నొక సంఘటనము జరుగుటకుఁ గొన్ని సంవత్సరములు పట్టును. ఆ కాలపరిమితిని సూచించుటకై వారు ఋతువర్ణనము నెంతో మెలఁకువతో నుపయోగించుచుందురు.

ఆఱవ నెలయందు దశరథుఁడు తన ముప్పురురాణులకును సీమంతములు కావించెను. ఇచ్చట నా గర్భవతుల వర్ణించు సీస మొకటున్నది. అది యించుక శ్లేషతోఁ గూడి ప్రకృతిని రాణులనుగూడ సమముగా వర్ణించును. చూడుఁడు:

వర్షా సమారంభ వైభవం బొలసినం
తఁ బయోధరాగ్రముల్ నల్లబారె
శరదృతు ప్రారంభ సమయాన నూత్నదీ
ధితిఁ బద్మముఖములు తెల్లవడియె
హేమంత హిమపాత మేచియేచకమున్నె
యంభోజముఖములం దరుచి హెచ్చె

నిర్మేఘము శిశిరానేహమరుగుదేర
గగనమధ్యమ్ముళ్లు కానిపించె
నొగిని వేసంగివచ్చి పయోధరము ల
దృష్టముగఁ బయస్సులు సేకరించుకొనియె
బక్షమున నెలల్ మసలఁ గన్పడునుగాని
ఋతువుమాత్రము చిహ్నీనుమిత మనంగ.

పాత్రలతోఁ బ్రకృతిని మేళవించి కావించిన యీ వర్ణన మద్భుతముగా నున్నది. ఇందు ప్రౌఢత సూక్ష్మపరిశీలనము రెండును ఒకేసారి ప్రత్యక్షమగు చున్నవి. ఇట్లు కథాసంబంధిగాఁ బ్రకృతిని వర్ణించు నేర్పు పరమౌచిత్య భాసురమై పాఠకులకుఁ బారవశ్యము కలిగించును.

మొలచెడు చివుళ్ళకండూతి సెలవులఁజన
నురుసు శ్రీరామ చంద్రుండు నొక్కినంతఁ
గందిగింజయ్యెఁ గోసలక్ష్మాతలేంద్రు
సుత జగన్నాథమౌ స్తన చూచుకంబు.

ఇది కవిసమ్రాట్టుల సూక్ష్మపరిశీలన పాటవమునకుఁ బరమోదాహరణము' వారి భావనా నేత్రమునకు వర్ణ్యమేదియైన సరే సమగ్ర స్వరూపముతో సాక్షాత్కరించును. ఆయన యందలి రమ్యతరములైన యంశములను జమత్కారముగా వర్ణింతురు. ఋషులు వానరోజులలో నగ్నిహోత్రకుండము లారిపోవునేమో యని జాగరూకత వహించిరి. గ్రీష్మమున నవి పర్ణశాలలను బరశురామప్రీతి కావించునేమో యని శ్రద్ధవహించిరి.

అగ్నిహోత్రకుండంబులు నారిపోవు
నేమొయని వానరోజుల నెంత యత్న
పడిరొ యీనాళ్ళ నగ్నులు పర్ణశాల
లంటుకొనకుండ ఋషులంత యత్నపడిరి.

ఇది వారి పరిశీలన నైశిత్యమున కింకొక యుదాహరణము. యజ్ఞాచరణమునకు దశరథునిఁ బ్రేరేచు సందర్భమున వసిష్ఠుఁడు తన పాదములపైఁ బడిన రాజును లేవనెత్తి కౌఁగిలించుకొనెను. "అప్పుడు రాచిన వెల్లుప్రోవు మునిరాజు కడన్ బతి చిన్నిదివ్వె, యాచూచి వారు చూచినరుజోతుల యెక్కువ తక్కువల్ సరిన్" మునిపతిజనపతు లిర్వురికి నా సమయమున నానందబాష్పము లుప్పతిల్లెను.

మునిపతి జనపతియను పూ
నిన గాదిలి కౌఁగిలింత నిడుపులయిన యా
మునిపతి జనపతి గడ్డము
లనుబడి ప్రమదాశ్రుతతి తళాతళమెఱసెఁ.

కవిగారికి వారి తెల్లని గడ్డములేకాక వాని నిడుపుందనముకూడ గోచరించెను. ఇట్లు వర్ణనముకావించుతఱి నతి సూక్ష్మ విషయములను గూడ విడువకుండుట శ్రీ సత్యనారాయణగారి యందలి విశిష్టత.

సుమంత్రచోదితమైన రథ మధిష్ఠించి దశరథుఁ డయోధ్యానగరమును దిలకించుచుండెను. సుమంత్రుం డయోధ్య వప్రకుడ్యమును, బరిఖారూపమున నున్న సరయూ నదిని వర్ణించెను. పురీవప్రము "స్వర్గమన్గోవు వెన్‌జను త్వత్పురీ వృషగళమున వ్రేలాడు గంగడోలు, త్రేతగాజారెడు కృతపురుషుండు కాల్ నిలువద్రొక్కిన మిట్ట నేలకొడుపు" వలె నాతనికిఁ బ్రతిభాసించెను. రాజధానిని జుట్టి దానిని గౌఁగిలించుచున్నట్లు చూపట్టు సరయూ నది వట్టినది కాదు. అది "గాధేయదృష్ట మంత్రాధీనతంజేసి వరుణుఁడు వంచిన తొలిప్రేమప్రవాహము" ఇచ్చటి రెండు సీసపద్యములందున్న యుత్ప్రేక్షలు ధార్మికములైనవి. వాని యాథార్థ్యమునకు పావిత్ర్యమునకు నలరి దశరథుఁ డానందమున నాకస మంటెను. కవిగారును బాఠకుల యానందమునకు దోహదముగా "అనివచింప నతని ధర్మానుబంధ్యుత్ప్రేక్షలకు రాజు సంతోషించుచున్నంత" నని సూచన గావించిరి. ఔపనిషదికము వైదికము నైన ధర్మముపైఁ గవిగారికున్న యాసక్తి యీ మహాకావ్యమునఁ బెక్కుచోట్లఁ బ్రత్యక్షమగుచుండును. దశరథుఁడు కావించిన యజ్ఞము వర్ణనము, సీతారాముల వివాహవర్ణనము పరిశీలించిన నది సువ్యక్తము కాఁగలదు. లౌకిక విషయములం దెంత చొఱవయో వైదికములైన యా కర్మలను వర్ణించు సందర్భమునఁ గూడ వారికంతే చొఱవ. శ్రౌతధర్మ కర్మముల రహస్యము లెఱింగినవారికిఁ గాని వారి యా చొఱవ సువిదితము కాఁజాలదు.

దశరథుడు తన ముప్పురు దేవేరుల కడకరిగి తన సంతానవాంఛ నెఱింగించెను. "ఎన్ని తరువులున్న నన్నియుఁ గాయంగఁ బూట పూట వేచుఁ దోఁట మాలి" వలె నతనికిఁ దన ముప్పురు పత్నులును సంతానవతులు గావలెనని కోరిక. వారాతని కోర్కి మన్నించి గృహీత దీక్షాస్ఫురిత తనూవల్లికలై యంతిపురములు వెల్గించిరి. రాజు సౌధాగ్రమున కెక్కి సరయూనదిని బర

మును జూచుచుండెను. అప్పుడిందుబింబము ప్రాచి శాఖేడుపైని హాసు
లొలికెను. ఆయిందుబింబమును గవి యుత్ప్రేక్షించినతెఱంగు చూడుఁడు, అది

క్రతుయత్న మెంతదూరమువచ్చెనో చూడ
వెల్లేన్గు వజ్రి పంపించె నొక్కొ
యజ్ఞాగతునకు నారాయణునకు ము
న్గదలి పాంచజన్యంబు తరలె నొక్కొ
యాగఫలంబైన యమృతకుంభమిుమింటఁ
దెరలి ప్రాగ్దిశ బయల్దేరె నొక్కొ
మైత్రావరుణి ప్రేమమంజులాశీర్వాద
వల్లిక తలపూవు వదలె నొక్కొ

యన్నట్లుగా నుండెను. ఇచ్చటి యుత్ప్రేక్షలకు కథతోనే కాక ధర్మముతోఁ
గూడ నెంత యనుబంధమున్నదో వేఱుగాఁ జెప్ప నవసరములేదు. సుమంత్రుఁడు
శాంతా ఋశ్యశృంగుల వివాహము వర్ణించి యా ఋశ్యశృంగునిఁ దెప్పించి
యజ్ఞమొనరింపుమని రాజును బ్రోత్సహించెను. అప్పుడు మరలఁ జంద్రుఁడుద
యించెను. సంతానకాంక్షతో నుఱ్ఱూఁతలూగుచున్న రాజునకుఁ జంద్రబింబ
మిప్పుడు

ఒనర బోర్లాడించి యుయ్యేలతొట్టెలోఁ
బండఁబెట్టిన పసిపాపవోలె
వీథులంబడి తిర్గి బూదియమైఁ జల్లు
కొని పర్వులంబెట్టు కుఱ్ఱవోలె
నన్నమ్ము దించు మోమంతయుఁ బెరుగన్న
మును జేసికొన్నట్టి బొట్టెవోలెఁ
జిట్టి తలంటిపోసెదనన్న నందక
తొలఁగి పర్వులుపెట్టు నులిపివోలె
వెల్ల దుస్తులుకట్టి వీథులను షికారు
పంపిన రాజకుమారువోలె
మింటనడుచక్కి జాబిల్లి మేదినీశు
నేత్రములకును జలువ పండించిపోయె.

రాజున కప్పుడు సర్వమునుఁ దనకుఁ గావలసిన చిఱుత రాబుడుతవలె

గోచరించుట యెంతో సహజముగా నుండి ముందు జనింపఁబోవు పసినిసుంగుల క్రీడావిలాస నాట్యముల కిప్పుడే నాందీ వాక్యము పాడుచున్నది.

యజ్ఞ పరతంత్రుఁడైన రాజునకుఁ గోకిల సప్తతంతు మహాకార్య సమయమందుఁ గర్తవలెఁ గానిపించెను. ఇంక దాని సర్వాంగములును యజ్ఞాంగములవలెనే భాసిల్లెను. ఆ వసంతకాలమున రాజునకు "ప్రతి రసాల కుజంబుఁ బచ్చిపిందెలతోడ నెలమసలినకాంతవలెనె తోఁచె." ఇచ్చట కవి భావము కథాలగ్నము. వర్ణన లందుచే నా కథతో సంగమించి సాగిపోవు చున్నవి. యజ్ఞ సమయమున వండిన వంటకముల వర్ణన చదివిన నెంత జితేంద్రియులకైన నోరూరక మానదు.

రాఘవుల యిలువేల్పు శ్రీరంగనాథ
ప్రభువు పవళింపు సేవకై భద్రపఱిచి
నట్టి సంభారమనఁగ మహానసంబు
ద్రవ్యములు పొల్చె దశరథ క్రతువువేళ.

రాముఁడు శివధనుస్సు విఱిచిన సందర్భమున నుప్పతిల్లిన మ్రోత సర్వదిక్కు లందే కాక సర్వలోకములందును వినుపించెను. ఆ మ్రోఁతవర్ణన మతిలోక గంభీరమైనది. అచ్చటి పద్యములు చదివినచో శ్రీరాముఁడిప్పుడు విల్లు విరుచుచున్నట్లుండును. అవి నన్నయగారి భారతమున నుదంకుఁడు కావించిన నాగరాజ స్తుతి పద్యములను దలంపునకుఁ దెచ్చుచుండును.

అహల్య శ్రీరామున కొసంగిన స్వాగతము మానోజ్ఞక మంతింతన రానిది. శ్రీరామునిరాక యామెకు మునిగుప్తమౌ మనోమూలమై చను వేల్పుకుజము తనపై కొమ్మసాచినట్లుండెను. రాముఁ డామెకు సచ్చిదా నందముల్ స్కంధత్రయము గుర్తుగా నున్న యొక చెట్టు గాని చెట్టువలెఁ జూపట్టెను. అప్పు డామెకుఁ గలిగిన యానంద మపరిమితము. కమలా కుచోపరి కస్తూరికాగంధిశాటి నాగరికత సాగివచ్చెనని యామె భావించెను. ఆమె యెడఁద నప్పు డరుదుగా రామభజన మందిరము తోఁచెను. ఇచ్చటి సీసముల సౌందర్య మనుభవైక వేద్యము.

ప్రభు మేనిపై గాలిపై వచ్చినంతనే
పాషాణ మొకటికి స్పర్శవచ్చె
ప్రభుకాలి సవ్వడి ప్రాంతమైనంతనే
శిల కొక్కదానికిఁ జెవులు కలిగె

ప్రభుమేని నెత్తావి పరిమళించిన తోన
యశ్మంబు ఘ్రాణేంద్రియంబుచెందె
ప్రభునీల రత్నతోరణ మంజులాంగంబు
గనవచ్చి రాతికిఁ గనులు గలిగె
ఆ ప్రభుండు వచ్చి యాతిథ్యమును స్వీక
రించినంత నుపల హృదయవీథి
నుపనిషద్వితానమొలికి శ్రీరామ భ
ద్రాభిరామమూర్తి యగుచుఁ దోఁచె.

ఇందు రాయి యభిరామ సతీ మూర్తి దాల్చిన తెఱఁగు వర్ణింపఁబడినది. ముందు పైగాలి, పిమ్మట ప్రాంతమగుట, తరువాత నెత్తావి పరిమళించుట. అనంతర మంగదర్శనము, తుదినాతిథ్య స్వీకరణము వర్ణింపఁబడిన క్రమ మెంతో సరస ముగా నున్నది. ఆ రాయికి శ్రీరాముఁడు బయలుదేరినప్పుడే చైతన్యము కలుగఁ జొచ్చినది. శబ్దస్పర్శ రసరూపగంధములకును బంచేంద్రియముల కును సన్నిహితసంబంధ మున్నది. ఆయా గుణముల నాయా యింద్రియ ముతో సరిగూర్చుటలో నొక సొగసున్నది. కవి సమ్రాట్టు వర్ణనములను బట్టి చూడవలెనంటే, అవి రసభావనాచమత్కారములను గ్రుమ్మరించును.

శ్రీ సత్యనారాయణగారి భావన యతి పటిష్ఠమైనది. నన్నయఁ దొట్టి నేఁటివరకు వరలిన కవీంద్రులనందఱిని బరిశీలించినను ఇంత భావనామహత్త్వము కలవా రెందఱో కానిపింపరు. వారు రచించు ప్రతి పద్యమునందు నొక క్రొత్త భావ ముట్టిపడుచుండును. విశ్వామిత్రుఁడు తన కొలువునకు రాఁగనే దశరథుఁ డన్న వాక్యములు చూడుఁడు.

అచ్చపుజాలిగుండె మొదలైన మహోవిభవాచ్ఛమూర్తి నీ
వచ్చుట యూషరావనికి వర్షమువచ్చుట పుట్టుపేరకున్
గ్రొచ్చిన కొండ్రలోన నిధికొట్టున దాకుట లుప్తబీజమై
లొచ్చునఁబడ్డ వంగడములో నిసువొక్కఁడు తోచుటో ప్రభూ!
నీవై సేరుట నాగృహంబులు త్రివేణీ సంగమస్నాన పు
ణ్యావిర్భావము కల్గె నాయెడల గాయత్రీమహాదేవి శ్రీ
సావిత్ర్యాకృతి ద్రష్టభేదముగ సాక్షాత్కార మిప్పించె నే
లా వేదమ్ములు నాల్గు నాలుగు మొగాలం బాడిన ట్లయ్యెడిన్.

గాధేయునిరాకవలన నతఁడు పొందిన మహానందమునకు మూర్తులీ పద్యములు.

తపోబలముచే బ్రహ్మర్షియైన యా మహనీయు నింతకంటె స్తుతించుట యెట్లు?
వసంతకాలమునందలి మన్మథమూర్తి

వైజయంతీ పుష్పవాసనాభరితమౌ
వైకుంఠ వక్షంబు వంటివాఁడు-గా
మరల సృష్టినిజేయు మహితప్రాతర్వేళ
బ్రహ్మదేవుని యూహవంటివాఁడు-గా

కవిగారికి కనిపించెను. సీతనుజూచి రాముఁడు

అల్పమొ ప్రేగొ బ్రహ్మమను నాంతరవస్తువు వీడి నాదు సం
కల్పమునందు సర్వమును గామిని నీవుగనిండియుంటి వీ
కల్పితమైన మోహమును కాటుకచీఁకటిఁ జిన్నదివ్వెలై
శిల్పపు వెల్గుగాన విరచింతువు నా హృదయాంతరంబునన్.

అని పల్కెను. సీతారాముల దివ్యమైన యనురాగమున కీ పద్యము నందలి ప్రతి పదమును సాక్ష్యమే. రాముఁ డామె నాత్మ నిత్యంబుగా హత్తుకొని యానందించెను. ఆతఁడు పొందినది యైంద్రియమైన యానందము కాదు. బ్రహ్మానందము. జనకుఁడు విశ్వామిత్రునితో నన్న ట్లిందలి ప్రతి పద్యము నొక దివ్యబోధయై మన భావనల దాఁటిపోవును. ఇవి యుదాహరణమునకై యచ్చ టచ్చటి కథాసందర్భములనుండి యప్రయత్నముగాఁ దీసిన పద్యములు. ఏ పద్య మైన భావనిర్భరముగానే యుండుట యిందలి విశిష్టత.

రసపాత్రపోషణ శిల్పమునుగూర్చి యించుక ప్రసంగించెదను. "ప్రాగ్వి పశ్చిన్మతంబున రసము వేయిరెట్లు గొప్పది నవకథాదృతిని మించి" యను రహస్యము కవిగారెఱిగినదే. కరుణవీర శృంగారరసము లిందుఁ జక్కగాఁ బోషింపఁబడినవి. హాస్య మక్కడక్కడ నాకులలోఁ బూవువలెఁ దొంగిచూచు చుండును. విశ్వామిత్రుఁడు మేనక చెక్కిట దన చెక్కిలిచేర్చి గడ్డము గ్రుచ్చు కొన్నదాయని గ్రుచ్చిగ్రుచ్చి యడుగును. "దనహస్త మామె హస్తముమీఁద బోర్లించి నీ చేయిలేదని నిహ్నవించు" విశ్వామిత్రుని చేయి యంత మోటు మఱి రాముఁడుకూడ నిట్లేచేసి "ముదురాకుచివురాకు బదునులనును": రాముని. చేయి విశ్వామిత్రునిచేయి యంత మోటుకాదు. సీతచేయి యంత సున్నితము కాదు. ముదురాకువంటి దాతని చేయి. రాముఁడు తన చెక్కిలి సీతచెక్కిటఁ జేర్చి గడ్డము గ్రుచ్చుకొనుచున్నదా యని యడుగఁడు. ఏవో రహస్యంబు లెత్తిపోయును. సీతారాముల శృంగార మీ బాలకాండమున మనోహరముగా

వర్ణింపఁబడినది. కవి యచ్చటచ్చట భావివియోగమును సూచించుచుఁ జెప్పు వాక్యములు చదువునప్పుడు పఠితలగుండెలు కళుక్కుమనును. రాముఁడు తన ప్రేమబరువు చూపించుచునే "ఒక్క సమయాన మనకు వియోగమైన ప్రేమ యేమగునంచు" వారించుచుండును. అంత యానందమునఁ గూడ "మదిలో దూర వియోగభీతి రఘురామక్ష్మాసుతల్ దూరముల్ కదియం జొచ్చినయట్లు తోఁచి" కంపింతురు. ఇట్టి గంభీరార్థ సూచన లీ కావ్యమందంతట గోచరించు చుండును. అచ్చటి శిల్పవైభవము మేరలులేనట్టిది.

పాత్ర పోషణమునఁ గవిసమ్రాట్టు లందెవేసిన చేతులు. విశ్వామిత్రుని పాత్రము వారి యద్భుత సృష్టి. అతని పట్టుదల, పొందిన పతనోన్నతులు, తపోమహిమ, రామలక్ష్మణు లందలి వాత్సల్యము, కథాకథన నైపుణి యిందుఁ జక్కఁగా వర్ణింపఁబడినవి. సుమంత్రుఁడు దిలీపుని కాలమునుండి రాఘవులకు నమ్మినబంటు. ఆతనికి దశరథుని యంతిపురమునఁ గూడఁ జనువే. ఆతని శీల మిం దనవద్యముగా వర్ణింపఁబడినది. వశిష్ఠుఁడు తపోరాశి. వైరియయ్యు విశ్వామిత్రున కతఁడే పరమాదర్శము. కైక యిందు దుష్టురాలు కాదు, హేలారతియైన యామె రాజు కంటికి డాగురేకుల తళ్తళ. దశరథుఁడు కౌసల్యాసుమిత్రలఁ జూచినపిమ్మటఁ గైక యింటికేగి సంతానప్రాప్తివిషయము ముచ్చటించెను.

మౌను లనుమతించిరి దీ
జ్ఞానిధివై వ్రతముఁబూనఁ జనునికని"దశరథు డనఁగా నామె
నాతో నేమగు నా కోసల
భూనాయక సుతకు మొదటఁ బుట్టఁగవలయు

ననుపల్కెను. ఆమె సమభావమట్టిది. రామునందామె కమితప్రేమ. సీతయన్న నామెకుఁ గల ప్రేమ చూడుఁడు.

మెలఁతను సీతఁ గైక తన మేడలకుం గొనిపోయి మెచ్చుమే
రలుగ నలంకరించి నలరామునకుం బనియున్నయట్లు వా
ర్తలనిచి రామచంద్రుఁడును రా నొకపన్నక నూడి యిద్దఱన్
గలియఁగఁద్రోసి నవ్వులునుగా గదితల్పులు తీసిమూసెడిన్.

ఆమె సీతతో రాముఁడందగాఁడు నీవు కాదనును. రామునితో సీత యందకత్తె నీవు కాదనును.

రాని రాము నడుగు రాముఁడంచును బల్కుఁ
గైక సీత పర్వ్వగములు పెట్టు
అడవికోడి కూసినట్లుగా నవ్వును
కైక, సీత తిరిగిరాక కలుగు.

కైక యిందింత సరసస్వభావ. వాత్సల్యభరితహృదయ. అహల్యపడిన వేదన, రాము నెడ నామె చూపిన వాత్సల్యము మఱపురానివి.

ఈ బాలకాండమున కవిసమ్రాట్టు లెట్లో జటాయు హనుమంతులకుఁ గూడఁ బ్రవేశము కల్పించిరి. ఇతర రామాయణములలో మనము అరణ్యాకాండమునఁగాని జటాయువును దర్శింపము. కిష్కింధలోఁగాని హనుమత్ప్రసక్తి రాదు. ఇందు దశరథుని యాగమునకు జటాయువు వచ్చును. జటాయువునకు దశరథునకుఁ గల పూర్వస్నేహ మిట నెంతో చక్కగా సూచింపఁబడినది.

పక్షిరాజారగించుచోఁ బార్థివుండు
తాత నీ చెల్మి యొకయెత్తు దైవతాధి
నాథు చెల్మియు నొకయెత్తు నాకటన్న
ఱెక్క తుదలార్చి యడుగెత్తి పక్కిఱేఁడు.

వేనొక పక్షిమాత్రుఁడను నీవఖిలేశుఁడ విట్లు నన్నుఁ బ్రే
మానత బుద్ధిఁగాంతువు ధరాధిప ! నీవన నాదు మైత్రికిన్
గానను హద్దు నీవిటుల గౌరవమాడినయంతఁ బొంగి నా
లోనన నేను గ్రొమ్మనసులోఁ బులకించుచునుంటి మిత్రమా !

యని పల్కెను. ఇచ్చటి దశరథ జటాయువుల సంభాషణము కడుంగడు హృద్యము. అట్లే భూమిపై నవతరించువారిని వర్ణించు సందర్భమున హనుమంతుని వర్ణనము కూడ నున్నది.

కవిసమ్రాట్టు లచ్చటచ్చట దీర్ఘసంబోధనలు వాడుచుందురు. అవి యద్భుతములై వెనుక జరుగు కథనంతను సింహావలోకనము చేయుచుండును. విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులకుఁ గథ చెప్పు సందర్భమున నట్టి సంబోధనలు కల్పించును. ఇట్లే తర్కవేదాంతాదిశాస్త్రములతో వారికిఁగల పరిచయ మక్కడక్కడ చక్కగా ప్రదర్శింపఁబడును.

మధుసూదన నేను నుష
ర్బుధుఁడును దేవతలమనుట పోయి పదార్



ప్రథ మిగిలినాము జ్ఞానాం
బుధి! దర్కాము ముదురుపాకమునఁ బడి యచటన్.

అనునది వారి తర్కశాస్త్ర పరిచయమునకుఁ దార్కాణము. గ్రీష్మర్తు వర్ణన మునఁ గల

లేని వున్నట్లుగాఁ గానిపించుట కెండ
మావులు తార్కాణ మలయఁ జేసె
తెలివి వెల్గున మాయ తొలఁగు నంటకు నెండ
కెండు సరస్సు సాదృశ్యమిచ్చె
పైని పటారము లోని లొటారమ్ము
మేనంచు రూపించె మేడిపండు
ప్రాణానికి విరోధి ప్రాణమ్మెయని వడ
గాలిఁ గీడ్వడిన జనాళి తెలిపె
నటఁ దదంతర ప్రతిపత్తియందుఁ జీవుఁ
డమ్లై సంపరిష్వక్తుఁడై యరుగునంచు
ధరణి నెఱియలు నీటియావిరులు భావి
సస్యసంస్కార గూఢబీజములు నెఱపె.

నను పద్యమున వేదాంతసంస్కారము నిండియున్నది.

ఇంక రీతిశిల్పమును గూర్చి యించుకచెప్పి విరమింతును. విశిష్టమైన పదరచన రీతి. శ్రీ సత్యనారాయణగారి పదప్రయోగము వింతగా నుండును. ఏ యే పదముల నెట్లు కూర్చిన జాతీయముగా నుండునో వారికిఁ దెలిసి నట్లెందఱికో తెలియదు. ఆయన సమాసములు వాడుదురు. వాని కూర్పు నన్నయ సమాసములవంటిది కాదు. కొంత విలక్షణముగా నుండును. పరిచయ మున్న వారికిఁ గాని యవి సులభముగా బోధపడవు. కాని యా కూర్పులో నెంతో చమత్కారము, ప్రౌఢిమ గోచరించును. కేవల మృదుమధుర పద ప్రయోగమే రచనకు సౌందర్యము తేజాలదు. రసానుగుణమైన పదప్రయోగ ముండవలయును. శృంగారరస సందర్భమున ఢ, భ మొదలైన యక్కరముల తోడి పదముల వాడుక యెంతయసహ్యముగా నుండునో వీరరౌద్రాదుల సందర్భమున లలితపదప్రయోగమంత యసహ్యముగా నుండును. అందుచేఁ గావ్యమునం దంతట మృదుపదములనే వాడవలయు ననుకొనుట పొరపాటు. శ్రీ సత్యనారాయణగారీ పదప్రయోగౌచితిని బాగుగా నెఱింగినవారు. సంభా

షయములపట్ల వారు వ్యవహారమునకు సన్నిహితమైన జాతీయములు వాడుదురు. అచ్చటి కూర్పెంతో రమ్యముగా నుండును.

నవ్వుచుఁ బ్రశ్నించు నోసీ !
నవ్వెక్కువ నీకు మౌనినాథుఁ డెఱిఁగినన్
చవ్వలగుఁ దియ్యఁదనములు
పువ్వులు కాలికి మజొక్క ములికియుఁ దరుగున్.

ఉండుమని యెంత బలవంతమో పొనర్చె
రాజు-మీ మానవులకు నారాక యొకఁడె
బ్రేగు నిలచుట కాదని వెడలె నతఁడు
రాజునకును గన్నీళ్ళ పర్యంతమయ్యె.

అను పద్యములు చూచిన నిది విదితమగును.

శ్రీ విశాలవిశాలాపురీవరంబు
నేలు రాజర్షి వంశమదేని స్వామి !
యూఁదిచెప్పవె నీ నోటినుండి వచ్చు
సిరిపలుకు క్షీరవారాశి తరఁగచిలుకు.

విశ్వామిత్రుని మాట యేమో కాని కవిగారి మాట యిట్టిదే.

అచ్చటచ్చట నిందు శబ్దాలంకారప్రీతి కన్పించును.

ఇందలి ముక్తపదగ్రస్తము చూడుఁడు

చుఱచుఱ నెత్తురై చూచెడి చివురాకు
చివురాకు వెనుకఁ బొంచిన లతాంత
బాణుండు విసరఁగాఁ బట్టిన పిడిబాకు
పిడిబాకు రివ్వున విసర దూసి
సన్న సవ్వడివోని సన్నని పికి వాకు
పికివాకుతోడఁ గులుకు నన్నరసోకు
పిరువీకుగా నొక్కపెట్టఁ దోచి....

ఇట్టి వింకను రెండుమూడుచోట్లఁ గలవు.

అగు శతానందుఁడీవుగా నగుదొ లేదొ
యాశ్రితులము శతానందులైతి మేము

అనుచోట శతానందపదముపై యమకముతోఁ గూడిన చమత్కారము.

ఇంక నర్థాలంకారము లెన్నో యున్నవి. కొన్ని యుత్ప్రేక్ష లిదివఱకుఁ జూపితిని. కవిగారి యుపమార్థాంతరన్యాస రచనా కౌశల మనన్య సామాన్య మైనది. అర్థాంతరన్యాసము లెన్నో యున్నవి. అందులో నొక్కటి మాత్ర ముదాహరించెదను.

పొలములో వానయొక్క
చెక్కుఁ గుఱిసి వేఱొక చెక్కఁ
జుక్కపడదె!

ఎంత చక్కని సమర్థనము! ఇంక నుపమానములు కుప్పతెప్పలు. వాని యౌచిత్య మనన్య సామాన్యము.

అన్నంపురాసులు చిన్ని తోమాలెల
కై సన్నజాజులు పోసినట్లు
సన్న ఖర్జూరపుఁ జాపలపై సూప
రాసులు గంధమ్ము తీసినట్లు
ఎఱ్ఱవాగుగను వేయించి నప్పడములు
పునుఁగు కుంకుమ కుప్పవోసినట్లు
వంగపండుల వరుగుపేళ్ళ చోష్యపు గుబా
ళింపు లత్తరుల నొల్కించినట్లు

ఆ వంటకముల కుపమానగౌరవముచే నెంత యుదాత్తత చేకూరినది! యజ్ఞ సంబంధులగుటచే నవి పవిత్రములు. అందుచేతనే కవిగారవి శ్రీ రంగనాథ ప్రభువు పవళింపుసేవకై భద్రపఱిచి నట్టి సంభారమువలె యున్నవని వర్ణించిరి. మన్మథుఁడు "తొలకరి సంజవేళలఁ బశ్చిమాకాశ మావరించిన మేఘు నట్టి" వాఁడట. శిథిలమైన గౌతము నాశ్రమము

కడు పరిభ్రష్టమైన యోగంబువోని
యాశ్రమముఁ జూచి రాముని యతులందు
బాష్పములు గుత్తులై రామభద్రు ముఖము
హారి వదలిచన్న వైకుంఠ మట్లుతోఁచె.

నిజముగా వైకుంఠ మప్పు డట్లే యుండును. నారాయణుఁడు వైకుంఠము వదలి రాముఁడై భూమి కవతరించినాఁడు కనుక.

కవిగారి పద్యముల యెత్తుగడలో నొక యద్భుత సౌందర్య మున్నది. ప్రతిపద్యము నొక క్రొత్త పోకడగాఁ గన్పించును. ఆ శిల్పమితరులకుఁ జేత

కానిది. వారి వృత్తౌచిత్య మఖండమైనది. వారు వాడినన్ని వృత్తము లాంధ్ర వాఙ్మయమున చంపకోత్పలశార్దూలమత్తేభులు తప్ప మరెవ్వరును వ్రాయలేదనుకొందును. ఎంత క్రొత్త వృత్తమునైన వారు నేర్పరియైన సారథి గుఱ్ఱములనువలె సమముగా నడపింతురు. మఱియు భావానుగుణమైన వృత్తము నేరుదురు. వెన్నెల వర్ణించునప్పుడు చంద్రకళ. గజగమనము వర్ణించునప్పుడు గజవిలసితము. మధ్యాక్కరల నాంధ్రమున నొక్క నన్నయయే వాడెను. ఎఱ్ఱన తన రచన వంటి దనిపించుటకై స్వల్పముగా వ్రాసెను. శ్రీ సత్యనారాయణగారు రామాయణమునఁ జెక్కు వ్రాసిరి. ఈ నడుమ మధ్యాక్కరలలో మూఁడు నాలుగు శతకములే వ్రాసిరి. సాధారణముగా నెవ్వరికిని నడవని పద్యము మధ్యాక్కర. అది నన్నయ్యకు నడుచును. శ్రీ సత్యనారాయణగారికి నడచును. వారి సీసపు నడకలు విచిత్రముగా నుండును. సీసపద్య గతులలో వారి చేఁజిక్కని గతిలేదు. ఈ పద్యము చూడుఁడు.

మాకంద తరుశాఖకాకోకిలాలాప
కౌతూహలాకారకలనఁ జేసి
ప్రాతస్సమాయాతశీతానిలాధూత
సాధుపల్లవహాస్త సంజ్ఞఁ జేసి

కాస్రంసితదుకూల కాంతిఁ జేసి
సామోదకహ్లార సంఫుల్లనీరేరు
హాకేకరార్తమోహనతఁ జేసి

రగణ బహుళమైన యీ పాదము లెంత ధారగా నడచుచున్నవో నేను చెప్ప నక్కఱలేదు.

కవి సమ్రాట్టులు శిల్పి చక్రవర్తులు. ఆ కవితా శిల్పమంతయు వారి క్రీఁగంట మెలఁగును. వా రూహింపని భావము లేదు. కల్పింపని శిల్పిచిత్రము లేదు. వారి రామాయణ కల్పవృక్ష మాంధ్రుల పాలిటి కల్పవృక్షము. కల్పకం బమరలోకం బందయున్నదని తెలుగువారలకు కొందలమందఁ బనిలేదు.

విశ్వనాథ కులాబ్ధివిధుడు కవిసమ్రాట్టు వరరామకావ్యకల్పక మున్నదే కదా!



# రెండు చివరలు

—శ్రీ చక్రవర్తి రంగస్వామి

అమ్మ నింపిన చిన్ని బొజ్జతో
ఉయ్యాలలో అమరిన చిన్ని మెత్తమీద
కదలాడే రంగురంగుల చిలుకల పందిరి కింద
నోటిలో వేలూ కాలిమీద కాలూ వేసికొని
చిన్ని పెదవులు కదలాడినపుడల్లా
చిరునవ్వుతో తియ్యని 'అమ్మ' పదం మోగే
పసితనం!

జిగ్ జిగ్ జిగ్... కూ...
జిగ్ జిగ్ జిగ్... కూ... అంటూ
ఏ పీటచెక్కనో బోర్లావేసి నెడుతూ దోగాడుకునే
చిన్నతనం!

ఎలదాటి తొడచరచి
'బలి! బలి! బలి బలాం.... గుడుగుడూ...' అంటూ
అందరూ మిత్రులే అయిన ప్రతిపక్షంలోకి దూకి పరాక్రమించే
కుర్రతనం!

ధనిక దరిద్ర – సుగుణ దుర్గుణాల జోలేలేని
కేవలం ఆకర్షణకు జరిగే
అమాయికపు చిలిపితనపు పాలపొంగులాంటి
నవయౌవనం!

దేశంకోసమో
వ్యక్తి – సంస్కారం – పౌరుషం కోసమో

ఏ దీనార్తుల కోసమో
ప్రేమమోహాల కోసమో
నమ్మిన న్యాయం, ధర్మం పక్షం కోసమో
చావూ బ్రతుకూ ఏమాత్రమూ ఎరుగక దూకే
పట్టపగ్గాలులేని వయసు !

అన్యాయాన్నీ బాధనూ సహించే సహనం
కష్టసుఖాల లోతెరిగిన అనుభవం
ప్రేమా దయా సానుభూతీ నిండిన విశాలహృదయం

అలవడి—
కష్టాలు గడచి గట్టెక్కడమో
దుఃఖాలకు తల ఒగ్గడమో
తేలిపోయిన ఘట్టంలో తగిలే
భయమో-ధైర్యమో, దైన్యమో-అతిశయమో
రూపుగట్టి మళ్ళిన యీాడు !

ప్రతి అవయవమూ పెళుసెక్కి
విధేయత చూపలేని అవస్థతో కలిగిన నిర్వేదం !
అనంతసాగరం అవతల నీలాకాశంపైన
ఏమున్నా అవసరంలేని నిర్లిప్తత !
సర్వం అంతర్ముఖం !
చిన్మయత ! నిశ్శబ్దం !
శాంతి !!



# మృత్యురంగంమీద

—శ్రీ రమణశ్రీ

పాత్రలు :

నిరంజనయోగి సౌదామని శంకరయ్య మున్నగు

స్త్రీ పురుష కంఠస్వరాలు...

గాఢాంధకారరాత్రి—కుంభధారాపాత వర్షంలో....రైలువేగం అప్రతిహతంగా మేఘాలతో పందెంవేస్తూ, పెనుతుపాను గుండెల్ని చీల్చుకొంటూ....ప్రళయ ధ్వనుల ఫెటఫెటలతో 'మిత్తిపూర్' వంతెనమీదికి రైలు....

అమావాస్య నిశామృత్యువు అప్రయత్నంగా దాడిచేసిందేమో...ఒక్కసారి జలప్రళయం విజృంభమానోద్విగ్నమై...వంతెన బొమ్మరిల్లులా కూలిపోయింది. హరోంహర ! ఊహాతీత బీభత్సదృశ్య హృదయవిదారకం. రైలుపెట్టెలు అట్ట ముక్కల్లా పటపట విరిగిపోతున్నై.

నిస్సహాయ హాహాకారాల ఆర్తనాదాల, మృత్యురోదనల. ప్రాణ తరంగాల మహద్ఘోషల వర్షోత్కర లయవినాశంలో, ఇన్ని ప్రాణదీపికలు వెలిగించినా కాన రాని కటికచీకటి.

వంతెన కావలగా పడిన రైలుపెట్టెలో జనం, నరమానవ రక్తపు బురదలో ప్రాణానిలాల రొదలలో కాళ్లు భగ్నమై. చేతులు ఛిద్రమై ముఖం మూర్ఛిల్లి రణ బీభత్స విలయ దృశ్యం.

కొంతసేపటికి వానహోరు తగ్గింది. (కొన ఊపిరి ప్రాణాల కొసలు ముడి వేసుకొని రోజుతూన్న వ్యక్తావ్యక్త కంఠాల విలాపాలు.)

ఒకటి : సంవత్సరాల తరబడి...అబ్బ...వ్యాయామం చేసినవళ్ళు హూనమై పోయింది. ఇంకెవరికోసం, ఇంకెవరికోసం ఈ జీవించడం. నా ఒలింపిక్ ఛాంపియన్‌షిప్పు ! చావుకి ముప్పు. వచ్చిపడిందబ్బా !! (విలవిల తన్ను కొని, మృత్యువుని కౌగలించుకొని...)

రెండవ : నిక్షేపంలా ఇల్లువిడిచి, అందని ఆశలకోసం యముడితో పారిపోయొచ్చి, నందుకు దైవం విధించిన ఘోర శిక్ష...మరణశిక్ష...నరకం తెరుచు కొంటోంది.

మూడవ : చేసిన పాపాలకు ప్రాయశ్చిత్తం...ఎంతమంది అమాయకుల గొంతులు పిసికానో. "ఎంతమంది నోటిదగ్గరి కూడు కూలద్రోశానో. ఆ చేతులు ధ్వంసంచేసి పారేశావా విధీ !"

నాల్గవ : అబ్బబ్బా ! నేను బయలుదేరిందొకటి, జరిగిందొకటి. ఇప్పటికీ గుండెల్లో రాజుకుంటున్న పగ....శివయ్యా !.... శివయ్యా !.... బతికేవున్నావా ?.... చచ్చావా ?....

ఐదవ : కూలికి ....(మూలిగి)... సంపాలనొప్పుకుంటే, దేవుడు కుదిమట్టంగా కూల్చేసినోడు...ఇంక నే నేటికి బతుకుతాను. కాల్లు కూలిపోయినయ్ ! వళ్ళు ఊనమైపోనాది....

ఆరవ : ఆ పాపిష్ఠిముఖం ఇంట్లో అడుగుపెట్టినదెబ్బ.... నన్నే మింగేసింది శూర్పణఖలా... అబ్బా ! చావు చెవులు మూస్తోంది....

ఏడవ : సామ్రాజ్యం !... సామ్రాజ్యం !...ఎక్కడున్నావ్ ? నీవు బతికుంటే నాకదే పదివేలు. నాకొడు క్కాస్తిరాసిస్తావు ! నే నెలాగూ చస్తాను....

ఎనిమిదవ : హరి ! జీవితం నాశనం చేశావుగదరా ! రైల్వేవాడా ! మీ అంతు చూస్తాను... దావావేసి, లక్షరూపాయల నష్టపరిహారానికి ... ముప్పు తిప్పలూ పెట్టి మూడు చెరువుల నీళ్ళు తాగిస్తాను....

తొమ్మిదవ : ఇదే సమయం....ఎంతమంది జనం...పడిపోయున్నారు. ఇంత మందినీ దోచేస్తే వేలూ....లక్షలూ...నగలూ, నాణాలూ... ఏవీ ? నా చేతులేవీ ? నడుంవులు విరిగాయి అబ్బా !....

పదవ : నా చావు చూసుకొని ఆ దిక్కుమాలిన వెధవ తెగబడిపోతాడు. లక్ష్మీ ; నువ్వూ పిల్లలూ...ఆస్తీ...అంతా ఏమయిపోతారో ? హయ్యో ! రామ...

పదకొండవ : అమ్మో ! వాతం కమ్ముతోంది. నా 'వాతవిధ్వంస' మాత్రలు రెండుంటే ఎంతబాగా పనిచేసునో ! వాతవిధ్వంసీ ! వా-త-వి-ధ్వం-సీ ;

పన్నెండవ : హయ్యో ! నిండుచూలాలివి ! ఇవ్వాళో రేపో కనేందుకు సిద్ధంగా వున్నావ్ ? (దుఃఖిస్తూ) మన ఆశలన్నీ ఈ దిక్కుమాలిన రైలు కూల్చి పారేసింది. కడుపు పంట కటికచీకట్లో కరిగిపోయింది. శ్యామా !... ఎక్కడ ? నీవైనా జీవించు. కడుపులో పాపకోసం....

(మృత్యు వికటాట్టహాసంలో ఒరసికొనిపోయే మూల్గులు...ఆర్తనాదాలు. నలుప్రక్కలనుంచీ నిట్టూర్పుల నిస్పృహలతో, రక్తజ్వాలా తరంగాలలో మండి పోతున్న గుండెలతో శతసహస్ర కాలనాగాల బుసల చీకటిలో....మానవులు

మ్రోయించలేని, భేతాళవీణల మృత్యునరతంత్రులపై పలికించే ప్రళయగీతంలో మిళితమైన వాతావరణం......)

## 2

(అల్లంత దూరాన చిన్న కొండమీద మినుకు మినుకుమనే, ఆశాదీప కళికలా వెలుతురు నీడల కుటీరం.... ధ్యాన నిమగ్నమైఉన్న ఆశ్రమం త్రుళ్ళి పడింది... నిరంజన యోగిని, మృత్యు కళాంచలధార సోకినది. తటిల్లతలా కంపించిపోయినది సౌదామిని.)

సౌదా : స్వామీ! ఏమిటా శబ్ద ప్రళయం?

నిరం : (ధ్యాన నిమీలిత నేత్రాలు తెరచుకొని) విధి వికటంగా నవ్వుతోంది సౌదా! మానవుడేదో మహత్తరాన్ని సాధించింది ఒక్క తృటిలో ప్రకృతి బీభత్స ప్రభంజనపు సుడిలో తునాతునకలై పోతుంది.

సౌదా : స్వామీ! తత్త్వబోధనకిది వేళకాదు. ఆ ప్రళయశబ్దం విన్నారా? కొండలు కొండలు ఢీకొన్నాయో, మిన్నువిరిగి మన్ను మీదపడిందో? పిడుగులజడి అవిరళధారాపాతంగా కురుస్తోన్న చప్పుడు.

నిరం : విధాత క్రూర విలాసం! భూమీ, సృష్టి, సర్వం వలయాకృతిగా నిరంతరం జీవించవలసిందే! దీనికోసం ఇంత చింతనెందుకు సౌదా?

సౌదా : ఆ 'మిత్తిపూర్' వంతెన అసలే బలహీనంగా వుందని అనుమానం. విరిగి పడిపోయిందేమో? స్వామీ! పెను రక్కసి, గిలగిల తన్నుకొని కొట్టుకుని కూలినట్టు కూత వినిపించింది.

నిరం : (స్మృతిలో పూర్తిగా వచ్చి) ఏవిఁటి నువ్వంటున్నది సౌదా! 'మిత్తిపూర్' పేరులోనేవుంది మిత్తి.... ఇదే నిజమైతే, ఇది సరిగ్గా రైలువచ్చేవేళ...

సౌదా : (భయకంపితంగా) స్వామీ! మహోపద్రవ ప్రమాదం జరిగిపోయుం టుంది. ఎన్ని వందల ప్రాణాలు రక్తాన్ని మృత్యువు పెదవులు జుర్రు కొంటాయో? ఎన్ని అమాయకపుటూపిరుల్ని మృత్యునాసిక పీల్చివేస్తుందో?

నిరం : హే భగవాన్! ఏమిటీ? దుర్నిరీక్ష్య పరీక్ష. నీవు పెంచిన, వికసించిన పూలని నీవే త్రుంచేసి, కాలరాసి పారేస్తావా?

సౌదా : వర్షం వెలసినట్టుంది. బయల్దేరండి స్వామీ! ఇదే సమయంలో మన ఆశ్రమం శిష్య పరంపరతో విలసిల్లివుంటేనా, ఈ పాటికి నేనొక్క క్షణ భంగురాన్ని ఏంచేయగలను?

నిరం : (చిరునవ్వుతో) బహుశంగా సాధించలేక పోవచ్చు. నీవూ నేనూ ఆ కటిక చీకట్లో ఒక్క చిన్న కొవ్వొత్తి వెలిగించి వద్దాం...' దీపం వెలిగించి, గాఢాంధకారంలో ఆశాకిరణంలా ముందుకు నడు సౌదా!

సౌదా: (దీపం వెలిగించుకొని) పదండి స్వామీ! ఈదారినే నడవండి. కాళ్ళకి మెత్తని చిత్తడి, భూదేవి గుండెలలో ఆర్ద్రితలా...

నిరం : ఏక్షణం ఎలాంటిదో, ఎప్పటికేదో, ఎప్పుడెవరిదో, ఎందుకలా జరిగి ఒరిగిపోతుందో....అగమ్యగోచరం. దృష్టాదృష్ట చరాచరం....జ్ఞానాజ్ఞాన సమాచరణం.

సౌదా : ఈ నిష్కంటక పథాల పురోగమించండి స్వామీ!

నిరం : నీవింకా భ్రమలోనే వున్నావు సౌదా! నిష్కంటకం కానిదేదీలేదు. మృత్యుముఖంలో మానవుడు మునిగినంతవరకూ ఇదే పరిస్థితిలో చూడు! భయంకర జీమూతాల వీర విహారంలో అజేయమైన ప్రకృతిని, ఒక్క నిమిషం జయించలేకపొయ్యాడు మానవుడు.

(దీపం సృష్టించిన కొద్దిపాటికాంతి కళా రంగంలో నీడల్లా నడుస్తున్నారు. దగ్గర పడుతోన్న జీవుల ఆర్తనాదాలు, వెర్రి మొర్రి కేకలు, ఉసురుల ఉస్సురులు, వేయి వేదనాళయి శోకాలు, అంగవైకల్యంతో రోదించే జీవితాలు...)

నిరం : పసరుపచ్చని పచ్చిక పట్టి, పులకరించిన ప్రకృతి గుండెలమీద ఎంతటి బీభత్స శ్మశానం సృజించావు తంత్రీ!

సౌదా : ఇంతకాలంనుంచీ ఇక్కడుంటున్నామేకాని, స్వామీ! ఏనాడైనా, ఇంత నిశిరాత్రివేళ హోరున వీస్తోన్న తుపాను గాలిలో ఇంత చిన్న కాంతి సాధనతో ఎప్పుడేనా ఇలా బిక్కు బిక్కుమని బయటికి వచ్చామా ?

నిరం : అవసరా నవసరాల పడుగు పేకల జీవితంలో ఏ క్షణం ఏం ముంచు కొస్తుందో ఎవరూహించగలరు? అవనీ ఆకాశం ఐక్యంగా మేఘం రక్తధారల్ని వర్షించిందా అన్నట్టు చూడు సౌదా! నేలంతా అరుణారుణంగా పంకిలమై ఉంది. ఈ రక్తాన్ని, మానవజీవాన్ని పీల్చుకొని భూమాత తిరిగి సన్నని, పచ్చని, నులివెచ్చని కోరికల్లా చివురిస్తుంది. ఆ చివుళ్ళే తిరిగి భక్షించి, పునరుజ్జీవించి, పునఃసృష్టికి మూలమైన ఏ సిద్ధాంతమో ఆకర్షించు కొంటాం. భూమి గుండ్రంగా తిరుగుతూ, మనల్నీ గుండ్రంగాతిప్పుతూనే వుంది... ఈ సత్యం తెలుసుకోలేని మానవు డింకా చీకటికోణంలో స్వార్థాన్ని రమిస్తున్నాడు.

(సౌదామిని కాలికేదో తగిలి కెవ్వున కేకవేసి)

సౌదా : స్వామీ!... పసిగుడ్డు... ఇప్పుడే పుట్టిన నిగ్గు....

(దీపం వెల్తురులో చూసి)

నిరం : మహాప్రళయాంతర సాగరంలో జనించిన వటపత్రశాయి విష్ణుశ్రీవలె, ఎంత ప్రశాంతంగా యోగనిద్రలో మహామాయాస్వరూపంలో ఉన్నాడో?

సౌదా : భగవల్లీల! ఈ బిడ్డ తల్లినించి ఎలా వేరయ్యాడో? యే మేఘాంచల తటిత్ఖడ్గం సద్యోవికచజీవితాన్ని భేదించిందో? ఊహాతీతంకదా స్వామీ!

నిరం : (వంటి వెచ్చదనాన్ని, ఉలిపిరిపొరలాంటి ఊపిరిని స్పృశించి) మహాభయజలప్రళయంలో జనించిన పసిపాప. మృత్యుముఖంనించి వెలువడిన సాక్షి...తీసుకో సౌదా!

సౌదా : మీరేనా అంటున్నది స్వామీ!

నిరం : తొనలు తొనలుగా వడలిన ఒడలుతో ఆగామి వృద్ధాప్యాన్ని పుట్టువుతోనే సూచించే పసినిగ్గు. ఎంత వేదాంతం ఉపన్యసిస్తున్నాడో చూడు సౌదా!

సౌదా : ఎందుకీ మమకారం? దారిని పుట్టిన బిడ్డ....కొండలు ఢీకొని రాలిన రాతిబెడ్డ....

నిరం : ముందా బొడ్డుకు గుడ్డచుట్టు. వళ్ళంతా చక్కగా తుడు. పైకి తీసుకో, ఈబిడ్డ జీవితమేమిటో భవిష్యత్తే నిర్ణయిస్తుంది.

సౌదా : (యోగి చెప్పినది చేసి) ఈ దీపం మీరు తీసుకుని ముందు పదండి స్వామీ!

(విషాద సంగీతంలో విశీర్ణమైన హాహాకారాలు, నిట్టూర్పులూ, ఏడ్పులూ మిన్నుముట్టుతున్నయ్.)

సౌదా : నాకేదో విపరీత భయంగావుంది. మనకి రెండు కాళ్లూ, రెండు కళ్ళు, రెండు చేతులూ వున్నంత మాత్రంచేత ఈ అభాగ్య మరణజీవులకేం చేయగలం? ఇంతటి వేదనాగ్నిజ్వాలల్ని కౌగలించుకొని, మనమూ మసి మసియై పోవల్సిందేనా స్వామీ!

నిరం : నీకనుభవం లేదు. ఖేదాంతకాలంలో వేదాంతమే మానవుని అభివాంఛ. చల్లని వేదదేర్చే పలకరింపులకోసం అతనిప్రాణా లూరుతూవుంటయ్! అమృతరసవాక్కులసేచనంతో ధైర్యసారంతో ఆ దురదృష్టజీవులగొంతు కొంత తడిపితే సరి!

సౌదా : దారి తీరుగాలేదు. చూసుకు నడవండి ! బురదలో కూరుకుపోయిన అడుగు తీసి అడుగువేయడం బ్రహ్మాండంగావుంది. ఈ అల్పజీవుల ఆక్రందనలు క్షణంక్షణం నా గుండెల్ని చుట్టుముట్టి దుస్సహంగా వున్నయ్.

నిరం : జీవితమంతా సంసారజంబాలపటలంకాదా ? రోగాలతో రొచ్చులతో బాధలతో అడుగుతీసి అడుగువేయడమే పెనుగండం. అందుకే వేదాంత సారంలో ఉపశమనం వ్యక్తిత్వానికి అన్వయించుకొన్ననాడు మృత్యువునైనా చిరునవ్వుతో ఆహ్వానించగలడు సౌదా !

సౌదా : స్వామీ ! ఈపాటికి రైల్వే అధికారులు, డాక్టరులు చర్యతీసుకునేవుంటారు. ఈపాటి కేదో సహాయం వచ్చే ఉంటుంది. దయాహృదయులూ, నర్సులూ అంతా వస్తూనేవుంటారు. ఈ పసినిగ్గుతో తిరిగి వెళ్ళిపోదాం రండి స్వామీ !

నిరం : నీ హృదయం పరిపక్వంకాలేదు. మన మింకెంతో దూరంలో లేం !... ఆ చీకటిలో పెనుఘాతంలా స్మశానం...పగిలిపోయిన రైలుపెట్టెలూ... సంతప్త మానవులంతా ఆ మిణుగురుల వెలుగులో మూర్ఛిల్లిననీడలలో.... ఒక్కసారి మనోనేత్రం విప్పిచూడు ! ఆ దృశ్య మంతా విధి రచించిన వికటహాస్యలీల. నీ బద్ధకం విదళించుకో ! చిన్నారి చిరుపాపమోములో లీనమైపో ! గుండెదిటవుతో ముందుకునడు. అంతేగాని, సహజత్వాన్ని విడనాడి జేలవై, గోలవై పోతావేంతల్లీ !

సౌదా : స్వామీ ! ఆ విపరీతపు మూలు గేదో వినండి ! ఎవరా స్త్రీ ?

(మూలుగు దగ్గరికి చేరి ఇద్దరూ ఆ వెలుతురులో)

నిరం : ఎవరు తల్లీ నీవు....?

స్త్రీ : ఎ...వ...రూ ! ఈ రైలు నా కడుపు పంటని పొట్టబెట్టుకొంది. గుండె పెళ్లున పగిలిపోతోంది. నే నక్కడే పురుడు పోసుకుంటా నంటే నన్ను బలవంతంగా...అబ్బ !... ఆయ నెక్కడో ?

నిరం : అర్థమైందా సౌదా ?

సౌదా : చూడు తల్లీ ఈ బిడ్డ !......

నిరం : (అందుకొని) గర్భభిన్నమైన శోకదేవతలా వున్నావు. ఎవరు తల్లీ నీవు ?

స్త్రీ : మీ రెవరో పుణ్యాత్ములు ! రైలు విరిగి పడిపోయిన కుదుపులో నే నిక్కడికి విసరివేయబడ్డాను. కత్తిలా మెరిసింది మెరుపు. నా బిడ్డని ఛేదించి ఎక్కడ పారేసిందో ?...ఎక్కడున్నా....అబ్బా !

నిరం : తల్లీ! ఈ బిడ్డ నీ బిడ్డ దేమో! అల్లంత దూరం పుంతలో పడివున్నాడు.

స్త్రీ ఏదీ...ఏదీ...నా బిడ్డ! నాయనా! మేం కన్న కలలు చెరిపేసి పుట్టావా? ఈ ప్రళయంలో నా బిడ్డను నా కిచ్చారు. మీ ఋణం...మీ ఋణం...

(స్పృహ తప్పుతోంది)

నిరం : ఈ బిడ్డకీ ఈ తల్లికీ ఇంత దూర మెలా వచ్చింది సౌదా?

సౌదా : ఆవేదనావిస్మృతిలో ఏం జ్ఞాపకం వుంటుంది ఆవిడకుమాత్రం? ఐనా ఈ బిడ్డ బతికే ఆశ నాకు లేదు.

నిరం : ఏ కొనఊపిరైనా కొన్ని వందల సంవత్సరా లలాగే ఉండి ఉజ్జీవంతో బతుకుతుంది. విధి నిర్ణయానికి మన మెవరం? నువ్విక్కడేవుండు సౌదా! నేనువెళ్ళి క్షతగాత్రుల్ని ప్రబోధించి వస్తాను.

(కొంతదూరం నడిచి, సన్నని దీపంవెల్తురులో గొంతు చించుకొని)

నిరం : దురదృష్ట జీవులారా! మృత్యుపీడితులారా! కొద్ది దూరంలోనే నాకుటీరం వుంది. మీకు సహకారం అందేవరకూ నా ఆశ్రయంలో వుండండి! మానవులుగా పరస్పరం అర్థం చేసుకొని, సహకరించుకోండి. గుడ్డివాడు అవిటివాణ్ణి మోసి బ్రతకనేర్చిన కథలో నీతిని. గ్రహించండి మీలో ఓపిక కలవాళ్ళంతారండి! నే నక్కడ ప్రథమచికిత్స చేస్తాను. ప్రయత్నిస్తాను. లేవండి!

(అంతర్విమర్శ చేసుకొంటూన్నట్టు గుసగుసలూ, విసవిసలూ ఆగిన చప్పుడు)

1 వ : లేవండి! పాపం. ఎవరు మీరు? మీ ముఖం కనిపించడంలేదు. నాభుజం ఎక్కిరండి పాపం!

2 వ ఆడదానివిలావున్నావు. నన్నూతగానడు. నీగుండె చెదరిపోయినట్టుంది.... పాపం!

3 వ : బాబూ. రా నాయనా! అలా అమ్మకోసం గోలుగోలు నేడుస్తున్నావ్! రా. నిన్నెత్తుకుంటా...

(అంతా బయల్దేరారు పరస్పరం సహకరించుకొంటూ. నిరంజనస్వామి ముందు నడుస్తున్నాడు. వెనక సౌదామినిచేతిలో పసినిగ్గు. స్పృహతప్పిన స్త్రీని మోసుకొని మరిద్దరూ ముందుకు...)

* * * * *

(తెల్లవారుతోంది. 'తోంది' యేమిటి? తెల్లవారినట్టే. ఒకళ్ళ నొకళ్లు గుర్తించుకొంటున్నారు.)

ఒకటవ: ఎవరు నువ్వు? హారి కుష్ఠురోగపెధవా! నిన్ను కూల్చెయ్య. రాత్రి నిన్నేనా మోసుకొచ్చింది నేను. వళ్ళంతా గజ్జిగజ్జిగా తగిలితే బురదేమో ననుకొన్నాను. నీలాంటివాణ్ణి బతికించి ఇంకా ఏంబావుకొందామని దిక్కు మాలిన దేవుడు? పాపం! నిక్షేపంలాంటి యువకులూ నాయకులూ, డాక్టర్లూ, ఇంజనీర్లు అంతా చచ్చి నీలాంటి నాలాంటివాళ్ళం మిగిలాం. ఇంత ప్రళయం వొచ్చినా నీలాంటి పెధవ చావకపోతే యెలాచావం.

సమాధానం: బాబ్బాబూ! మీరున్నారా అని బతికి బయటబడ్డా. నాపెల్లాం పిల్లలు సల్లగుండ.

మరొకరు: ఊరుకుంటానట్రా! ప్రాణనష్టం దావావేసి, రైల్వేవాళ్ళ డొక్క చీరెయ్యనూ? కోర్టు కోర్టుకీ తిప్పించి మరీ చస్తాను.

వేరొకరు: ఎవరూ...శంకరయ్యగారా? హారి...మీరూ ఈ బండిలోనే వస్తు న్నారూ? అందుకే పాపం బండి బద్దలైందొక్కసారి! మీలాంటి దుర్మా ర్గులు పాపాత్ములు ప్రయాణంచేస్తే భూదేవి నిలుస్తుందా? గుండె బద్దలై చసుంది.

శంక: ఔనౌను. రాత్రి నీ మొఖం గుర్తుతెలియక మోసుకొచ్చినందుకు బాగా బాకా పడుతున్నావ్! నువ్వని తెలిస్తే, ఆ కాలవలోనే విసిరిపారేద్దును పీడా విరగడైపోను. నామీద దావా తెస్తావుట్రా దావా! దిక్కుమాలిన పెధవా!

సమాధానం: నన్నన్యాయంచేసి. నావాటా యెగేసి, బతుకే తలకిందులుచేశావు; నువ్వని తెలిస్తే పీక పిసికేసి పారేద్దును!

★ ★ ★

సోదా: తేళ్ళు చచ్చినా విషం చావదా స్వామీ? ఏవిఁటీ ప్రలాపాలు? ఒకపక్క ఒడిలో చావేమిటి?

నిరం: అదృష్టహీనులు! పరస్పరం అర్థంచేసుకోలేని, మృత్పిండాలు. ఎలాంటి పరిస్థితీ గుర్తించకండా ఒకళ్ళ నొకళ్ళు ఆడిపోసుకోవడంతో కాలం వ్యయించే కర్మభీరులు.

★ ★ ★

ఒక స్త్రీ: ఏవేఁ మంగీ: నువ్వేనా? ఎవరితోనో లేచిపోయొచ్చావుట. కట్టుకున్న మొగుణ్ణొదిలేసివస్తే పుట్టగతులుంటాయా? తొడలూ, కాళ్లూ సలిగి పోయాయా? ఎందుకొచ్చిన కర్మ!

మంగి: పాపం. ఆయనేపెట్టెలో వున్నారో ? నాకోసం జీవితం త్యాగంచేశారు. నన్ను యమయాతనల్నించి రక్షించడానికి తప్పించారు. ఏరీ ఆయన ? మృత్యువు గెద్దలా తన్నుకుపోయింది.

శంక: (మూలుగుతూ) అయ్యో ! నా వ్యాపారమంతా ఏమైపోతుందో ? దేవుడా ? ఎక్కడున్నావయ్యో !

ఒకగొంతు : నీ చీకటి వ్యాపారం బాగానే సాగుతుంది. నీసారా దిగుమతి వర్తకం మూడు పూవులు ఆరు కాయలుగా, బాగా బతుకుతుందిలే. చింత చచ్చినా పులుసు చావదేం ? ఇప్పుడైనా భగవన్నామస్మరణం చేసుకో ! కొంత పాపం తరుగుతుంది.

శంక: ఎవడ్రా నువ్వు ? గోరుచుట్టుమీద రోకటిపోటులాగ !

సమాధానం: ఎవరి ఆలినైతే, కూలికి పిలిచి పాడుచేశావో నా జీవితం నిలువునా కాల్చేశావో, ఆ దౌర్భాగ్యుణ్ణి.

శంక: (మూల్గుతూ) ఎవరు ! రాజయ్యా ! ఎంత అమాయకుడివోయ్! నీపెళ్ళాం వళ్లు కొవ్వెక్కి ఎవరితోనో లేచిపోతే నన్నంటావేం ?

హిందీ గొంతు: హే గురూజీ! కుచ్ పానీ పిలావో. మేరే హాత్‌సే మేరీ ప్యారికో పానీమే డూబాదియా. ఉస్కా పర్యవసాన్ యహీ. గురూజీ! కుచ్ పానీ పిలావో.

సౌదా: స్వామీ ! ఏమిటా అల్పజీవి ఆవేదన ?

నిరం; ఎప్పుడో తన ప్రాణేశ్వరిని నదిలో తోసేశాట్ట. దాని ప్రాయశ్చిత్తం ఇదీ అంటాడు. ముందు కొంచెం మంచినీళ్లియ్యి—పాపం ! కర్మనెవరు తప్పించగలరు ?

ఆవేశకంఠం: శంకరయ్యా ! నీగుండెల్లో నిద్రపోయేదాకా నాకు శాంతిలేదురా !

నిరం: అభిశప్త జీవులారా ! మీ ఆవేశాలూ పాత పగలూ, ఉద్రేకాలు ఇక్కడ ప్రదర్శించకండి ! మీరంతా ఒకే రైలులో సంఘజీవులుగా ప్రయాణిస్తున్నారు. ఇప్పుడు సంఘజీవులుగానే బాధపొందుతున్నారు. ఏదో అంగవైకల్యంతో మీ మనస్సులు వికలమౌతున్నయ్. ఇవిఅంతిమ క్షణాలు ఆత్మ శాంతికోసం భగవంతుణ్ణి ప్రార్థించండి ! మీ మరణశయ్యల్ని కరుణా హృదయాలుగా మార్చండి ! ఏదీ ఒక్కసారి అనండి !

'రఘుపతిరాఘవ రాజారాం
పతితపావన సీతారాం...'

(మూలుగుతున్న జీవాలన్నీ రామనామం పునీతమౌతున్నయ్। సన్న సన్నగా సాగిపోయిన పాట ఆగి,...)

సౌదా : రాత్రి కనిపించిన ఆ పచ్చిబాలింతరాలు తన భర్తకోసం అశ్రుధారాపాతంగా దుఃఖించే ఆవేదనకి విముక్తి లేదా ?

నిరం : లేకేం। నీవు దగ్గరుండి ఊరడించు. ఔదార్యంతో ఆవేదనాజ్వాలల్ని తడిపివేయి....

సౌదా : ఊరడింపులికి ఆరిపోయేవికాదు స్వామీ। నాకూ దుఃఖం పొరలు కొస్తుంది—

నిరం : నీదీ స్త్రీ హృదయమే। హే భగవాన్। నీ మృత్యుపరీక్షలో ఎంతమంది నాశనమైపోతున్నారు। వీళ్ళందరూ మరణిస్తే స్వర్గం। జీవిస్తే సౌఖ్యం ప్రసాదించు తండ్రీ।

సౌదా : స్వామీ। ఆవిడెవరో భర్తని త్యజించి, భవబంధాలు త్రెంచుకొని, సన్యాసం తీసుకొని ప్రపంచంమీదకు పోవాలనే ఆశతో బయల్దేరిందట... కాని చివరకి.........

నిరం : మిగిలేది గుప్పెడు బూడిద బరువు....హాఁ। శంకరయ్యా। ఏమిటది ?... నీ ప్రతిపక్షిమీద కత్తి గుచ్చావా ? చచ్చిన పాముని......

(శంకరయ్య వికటంగా నవ్వాడు. ప్రతిపక్షి రోజుతూ మూలుగుతూ నిరంజనయోగివైపు చూశాడు నిస్సహాయంగా. కన్నుమూశాడు.)

సౌదా : ఇంకా ఎందుకు చంపుకుంటారు స్వామీ ? ఏవిఁటీ ఆశల వికృత స్వరూపం?........

నిరం : ఎంతపని చేశావు శంకరయ్యా।

శంక : స్వామీ। పామునే చంపానుగాని మరేంకాదు. నా ప్రతిజ్ఞ నెరవేరింది. నా కక్ష తీరింది. ఒకప్పుడు వీడు నా భాగస్వామి. నన్నేమరించి ఎంతో సొమ్ము వాడుకొన్నాడు. అన్నింటికి సహించాను. నా కుటుంబంమీద తెగబడితే, నేనిక సహించలేకపోయాను. నేను చంపడానికే వెదుతుంటే వెదికే తీగ కాలికి దొరికింది. రాత్రినించి వాడి పేలాపన చూశారా ?

సౌదా : స్వామీ। లారీలు, రెడ్‌క్రాస్ సంస్థవారూ, పోలీసులూ, నర్సులూ అంతా వస్తున్నారు. చూడండి.

[తరువాయి 51 వ పేజీలో]

# శిశిర సౌభాగ్యము

-శ్రీ శనగన నరసింహస్వామి

1

నీహార ధూసర నేపథ్య పటము
నవకుంఠనమ్ముగా సవరించుకొనుచు
చల్లని అడుగులు మెల్లగా నిడుచు
వచ్చె శైశిర మొక్క ప్రాభాతవేళ

2

జాగ్రద్వియోగినీ జనము రేయెల్ల
స్మర బాణవేదనాతుతి వెక్కి యేడ్వ
పవన ధూతాశ్రుల బలె వేగుబోక
తృణలగ్న నీహార కణములు మెఱసె.

3

గేహాంతరావాస మోహమ్ము వీడి
యితరేతరాహ్వాన మతి గుంపుగూడి
భాస్కరోదయకాంతి పడు నెల్లచోట
గడపిరి పగ లతి కష్టాన ప్రజలు.

4

గొంతు బొంగురువోయి కుసుమాయుధుండు
తరుణాంగకములు క్రొవ్వెర వోవుచుండ
బయటకు పోలేక శయనమ్ము విడక
మనసుచేతనె లోకమును జుట్టివచ్చె.

**5**

పక్షి భిక్షుకులకు బాలమూర్తులకు
తమ కున్న యంతలో దానమ్ము జేసి
శాలి ధాన్యము దెచ్చి చాన లుప్పొంగ
గాదెల బోసిరి కర్షక ప్రజలు

**6**

శిశిరమ్ము సౌభాగ్య సీమాపదమ్ము
శిశిరమ్ము సంతోష శృంగార గృహము
సకల ప్రజకు భుక్తిసారమ్ము గురిసి
శిశిరర్తు వొక్కచే సేవార్హమయ్యె.

గలగల మ్రోగె పక్వ చ్ఛదచ్ఛటలు
జలజల రాలె వృక్ష చ్ఛదచ్ఛటలు
ఋతుసతీ మంజీర రుతములో యనుచు
బాటసారులు భ్రాంతిపడి చూచుచుండ.



వ్యాసము :

# పంత్ - కృష్ణశాస్త్రి

—శ్రీ వాసా సుబ్రహ్మణ్యశాస్త్రి

స్వాతంత్ర్యం సిద్ధించిన నాటినుండి మన దేశంలో ప్రాంతీయభాషల ప్రాముఖ్యం పెరిగింది. నాటినుండి ఒక భాషలోని విశిష్ట రచనలను మఱియొక భాషలోనికి అనువదించడం, వేర్వేరు ప్రాంతీయభాషల్లోని సాహిత్యాన్ని, కవులను తులనాత్మక దృష్టితో పరిశీలించడం, అను లక్షణాలు ప్రాధాన్యం వహించాయి. ఇట్టి పరిశీలన మన దేశంలో జాతీయైకమత్యాన్ని బలపర్చుటకు, అఖండ భారతీయ సంస్కృతిని రూపొందించుటకు చాల అవసరమై యున్నది. ఈ దృష్టితో పరిశీలించుటలో నాకు హిందీలో నవ్యకవియైన సుమిత్రానందనపంతుకు, తెలుగులో నవ్యకవియగు శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రికి, మధ్య చాలా పోలికలు గోచరించాయి. వీరిద్దరి మధ్య ప్రబలమైన సామ్యము భాషలో, రచనలో, శైలిలో, ఆశయాల్లో కాన్పించినది. వీరిద్దరి మధ్యను కొంత వైషమ్యంకూడా ఉండవచ్చు. ఏ ఒక్క కవీ యింకొక కవిని పూర్తిగా పోలియుండడం అసంభవం. ఎవరి వ్యక్తిత్వముద్ర వారికి ప్రత్యేకంగా కొంత ఉండకతప్పదు. వీరిద్దరిలోని సమాన ధర్మాలను చూపించి, వీరి కవిత్వాల్లోగల పోలికలను ఉదహరిస్తాను. పంత్ కలం పట్టునాటికి ఉత్తరదేశంలో వ్రజభాష ప్రాముఖ్యముతగ్గి 'ఖడీబోలీ' అమల్లోకి వచ్చింది. ఇది మన తెలుగు వ్యావహారిక భాషవంటిది. ఇందులో కవితారచన ప్రారంభమయింది. అంతవరకు వ్రజభాషలో వ్రాసిన 'హరిఔధ్' కవి 'ఖడీ బోలీ'లో వ్రాయనారంభించాడు. ప్రసిద్ధ రాష్ట్రకవి 'మైథిలీశరణ్‌గుప్త' తన కావ్యాలను ఖడీబోలీలోనే వ్రాసినాడు. 'పంత్' కూడా యీ భాషలోనే కవిత్వం వ్రాయనారంభించాడు. అప్పటికి హిందీ సాహిత్యంలో రీతి, వీరసాహిత్యకాలాలు వెళ్ళిపోయాయి. భారతేందుయుగం గతించింది. అప్పటికే వంగదేశంలో సాహిత్యక్షేత్రంలో Romantic revival వంటి ఉద్యమం లేచింది. టాగోర్ ప్రభృతులవల్ల వంగ వాఙ్మయంలో నవ్యభావ కవిత్వం అడుగుపెట్టింది. ఈ ఉద్యమం హిందీలోకికూడా ప్రసరించింది. ఈ ఉద్యమం ముఖ్యలక్షణాలివి.

1. వ్యక్తిస్వేచ్ఛ - వ్యక్తిభావప్రాధాన్యం - ఆత్మాశ్రయకవిత్వం.

2. ప్రకృతిని సౌందర్యఖనిగా గుర్తించుట - ప్రకృతిదృశ్య వర్ణన - సౌందర్యోపాసన.

3. పురావైభవము - దేశముయొక్క ప్రాచీనవైభవమును స్మరించి, ఉద్రేకముతో దానిని వర్ణించుట.

4. ప్రణయము - కాంక్ష - విరహము - దుఃఖము - వీని కీర్తన.

5. ఛందోనిర్బంధముల కొంత సడలించుట-కొత్తఛందస్సుల సృజించుట.

హిందీలో పై ముఖ్యలక్షణాలుకల కవితను 'ఛాయావాద్' అన్నారు. 'Art for Art's sake' 'కళ కళకోసమే' అను భావం యీ వాదానికి ముఖ్య ధర్మం. పంత్ యీపద్ధతి కవిత్వానికి హిందీ సాహిత్యంలో ప్రతినిధిగా నిల్చినాడు.

ఇటు కృష్ణశాస్త్రి తెలుగునాట గిడుగువారి వ్యావహారికభాషోద్యమం విజృంభించినకాలంలో కలం పట్టినాడు. తెలుగులో నాటికి పురాణప్రబంధయుగాలు గతించినవి. క్షీణయుగంలో కవిత్వానికి స్తబ్ధతాదశ వచ్చింది. హిందీలో 'భారతేందు'లాగా తెలుగులో 'వీరేశలింగం' కొంతపనిచేసి గతించినాడు. పిమ్మట నవ్యకవిత్వోద్యమం వచ్చింది. తెలుగునాటకూడా Romantic revival కాల్పనికోద్యమం అనే పేరుతో తలెత్తింది. నవ్యసాహిత్యపరిషత్తు లేచింది. ముందు చెప్పిన లక్షణాలు అనగా వ్యక్తిస్వేచ్ఛ - ప్రకృతిప్రేమ - పురావైభవప్రశంస - ప్రణయము - విరహము - దుఃఖము యివి ముఖ్యకవితా వస్తువులుగా భావకవిత్వం వెలసింది. తెలుగునాట కృష్ణశాస్త్రి యీ ఉద్యమానికి ప్రతినిధిగా నిలచాడు.

హిందీలో నవ్యలక్షణాలను 'ప్రసాద్' 'నిరాలా'లు అంకురింపజేసినా 'పంత్' యీ నవ్యత్వానికి నిజమైన ప్రతినిధియైనాడు. తెలుగులో నవ్యకవిత్వానికి గురజాడ రాయప్రోలులు ప్రారంభకులైనా 'కృష్ణశాస్త్రి' దీనికి ప్రతినిధి యనిపించుకొన్నాడు. దీనికి కారణం పంత్, కృష్ణశాస్త్రిలిద్దరూ తమ దేశాల్లో తిరిగి నవ్యకవిత్వాన్ని గానంచేసి ఒక ఉద్యమంగా దీన్ని ప్రచారం చేయడమే. దీనిపై లేచిన దూషణ - భూషణల దుమారాలకి వీరు గురైనట్లు యింకెవరూ కాలేదు. అందుచేతనే హిందీలో 'ఛాయావాద్' అనేసరికి ముందు పంత్ ప్రతినిధిగా స్ఫురణకు వస్తాడు. తెలుగులో 'భావ కవిత్వ' మనేసరికి కృష్ణశాస్త్రి తటాలున తలపుకు వస్తాడు.

వీరిద్దరికి రూపంలోకూడా సామ్యమున్నది. ఇద్దరూ గిరిజాలు పెంచినారు. ఇద్దరూ కవిత్వానికి Mural decorations యివ్వడంలో ఘనులు. ఇద్దరూ కవిత్వాన్ని శ్రావ్యంగాపాడి ప్రచారం చేసినారు. ఇద్దరూ ఆత్మాశ్రయ కవిత్వం వ్రాసినారు. విరహంలో వేగిపోయారు. వేదనచెంది దుఃఖాన్ని కవితలో మనసార వలపూర పాడుకొన్నారు. ఇద్దరిపైనా రవీంద్రుని ప్రభావం, కీట్సు, షెల్లీ, వర్డ్సువర్తుల ప్రభావం సమానంగా పడింది. గీతి కావ్యానికి (Lyric) ఉభయులూ హిందీ

తెలుగుల్లో మూలపురుషులై కొత్త ఛందస్సుల్ని సృజించారు. ఉభయులూ ప్రకృతిలో పారవశ్యం చెందారు. ఇద్దరూ సౌందర్యోపాసకులే. పంత్ 'అప్సరా' వ్రాయగా శాస్త్రి 'ఊర్వశి' వ్రాసినాడు. ఇద్దరూ ఊహాతీతమైన దేనికో అఱ్ఱులుచాచే ఆశాజీవులు, ఉన్నత్తభావశాలులు. ఇద్దరూ మధురంగా నదించే పదాల మేళవింపులో బహుచతురులు.

ఇక వీరి రచనలలోగల సామ్యాలను కొన్నింటిని ఉదహరిస్తాను.

పంత్—'పల్లవినీ' అను శీర్షికగల కవితలో—

"హై వర్ణ నీడమేరా భీ జగ్ ఉపవన్ మేఁ
మైఁ ఖగ్‌సా ఫిర్‌తా నీరవభావ గగన్ మేఁ
ఉడ్ మృదుకల్పనా పంఖో మేఁ నిర్జన్ మేఁ
చుగ్‌తాహూం గానే బిఖరే తృణమేఁ కణ్ మేఁ."

అని వ్రాస్తూ పక్షిలాగ తాను భావాంబరంలో కల్పనాపక్షాలతో విహరిస్తానని ఆశిస్తాడు. కృష్ణశాస్త్రియొక్క క్రింది రచన గమనించండి.

"కల విహంగ పక్షముల దేలియాడి
తారకామణులలో దారనై మెఱసి
మాయమయ్యెదను నా మధుర గానమున
వవ్వి పోదురుగాక నాకేటిసిగ్గు ?"

★ ★ ★ ★

పక్షినయ్యెద చిన్ని ఋక్షమయ్యెదను
మధుపమయ్యెద చందమామనయ్యెదను
మేఘమయ్యెద వింత మెఱపునయ్యెదను
అలరునయ్యెద జిగురాకునయ్యెదను"

ఇద్దరు కవులూ స్వేచ్ఛా ప్రవృత్తి కలవారై ప్రకృతివస్తువులంటే పరవశులై వానిలో రూపాంతరం చెందుతాయంటారు.

'పంత్' 'మధుకరీ'—

సిఖాదోనా హో మధుపకుమారి !
ముఝేభీ అపనే మీఠేగాన్
కుసుమ్‌కే చునే కటోరోంసే
కరాదో నా కుఛ్‌కుఛ్ మధుపాన్
నవల కలియోంకే ఘేరేఝూమ్

ప్రసూనోంకే అధరోంకో చూమ్
ముదితకవిసీ తుమ్ అప్‌నాపాత్
సీఖ్ తేహో సఖి! జగ్‌మేం ఘూమీ
సిఖాదోనా హేమధుకుమారీ!
ముఝే భీయే కేసరీకే గాన్"

ఇచట కవి ఆడ తుమ్మెదని సంబోధించి తనకు మధురగానము మధుపానము నేర్పమంటున్నాడు. కృష్ణశాస్త్రి 'తేటివలపు' అనే శీర్షికగల కవితలో భ్రమరకుమారుని సంబోధించి యిట్లు చెపుతున్నాడు—

"మలయ సమీరణోర్మికల మాలికలం బ్రణయార్ద్రగీతికల్
మలయుచు నాట్యమాడవు, సుమప్రమదామణి పుల్కరింపఁగన్
అళివర! తేనెలానవు వనాంతరమంతయు జిన్నవోయె గో
మలజలజాతపత్రములమాటున నేటికి దాగినాడవో!
అలరుచు మల్లికాపరిణయంబని వచ్చిరి పూవుబోండ్లు కో
యిల సవరించె గొంతు తమయేలికకై విరిదేనె పానకం
బళితతిగూర్చె పుప్పొడుల నత్తరులం బవనుండు గూర్చె గో
మలజలజాతపత్రములచాటున నేటికి దాగినాడవో!"

ఈ రెండు కవితలలోను కవులు తుమ్మెదల మారవులుగా భావించి సంబోధించుటలో మానవీకరణమున్నది. ఇది నవ్యకవిత్వంలోని ఒక ముఖ్యలక్షణం. పంత్ తాను వలచిన స్త్రీనిగూర్చి 'నారీ' అను శీర్షికతో నిట్లు వ్రాసినాడు.

"తుమ్హారే ఛూనేమేంథా ప్రాణ్
సంగ్‌మేం పావన గంగాస్నాన్,
తుమ్హారీ వాణీమేం కల్యాణి!
లహరోంకా గాన్
అపరిచిత చితవన్‌మేంథా ప్రాత్,
సుధామయ సాంసోంమేం ఉపచార్
తుమ్హారీ ఛాయామేం ఆధార్
సుఖదచేష్టాఓంమేం ఆభార్
కరుణ భౌహోంమేంథా ఆకాశ్
హాస్‌మేం శైశవ్‌కా సంసార్

తుమ్హారీ ఆంఖోంమేఁ కర్‌వాస్
ప్రేమ్‌నే పాయాథా ఆకార్.

"నీ స్పర్శలో ప్రాణమున్నది, నీ సంపర్కము పావనగంగాస్నానం. ఓ కల్యాణీ! నీ వాణిలో త్రివేణీ తరంగాల గానమున్నది." అని పలువిధాల ప్రేయసిని ప్రశంసిస్తాడు.

కృష్ణశాస్త్రి అట్లే 'ఊర్వశి'లో వ్రాస్తాడు.

"నీవు తొలిపొద్దు సునుమంచు తీవసొనవు
నీవు వర్షాశరత్తుల నిబిడ సంగ
మమున బొడమిన సంధ్యాకుమారి వీవు
తిమిర నిశ్వాసములు మాసికములు శర్వ
రీవియోగకపోల పాళికవు నీవె
నీవె నిట్టూర్పు, నీవె కన్నీరు విశ్వ
వేదనామూల్య భాగ్యమీవే నిజమ్ము
నేగళమ్మార పాడుకొనిన యఖాత
శోకగీతములం దీవె శోకగీతివి- ఊర్వశీ! ప్రేయసీ!"

ఇట్లిద్దరూ నారీప్రణయకీర్తనం చేసినారు. పంత్ తాను వలచిన స్త్రీ తనకు లభించక అన్యాయత్తకాగా యిట్లు విలపించాడు :

'హాయ్ మేరే సామ్‌నే హి ప్రణయకా
గ్రంధిబంధన్ హోగయా, వహ్ నవకుసుమ్
మధుపసా మేరా హృదయ్ లేకర్, కిసీ
అన్య మానస్ కా విభూషణ్ హోగయా!

కృష్ణశాస్త్రి తన ప్రేయసి తనను వీడి లోకాంతరగత కాగా యిట్లు వాపోయాడు :

"స్వచ్ఛమైనట్టి ప్రణయంపు సలిలధార
బోసి పెంచిన స్నేహంపు బూలతీవ
తావులను జిమ్మ నలరుల దాల్పకుండ
గాలితాకున నేలపై వ్రాలె నకట!

* * *

హృదయ నవజాత సుమమృదు మనోహరదళము
లదముతను ద్రుంచినారే, పెంధూళి జిదిమి వెదజల్లినారే!



హృదయ శోణితధార నెదుగు జీవితవల్లి
మొదలంట దూల్చినారే, భయదాగ్ని కీలలను వ్రేల్చినారే!"

ఇట్లు ఉభయులకూ ప్రేయసీ వియోగము సంభవించినపుడు జీవితము దుఃఖ దుర్భరముకాగా, వారు రోదించి ఆ దుఃఖాన్ని కవితలో క్రిందివిధంగా ఆలపించారు.

'పంత్'

"హృదయ! రో! అప్‌నే దుఖ్‌కా భార్
హృదయ! రో! ఉన్‌కో హై అధికార్
హృదయ! రో! యహ్ జడ స్వేచ్ఛాచార్
శిశిర్‌కా సా సమీర సంచార్
సిసక్‌తే హైఁ సముద్రసే మన్
ఉమడ్‌తే హైఁ నభసే లోచన్
విశ్వవాణీ హీ క్రందన్
విశ్వకా కావ్య అశ్రుకన్
హాయ్! మేరా జీవన్ ప్రేమ్ ఔ ఆంసూకే కన్"

*　　　*　　　*

'కృష్ణశాస్త్రి'

"నా హృదయమందు విశ్వవీణాగళమ్ము
ఘోరుఘోరున యీనాడు మ్రోతవెట్టు
దశదిశాతంత్రు లొక్క సుధాశ్రుతిని బెనంగి
చుక్కల మెట్లపై వంగివంగి నిలిచి
నిలిచి నృత్యోత్సవమ్ముల చలించు,
వెలుగులో యమృతాలొ తావులో మరేవొ
కురియు జడులుగాగ పొరలిపారు
కాలువలుగాగ పూర్ణకల్లోలముగ
కలదు నాలోన క్షీరసాగరము నేడు."

కవులిద్దరూ యీ విధంగా కవితలో విలపించడమే కాక క్రిందివిధంగా ముక్త కంఠంతో రోదించారుకూడా—

పంత్:

ఆఓ మేరే స్వర్ మేఁ గాఓ
జీవన్‌కే కరుణ స్వర్

మేరీ వంశీమేఁ లయ బన్ జాఓ
కరుణాక్రందన్ కరనేదో."

కృష్ణశాస్త్రి—

మీరు మనసారగా నేడ్వనీరు నన్ను
నన్ను విడువుడు ఒకసారి నన్ను విడిచి
నంత నేకాంత యవనికాభ్యంతరమున
వెక్కివెక్కి రోదింతును విసువులేక
విరతిలేక దుర్భర శోక విషమగీతు
లేడ్చిపైతు నెలుంగెత్తి యేడ్చిపైతు.

కవితలో నీవిధంగా రోదించి యిద్దరు కవులూ తమ దుఃఖభారాన్ని దిగద్రోసికొని కొంత మనశ్శాంతిని కూర్చుకొన్నారు.

"వియోగీ హోగా పహిలా కవి
ఆహ్ సే ఉపజాహోగా గాన్
ఉమడ్ కర్ ఆంఖోంసే చుప్‌చాప్
బహీహోగీ కవితా అన్‌జాన్"

"వియోగ దుఃఖితుడు ఆదికవి ఔతాడు. నిట్టూర్పునుండి గానంవెల్వడి యుంటుంది. కళ్ళనుండి యుబికివచ్చి నిశ్శబ్దంగా కవిత ప్రవహించి యుంటుంది." అని పంత్ చెప్పిన ఆశయం "క్రౌంచ ద్వంద్వ వియోగోత్థః శోకః శ్లోకత్వ మాగతః" అని ధ్వనికారుడు వాల్మీకి విషయంలో చెప్పిన వాక్యాన్ని సమర్థిస్తున్నది. Shelly కూడా "Our Sweetest songs are those that tell of saddest thoughts" అని యిట్టి భావాన్నే వెలిబుచ్చాడు. 'ఏకోరసః కరుణఏవ' అను భవభూతి వాక్యానికి 'వియోగీ హోగా పహిలా కవి' అనే వాక్యం భావాత్మక ప్రతిధ్వని అనిపిస్తుంది.

ఈ విధంగా దుఃఖానికి ఆవేశయుతమైన ఆవిష్కరణ యివ్వడంలో వీరిద్దరికీ వీరేసాటి.

పంత్ పైవిధంగా తన దుఃఖాన్నంతా వెళ్ళబోసుకొని చివరికి—

"అలిక్యా కహతీహై ప్రాచీసే
ఫిర్ ఉజ్జ్వలహోగా ఆకాశ్ ?
పర్ మేరే తమపూర్ణ హృదయ్‌మేఁ
కౌన్ భరేగా ప్రకృత ప్రకాశ్ ?

'అంధకార బంధురమైన నా హృదయంలో యెవరైనా జ్యోతిని వెలిగిస్తారా ?' అని వాపోతాడు.

ఇల్లే కృష్ణశాస్త్రికూడా—

"ఆకస మాలోకనముగ
లోకమెల్ల వీనుగ కా
లాంతమునకు కాచియుందునా ?
ఆసలేని ఆసకు
ప్రాణాంత మేని వేచియుందునా ?
చివురింపదో చైత్రశుభో
త్సవ విభాత కల్యాణము
ఈ దరిద్ర హేమంతమున ?

అని వాపోయాడు.

పంత్ నారీనేత్రముల వర్ణిస్తూ—

"నయన నీలిమాకే లఘునభమేం
కిస్ నవసుషమాకా సంసార్,
విరల ఇంద్రధనుషీ బాదల్‌సా
బదల్ రహాహై రూప్ అపార్."

అని నయన నీలిమను చిన్న ఆకాశముగా రూపణచేయగా కృష్ణశాస్త్రి యింకా లోతుకు పోయి—

"ఆమె కన్నులలోన అనంతాంబరంపు నీలినీడలు కలవు
వినిర్మలాంబు పూర గంభీరశాంత కాసారచిత్ర
హృదయములలోని గాటంపు నిదురచాయలందు నెడనెడగ్రమ్మ
సంధ్యావసాన సమయమున నీపపాదపశాఖికాగ్ర
పత్ర కుటిల మార్గములలోపల వసించు
ఇరుల గుసగుసల్ వానిలో నిపుడునపుడు వినబడుచునుండు
మఱికొన్ని వేళలందు వానకారు మబ్బుల మెయివన్నె వెనుక
గాగు బాష్పమ్ములామె నేత్రములలోన బొంచుచుండును
ఏదియొ అపూర్వ మధురరక్తి స్ఫురియించుగాని
అర్థమ్ముకాని భావగీతమ్ములవి—

అని వర్ణించాడు.



'పంత్' సంధ్యా సమయాన నిశ్శబ్దంగా నున్న గ్రామసీమను వర్ణిస్తూ—

నీరవ సంధ్యామేఁ ప్రశాంత
డూబాహై సారాగ్రామ ప్రాంత
పత్రోంకే ఆనత అధరోంపర్ సోగయా నిఖిలవన్‌కా మర్మర్
జో వీణాకే తారోంమేస్వర్"

అని వ్రాయగా కృష్ణశాస్త్రి వ్రేపల్లెను రాతిరిపూట చిత్రించాడు.

"అది శరద్రాత్రి శీత చంద్రాతపాంత
రాళ రమణీయ రజత తల్పంబునందు
జల్లగా నిద్రవోవు వ్రేపల్లెవాడ
సకల గోపాల గోపికా గణముతోడ." అని

పంత్ తన ఆదర్శపూరుషుడగు గాంధీజీని 'బాపూకేప్రతి' అను శీర్షికలో నిట్లు కీర్తించాడు.

"నిర్వాణోన్ముఖ ఆదర్శోంకే అంతిమ దీప శిఖోదయ్ !
జిన్‌కీ జ్యోతి ఛటాకే క్షణసే ప్లావిత ఆజ్ దిగంచల్,
గత ఆదర్శోంకా అభిభవ హి మానవ ఆత్మాకీ జయ్
అతః పరాజయ్ ఆజ్ తుమ్హారీ జయ్‌సే ఉజ్జ్వల్,
మానవ ఆత్మాకే ప్రతీక్ ! ఆదర్శోంసే తుమ్ ఊపర్
నిజ ఉద్దేశ్యోంసే మహాన్ నిజ యశసే విశద చిరంతన్
సిద్ధ నహీఁ తుమ్ లోకసిద్ధికే సాధక్ బనే మహత్తర్
విజిత ఆజ్ తుమ్ నరవరేణ్య ! గణజన విజయీ సాధారణ్ !"

* * *

కృష్ణశాస్త్రి తన ఆచార్యుడు ఆదర్శపురుషుడునగు రఘుపతి వేంకటరత్నము నాయునికి క్రింది పద్యములలో జోహారు లర్పించినాడు.

"ఈ దివ్యర్షిపదమ్ము భారతమునందే పుట్టి యాధ్యాత్మికే
చ్ఛాదారిద్ర్యమున న్నశించు ప్రియ శిష్యశ్రేయ మాసించి యా
వేదానంతపథమ్ములన్ కదలిరావే తాల్చికోనిమ్ము నీ
పాదాంభోజ రజోలవమ్ము గురుదేవా ! మా శిరోవీథులన్.

ఈ జడజీవితమ్ము పలికించితి వీయఘపంకమందు నం
భోజము మొల్వఁ జేసితి వపూర్వము నీదయ యీ నిశీధి నీ

రాజన మెత్తినావు విపులమ్మగు నీయెద నిండెనే శర
ద్రాజిత రమ్యకాంతు లమృతమ్ములు స్వర్గలతాంతవాసనల్.

* * *

వీరిద్దరూ నవీన ధ్వనుల సృజించారు. కవితకు శ్రావ్యసంగీతానికి మేళనకూర్చారు. పదాల కూర్పులో క్రొత్తపోకడలు పోయారు.

పంత్ — 'ఫిర్ తుమ్ తమ్‌మేఁ మైఁ ప్రియతమ్ మేఁ
హోజావేఁ ద్రుత అంతర్ధాన్'
కృష్ణశాస్త్రి— 'ఎదలోపలి యెదలో నెమ్మదిలో'
'నెలరాజా ! వెన్నెలరాజా !'

పై పోకడలు ఒకే కలంనుండి వచ్చినట్లుంటాయి.

కోయల్‌కాహ్ కోమలబోల్, కోకశోకసే దీవానా,
స్పందన్, కంపన్ జానవజీవన్, మురలీకే సేసురసీలేహైఁ
ఇస్‌కీ ఛిద్రసురీలే, విధురఉర్‌కే మృదుఉద్గార్, నికసా-
ఇచ్ఛాకీ నవనవదశ్, బంధేహైఁ జీవనతార్, నవలప్రవాశ్
జగకే ఉర్వరీ అంగన్ మేఁ,—

ఇవి పంత్‌యొక్క వింత కూర్పుల్లో కొన్ని—

నిట్టూర్పుగాడ్పులు, నవప్రసవాలజాలులు, కమ్మతెమ్మెరలు, నిండు తెలి వెన్నెల వన్నెల మల్లెపూవులు. కన్నీటిసరుల దొంతరలు, కనుబొమ్మ నును గొమ్మవంపులు, సడిలేని నడిరేయి, మనసార వలపూర కలతదీర, విశ్వగాన వియత్తరంగిణి, ఎలదేటి చిరుపాట పెలయేటి కెరటాలు మోహన వినీల జలధరమూర్తి శోకంపుటెడారులు నవానూనగాన విస్తృత వ్యోమయానాలు పచ్చనితోటలు, విచ్చిన పూవులు, ఊగేగాలులు, తూగేతీగెలు, నిశ్వాసతాళవృంతాలు —ఇవి కృష్ణశాస్త్రియొక్క కొన్ని వింతకూర్పులు.

వీరిద్దరూ కవిత్వంకోసమే బ్రతుకుతారనిపిస్తుంది. కల్పన, అనుభూతి, చింతనల సమ్మిశ్రణ ఉభయులలోను గోచరిస్తుంది. హృదయపు లోతులలోని భావనలను, ప్రవృత్తుల గుసగుసలను, పతనోదయాలను బాగా పట్టి చూపగలరు. ఈ విషయంలో వీరిద్దరూ సంస్కృత సాహిత్యంలోని భవభూతికి సాటివస్తారు. ఉభయులలో తీవ్ర సంవేదన ఉన్నా శాస్త్రికంటె పంత్ ఆవేశము కొంత సంయమంతో కూడినది. ఆత్మాశ్రయ కవులౌట యిద్దరిలోను దుఃఖవాదము కరుణాధార యెక్కువ. ఇంకను వీరుభయులమధ్యా కల సామ్యభోరణులను చూపుట కెన్నో

యుదాహరించవచ్చును. కవి హృదయములు భావనలు వా రేప్రాంతమునకు చెందినా ఒకే విధముగా నుండవచ్చునని పై నిదర్శనములతో చెప్పవచ్చును. నేడు యే భాష సాహిత్యముకాని తాను ప్రత్యేకముగా గూడుకట్టుకొని యుండజాలదు. వివిధ భాషా సాహిత్యాలమధ్య ఆదాన ప్రదానములు జరుగవలసి యున్నవి. వివిధ భాషా సాహిత్యముల తులనాత్మక పరిశీలన సాహిత్య సాన్నిహిత్యమునకు దారి తీసి, విశ్వసాహిత్య నిర్మాణమునకు తోరణముకట్టి, విశ్వసౌభ్రాత్రమును సాధించి లోక కల్యాణము నాపాదించగలదు.



★ మృత్యురంగంమీద ★ [38 వ పేజీ తరువాయి]

విరం : రానీ! చేసినతప్పు దిద్దుకోడానికిదే అవకాశం. ప్రజల ప్రాణాలు భయోత్పాతంకాకుండా, ప్రభుత్వం తగిన కట్టుదిట్టం చేయాలి! ప్రమాదమన్నది ప్రమాదంలాగే వుండిపోవాలిగాని, దైనందిన కృత్యంగా సాగిపోతుంటే, ఇక సృష్టే తలక్రిందులైపోతుంది. క్షతగాత్రులంతా లేవండి! ఒక్కసారి అనండి! 'రఘుపతిరాఘవ.........'

(అంతా మూల్గుతూ, ఊగుతూ, రామస్మరణంలో కరిగిపోతున్నారు.)

(తెర)

# వాడని అందాలు

—శ్రీ "అమరేంద్ర"

నిదురించే మదిలోపల
కదలిందొక కలనాదం
ముడుతలలో నాగేంద్రుడు
పడగవిప్పి పూత్కారం!
మోడులైన కొమ్మలలో
తొడిగిన తొలిచిగురుపాట
కాళరాత్రి గర్భంలో
కలలుకనే తరుణసంధ్య
మూగవీణ తీగలలో
సాగిన నవరాగరేఖ!
కాని—
కలికాలపు సత్యాలే
పలుకగోరు నాకంఠం
వలదుసిగ్గు, స్వరంనాది
అనుభూతుల వరంనీది
ఆవేశపు జ్వాల నాది
అనాది అనుకంప నీది!
పాతంటే నేటి ఘనులు
రోతపడుతు ఛీత్కారం
నూతనమనగానె ఎగిరి
జోతలతో సత్కారం!
నాటి కొత్తలన్నీ
నేటికి చెత్తయితే
నేటిగొప్పలన్నీ
మరునాటికి ఏమౌతాయో?

నాడూ నేడూ నరులకు
తోడుగ నీడల్లాగా
వీడక వెన్నంటివచ్చు
వాడని అందాలు లేవ?
ఊడని బంధాలు లేవ?
మరులను సురులను జేసే
కరుణ పాతపడుతుందా?
మనుగడలో మధువులొలుకు
ప్రేమ వెగటు పుడుతుందా?
చరణమ్ముల కిందిమూగ
ధరణి ముసలి దవుతుందా?
శిరములపై నీలసౌమ్య
దరహాసము విరియునభము
నక్షత్రపు చిల్లులతో
రక్షణ నీయగజాలని
పరువుకాని తాతగొడుగ?
బరువై పోతుందా!
కనులుంటే జగమంతా
నురుగులెత్తు నవరసధుని
మనసుంటే క్షణక్షణము
తరగని ఆనందపుగని
అనుదినమూ బతుకులోన
ఆశనిరాశల నృత్యం
చిరనూతనమై తోచే
తరతరాల సత్యం!



# రవీంద్రుని రూపకములు*

—డాక్టరు. కొత్తపల్లి వీరభద్రరావు

జలకమాడిన 'నిశామిళితవారి', ఒడలి పసిమికి మిసిమి మిసిమితేగా, మెడలోని పసుపుబొందు గళరేఖ నిసుమడింపగా, తెలినవ్వువెల్లువలతో మనుమల మనుమరాండ్ర కోడిగముచేయు ముసలి ముత్తైదువ, మన భారతీయ సంస్కృతి. ఈమె ముసలితనము జీవనదియొక్క ముసలితనము. జీవనది ముత్తైదువును, నభో నవోఢయు కూడ. ప్రతి వర్షము, ఆమె జీవనమున మార్పుతెచ్చును. ఈ మార్పు రసవంతమయినది గనుక, ఆమెకు 'పళ్ళు పైబడినను', అనుభూతి అధికమగునేకాని హృదయములోని ఆర్ద్రిత తగ్గదు. కనుకనే మహానది, ఏనాటి ముసలియో అయినను, ఈనాటికిని 'రంగత్తుంగ తరంగ హస్తముల'తో రత్నాకరు నాహ్వానించు రమణీమణి. భారతీయ సంస్కృతియు నిట్టి పునరుజ్జీవన శక్తి కలిగినది. నవనవోన్మేషశాలి యైన ప్రజ్ఞ కలది. ఈ ప్రతిభ, ఎడనెడ కారణాంతరములచే అంతర్వాహినియైనను, అనుకూలపరిస్థితు లేర్పడినప్పుడెల్ల అభివ్యక్తమగుచునేయున్నది. ఇట్లు మన సంస్కృతి 'క్రొత్తపాతల మేలు కలయిక' యయి, జీవనది యుపమానమున కెంతయు తగియున్నది.

మన సంస్కృతిలో గల పునరుజ్జీవనశక్తియే; దాస్యశృంఖలములలో దేశమున్నను, మన సంస్కృతికి చిహ్నము లనదగు మహాపురుషుల నెందరినో సృజించినది. అట్టి వారిలో శ్రీ రవీంద్రకవీంద్రు లొకరు (జననము 7-5-1861. మృతి 7-8-1941). ఈ మహాపురుషుని జీవితము, కవిత్వము; 'క్రొత్తపాతల మేలు కలయిక'. ఈ 'మేలుకలయిక' యేమన సంస్కృతి యందలి వైశిష్ట్యము. త్రికాలాబాధితములైన సత్యములు కొన్నియుండగా, దేశకాల పాత్రానుసారము మారులౌకిక ధర్మములు కొన్ని యున్నవని అంగీక

---

* కేంద్ర మంత్రులు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అధ్యక్షులు, బహుభాషా కోవిదులైన డా. బెజవాడ గోపాలరెడ్డిగారు; రవీంద్రుని నాటికలకు యథామూలముగ చేసిన అనువాదములు చదివిన తరువాత, ఇంగ్లీషులోకంటె తెలుగులో నాకు రవీంద్రులు బాగుగా రసానందమును కలిగించిరి. ఈ వ్యాసరచన కదియే ప్రోత్సాహ మిచ్చినది. మూలకవి ఉక్తి వైచిత్ర్యమును చాలవరకు తెలుగులోనికితెచ్చి అనువాదకులు కృతకృత్యులైరి. ఈ వ్యాసములో శ్రీ రెడ్డిగారి అనువాదములలోనుండి భాగములను గ్రహించితిని. వారికి నా కృతజ్ఞతాపూర్వక వందనములు.

రించుటవలననే భారతీయ సంస్కృతి నాటినుండి నేటివరకు అనుస్యూతముగ ప్రవహింపగలిగినది. మార్పు జీవలక్షణము. దీనిని గుర్తించిన జీవికి, మృత్యువు వ్యక్తిగతముగ నున్నను, జాతిగతముగ లేదు. అట్టి జాతి సృష్టించిన సంస్కృతియు, అజరామరము.

ఇట్టి సంస్కృతికి వారసుడై రవీంద్రుడు, తన కర్తవ్యమును గుర్తించి ప్రాక్పశ్చిమ సంస్కృతులకు సమన్వయ భూతమైన కవితను రచించెను. ఈ ప్రతిభావంతుని స్మరించినప్పుడు - ఆంగ్ల కవియగు 'టెన్నిసన్' (Tennyson), 'విక్టర్ యుగో' (Victor Hugo) అను పరాసు కవిపుంగవుని గూర్చి వ్రాసిన - ఈ క్రింది పద్యపాదములు జ్ఞప్తికివచ్చును :

"Victor in Drama, Victor in Romance,
Cloud weaver of phantasmal hopes and fears.
Lord of human tears. Child-lover and
Weird Titan by the weight of the years
As yet unbroken......"

సర్వతోముఖ ప్రతిభను ప్రస్తుతించు పై విశేషణములన్నియు శ్రీ రవీంద్రుని విషయమునను సార్థకములు గనుక పై పద్యపాదముల స్ఫూర్తి మనకు కలుగుచుండును. రవీంద్రుడు స్పృశించి అలంకరింపని సాహిత్యశాఖ లేదు. ఆతని స్పర్శ మోడువడిన కవితాశాఖకు ఆమనిరాక. బీడుపోయిన కావ్య క్షేత్రమునకు నభస్సమాగమము. ఆతడలంకరించి ఆనందింపచేయని సాహిత్య రంగము లేదు. ఆనందింపజేసి ఉపదేశమీయని సాహిత్యవిభాగము లేదు. ఋషి కల్పుడయిన మహాకవి పరిణతవాక్కృతనిది.

ఈ మహాకవి ప్రతిభాజ్యోతిని స్నేహసిక్తముచేసి ప్రజ్వలింపజేసినది— ప్రాక్పశ్చిమ సంస్కృతుల, సాహిత్యముల, ఆధ్యాత్మిక తత్త్వముల సమన్వయోద్భూతమైన సమ్యగ్విజ్ఞానము. ఆ మహాకవి దృష్టికి ప్రాంతీకత్వములేదు. భావమునకు ఎల్లలు లేవు. అణువు మొదలు అజాండము వరకు గల విరాణ్మూర్తిని ఆకళింపునకు తెచ్చుకొనిన స్థితప్రజ్ఞుడు ఆ మహాద్రష్ట.

సత్త్వరజస్తమోగుణాత్మకమగు ప్రకృతి యొక్క వైవిధ్యమంతయును ఆతని కవితలో కలకలలాడుచుండును. ఆతనికి ప్రకృతి-పువ్వులనవ్వులతో, వలపుల గుబాళింపుతో నొకమారు ; "ఘుమఘుమావిర్భూత ఘోరసంకులజీమూత పటల సంఛిన్నాభ్రభాగ" యగుచు భీషణాకృతితో నొకమారు ; దర్శన మిచ్చినది.

సత్యము యొక్క ముఖమును ప్రకృతి కప్పుటలో ; హిరణ్మయపాత్రఅయినను మృణ్మయపాత్ర అయినను, కవికి ఉపాదేయము సత్యమే యను ధర్మసూక్ష్మ మును గుర్తించిన వేత్త, రవీంద్రకవీంద్రుడు. సుఖమైనను, దుఃఖమైనను జీవింపదగినది జీవితమని గ్రహించిన మహాకవి కనుకనే అతని కవితలో జీవిత రంగమందలి సమస్త విషయములకును యథోచితమైన స్థానమున్నది. జీవితము లోని ఎగుడుదిగుడులు, ఒడుదొడుకులు ; సెలయేటి బిలబిలలు, ఎలదేటి పాటలు; వెన్నెల వెలుగులు, వేడియూర్పులు; కన్నీటి వెల్లువలు, పన్నీటి జల్లులు— అన్నియు అతని కవిత్వములో రంగరింపబడినవి. జీవితరంగములో అతని కవిత కందని అనుభూతిస్థాయి లేదనిపించును. అతనికవితలో వ్యక్తిగతానుభూతియే గాక, సార్వకాలీనమానవాళి యనుభూతి విభూతి ప్రకాశించును.

రచనలో వాగర్థప్రణయమును ఈ మహాకవి గుర్తించినంత నిశితముగా గుర్తించిన ఇంకొక నవ్యకవి లేడనుట సత్యదూరముకాదు. అతని కవితాం బుధిలో, ప్రాచ్యపాశ్చాత్య కావ్యసంస్కృతులు కలిసి, స్వస్వరూపములను విడిచి నవ్యమాధురిని పొందెను. కనుకనే అతని కవితాబ్ధి, రసార్ణవముకాని, ఉప్పునీటి వెల్లువకాదు. ఈ మహాకవి భారతి, నవరసరుచిరము. నిత్యనూతనము సముజ్జ్వలము, రసయుతము. సంసారములోని సాగరము లవణాబ్ధి. ఈ కవి కావ్యసంసారములోనిది రసార్ణవము. కనుక, రవీంద్రకృతి హ్లాదైకమయి, నిత్యమానందఘన.

రవీంద్రుని అత్యుత్తమ కవితలో-వర్డ్స్వర్త్ (Wordsworth) కవియొక్క ప్రకృతిచిత్రణపాటవము. శబ్దవిన్యాసము; షెల్లీ (Shelley) కవియొక్క బుద్ధిగమ్యమైన ఆధ్యాత్మికత్వము; కీట్స్ (Keats) కవియొక్క సౌందర్య సమీక్ష; బ్రౌనింగ్ (Browning) కవియొక్క తత్త్వజిజ్ఞాస; బైరన్ (Byron) కవియొక్క శబ్దగాంభీర్యము, ధారాశుద్ధి; విక్టర్‌యుగో (Victor Hugo) కవియొక్క 'కన్నీటిపాట'; గెథే (Goethe) కవియొక్క మానవ మనస్తత్త్వ పరిశీలనానిపుణత కలవని పాశ్చాత్యవిమర్శకు లందరు ఐకకంఠ్యముగ నంగీ కరించిరి. ఈ సామగ్రికితోడు అతనిలో - ఉపనిషద్విజ్ఞానము, వైష్ణవకవుల భక్త్యుద్రేకము, వాల్మీకి వ్యాసకాళిదాసాది మహాకవుల వ్యంగ్యవైభవము. అను పైతృకసంపత్తియు కలదు. ఇన్ని ఉదాత్తదివ్యాంశలు పుంజీభవించి యున్న పుంభావసరస్వతి గనుకనే రవీంద్రుని కవిత ప్రపంచ మహాకవుల కవిత కెవ్విధముగను తీసిపోదని రసజ్ఞు లంగీకరించియున్నారు.

రవీంద్రునకు మొట్టమొదటి నుండియు, ప్రాక్పశ్చిమ సంస్కృతుల 'మేలుకలయిక' యే ప్రపంచమునకు తరణోపాయమని దృఢవిశ్వాసము. ఈ భావమునే వ్యక్తముచేయుచు నాతడు తన పదునారవయేట (1877) వంగ పత్రికయైన 'భారతి' లో నొక వ్యాసమును వ్రాసెను.[1] ప్రాచ్యపాశ్చాత్య దేశములు తమ తమ సంస్కృతులను ఇచ్చి పుచ్చుకొను సంబంధ మేర్పరుచుకొన్ననాడే ప్రపంచమునకు మేలొనగూడునని ఆ వ్యాసముయొక్క సారాంశం. పదునారవ యేట అతడీ వ్యాసమునచూపిన సమన్వయదృష్టియే, జీవితాంతము వరకు ఆతనికి మార్గదర్శకముగ నుండెను. ఈ సమన్వయ దృష్టియే ఆతని జీవితమున, రచనలందును మనకు గోచరించు ప్రముఖవిషయము.

మహాకవి రవీంద్రుడు కేవలము భావాంబర వీథియందే విహరించు కవియనియు, ఆతనికి వ్యావహారికజగత్తు ప్రమేయము కాదనియు విమర్శించువారు కొందరు కలరు. ఇది పూర్ణముగ సత్యము కాదు. ఇందు సత్యమైన భాగ మున్నచో అది మహాకవుల కందరకు సామాన్యమైన విషయమే. కనుక రవీంద్రునిలో నిది ప్రత్యేకముగ విమర్శింపదగినది కాదు. ఆతని భావము ఆకాశాంచలమున ఆశాంతములలో మెరుగులు దిద్దినను ఆతని పాదములు భూతలమున సుప్రతిష్ఠితములే. కావుననే ఆ మహాకవి శిరోజములలో నక్షత్ర పుష్పములు. పాదములపై శాద్వలావని నిలిచిన మసృణతుషారకణజాలము. బాలబాలికల లేనగవు సెలయేటి గలగలలు, 'బాధాసర్పదష్టుల' హాహాకారములు, కొండలపై పడిన మొగిళ్ళ పొడుగునీడలు, వల్మీకాగ్రమున నిలిచిన ఇంద్రధనుస్సు ; రవీంద్రుని హృదయమును సమానముగనే ఆకర్షించెను. ఆతనికి ప్రతి ప్రాణియందును సానుభూతి కలదు ; ప్రతి మనఃస్థితియందును ఆదరము కలదు. ఇందువలననే ఆతని కవితకు విశ్వజనీనత కలిగినది.

కాని సౌందర్యోపాసనలో ఆధ్యాత్మికత్వము లోపించినచో ఆ ఉపాసకుడు ఇంద్రియైకగ్రాహ్యవస్తుసౌందర్యమునే గ్రహింపగలడు గాని, అతీంద్రియ సౌందర్యమును దర్శింపలేడని ఆతని దృఢవిశ్వాసము. ఈ 'లోచూపు'

---

1. "In 1877, he published in Bharati an essay, 'The Hope and Despair of Bengalis', in which a master-theme of his whole life appears, the necessity of East and West, to each other. Europe's intellectual freedom and India's conservatism, Europe's arts and India's philosophy Europe's independence and India's mental tranquillity, must be moulded together, this body insists, are a better civilization can be made." (Page - 30)

'Rabindranath Tagore' by Edward Thampson.

లేనివాడు కవి కావచ్చునేమో గాని, మహాకవి కాలేడని ఆతని యూహ. నానావర్ణ శోభిత యగు ప్రకృతికి వెనుక దాగియున్న సత్యమును గ్రహించుటకు ఈ చర్మచక్షువు చాలదనియు, జ్ఞానచక్షువు కావలెననియు నాతని విశ్వాసము. ఆతని కవితలో వ్యావహారికజగత్తునకు వెనుక గల 'పెంజీకటి కవ్వలి వెలుగు' లీలగా కొన్ని చోటులందును, స్ఫుటముగ కొన్ని పట్టులందును కన్పట్టుచుండును. జీవితములో నాతడు ఆదర్శవాది. ఆతని కవితలో నైరాశ్యమునకు తావులేదు. ఎడనెడ తడబాటున పడిన నిరాశాసూచకములగు భావములు రవీంద్రుని కవితలో కన్పట్టినను, అవి తాత్కాలికభావోద్వేగమున జనించినవి గాని, ఆతని మనోధర్మమునకు మూలభూతము లైనవి కావు.

కవితలో రవీంద్రుని ప్రతిభ గేయాత్మకము. కనుకనే ఆతని రచనలలో స్ఫటిక నిర్మలములైన భావములు తళతళ మెరయుచు, సహృదయ హృదయాకర్షకములై యుండును. ఆ భావములకు కథలో పొత్తు కలిగినప్పుడు కూడ వాని ప్రకాశముముందు ఇతివృత్తరేఖ కాంతి తరిగియుండుట కలదు. ఆతని గేయకవితారీతి పుష్పసదృశముగ, నగ్నసుందరముగనుండి, ఇతివృత్తి వస్త్రభారమును కూడ మోయలేకయుండుటయు కలదు. ఇందువలననే సన్నివేశములకు, పాత్రలకు, ప్రాముఖ్య ముండు రూపకరచనయందుకూడ రవీంద్రుని గేయకవితా ప్రాగల్భ్యమే కన్పట్టునని విమర్శకుల యూహ.[2]

నాటకకవిగా మనము రవీంద్రుని పరిశీలించునప్పుడు పాశ్చాత్య కవులలో—షెల్లీ, బ్రౌనింగ్, మేతర్‌లింక్ కవులు జ్ఞప్తికి వత్తురు. సంస్కృత మహాకవులలోని భావుకత రవీంద్రుని రూపకములలో కలదుగాని వారి రూపక నిర్మాణ నైపుణి కొంత తక్కువ. రవీంద్రుని నాటికలలో కవిత కున్నంత ప్రాముఖ్యము నటనకు లేదు. సంకేతమున కున్నంత ప్రాధాన్యము వాస్తవికతను లేదు. భావముల కున్నంత స్థానము వస్తువునకు లేదు. కాని నాటక కవిగా కూడ రవీంద్రుడు ప్రతిభావంతుడే యని చెప్పుటకు తగినన్ని విశిష్ట ధర్మము లాతని రూపకములలో లేకపోవు. వ్యావహారిక జగత్తునకు కొంత

2. "His own countrymen do not rank Rabindranath's dramas high· Which is a reason why a foreigner should be chary of praising them But I think better of them than Bengali critics do, and better of them even as drama. Although they are literary dramas it is not true that they are literary exercise, out of touch with life." (Page - 288)

'Rabindranath Tagore' by Edward Thampson.



పైన నిలిచి ఆతడు విషయమును పరిశీలించినను, ఇది తటస్థదృష్టి కలుగుటకే కాని ప్రపంచమునుండి పలాయన మగుటకు కాదు. తటస్థదృష్టి యున్ననాడే మమతావిరహితముగ మానవ మనస్తత్త్వమును గూర్చి వ్రాయవచ్చునని యాతని యూహ.

రవీంద్రుని రూపకములను మూడు తెగలుగ విభజింపవచ్చును. ఇందు మొదటి తెగకు చెందినవి, సాంకేతికత్వములేని రమ్యరచనలు. వీనిలో నాటక ధర్మములను బట్టి చూచిన 'విసర్జన' (1890 రచనాకాలము) ఉత్తమ నాటకము. కవితా ధర్మమును బట్టిచూచిన 'చిత్రాంగద' (1891) 'మాలిని' (1896) అనునవి ఉత్తమ శ్రేణికి చెందినవి. రెండవ తెగకు చెందినవి చిన్న నాటికలు. అంత్యప్రాస ఉన్న ద్విపదలను బోలిన ఛందస్సులో ఇవి రచింపబడెను. ఇందలి ఇతివృత్తము ప్రఖ్యాతము. సంస్కృత కథలనుండి గాని, వీర గాథలనుండి గాని గ్రహింపబడెను 'కాహిని' అనుపేర ప్రచురింపబడిన పద్య నాటిక లివి (1892-1900). సాంకేతికములైన గద్యనాటకములు మూడవ తెగకు చెందినవి. 'శారదోత్సవనాటిక' (1908); 'ప్రాయశ్చిత్త' (1909) మొదలగునవి. ఈ విభాగములలో ఉత్తరోత్తరము, కవిత్వముకంటెను, 'నటన' కంటెను భావములకు ప్రాధాన్యము హెచ్చుచు వచ్చెను. కొన్నింటియందు అంగప్రత్యంగ సామరస్యముగల మూర్తి నిర్మాణమునందును లోపములున్నవని విమర్శకులందురు. 'ముక్తచ్ఛందము' న వ్రాయబడిన నాటకములకు, ఆంగ్ల సాహిత్యములోని ఎలిజెత్తు కాలమునాటి నాటకనిర్మాణ పద్ధతికి, బింబ ప్రతిబింబభావము కలదు. ఇందువలన మూలములోని లోపములుకూడ కొన్ని రవీంద్రుని రూపకములకు సంక్రమించెను. కథలో సన్నివేశమున మార్పు లేక పోయినను రంగములు మారుట వీనిలో ముఖ్యమైనది. రంగముల సంఖ్య పెరుగుటవలన, యవనిక చాలసార్లుజారుటయు దానివలన సదస్యుల రసానందమునకు విచ్ఛిత్తికలుగుటయు జరుగును. దీనిని పరిహరించుటకే, గీర్వాణరూపకమున అంకములలో రంగములు (Scenes) మారినను, ఒకే అంకమున వివిధ రంగములు లేకుండ చేసిరి. ఈ సంప్రదాయమునకు విరుద్ధముగ, ఆంగ్ల నాటకములలో ఒక అంకమున వివిధరంగము లుండుటయు, అందువలన 'పదేపదే' ప్రతిసీర జారుటయు, సామాజికులకు ఆనందమున విచ్ఛిత్తికలుగుటయు కలదు. ఈ లోపము 'షేక్స్పియరు' మహాకవి నాటకములలో కూడ కొన్నింటియందు

కలదన్నచో దీని వ్యాప్తి తెలియును.[3] ఇట్టి లోపములు ఒండు రెండున్నను, రవీంద్రుడు తన పద్యనాటికలలో నవీనచ్ఛందములను సృష్టించుటలో చూపిన నైపుణ్యము, సాధించిన వాగర్థ సామరస్యము, సత్యమార్గగవేషణాసక్తి, ప్రశంస్యము.

రవీంద్రుడు పుస్తకరూపమున వెలువరించిన పద్యనాటికలలో మొట్ట మొదటిది 'రుద్రచంద' (1881) అనునది. దీనిలో ఎనిమిదివందల పాదములు, పదునాల్గు రంగములు కలవు. ఆతని సోదరుడైన జ్యోతిరింద్రనాథున కిది ప్రేమపూర్వకముగ అంకితము చేయబడియుండుట చూడగా, రవీంద్రుడు ఇంగ్లండు పోవుటకు పూర్వమే (1877-78) ఇది, ఆతని పదునారు, పదునేడు సంవత్సరమున రచింపబడినట్లు తోచుచున్నది. ఇందు రచనాసారళ్యము తప్ప ఇంకొక విశిష్టత లేదు.

రవీంద్రుడు తాను ఇంగ్లండులో నుండగనే, కరుణ రసప్లావితమైన గేయ నాటిక నొక దానిని ప్రారంభించెను. దాని పేరు 'భగ్నహృదయ'. ఇది కూడ 1881 లోనే గ్రంథ రూపమునుపొంది వెలువడెను. దీనిలోని ఇతివృత్తము నా డాతని హృదయమునకు చాల సన్నిహితమైనది. సూక్ష్మముగా నిందలి వస్తువిది. ఒక కవి, తన్ను వలచివచ్చిన కన్యను, తా నామెను ప్రేమించుట లేదనుకొని, పరిత్యజించును. పరిత్యజించిన తరువాత గాని తన కామె యందు గల ప్రేమ యాతనికి వ్యక్తము కాదు. తా నామెను ప్రేమించిన విషయమును గుర్తించి, ఆమెకై తిరిగి వచ్చునప్పటి కామె మరణశయ్యపై నుండును. రవీంద్రు డింతకు పూర్వమే రచించిన పద్య కావ్యములగు 'కవి కాహిని' (1878) యందును 'వనఫూల్' (1879) లోను ఇంచుమించుగ నిదియే కథా వస్తువు. ఈ కావ్యములలో కాళిదాసుని ప్రకృతి వర్ణనలకు ఛాయ లనదగిన భాగము లెన్నియో కలవు. అభిజ్ఞాన శాకుంతలములోని శకుంతలకు లత లన్నను ఎంత ప్రీతియో ఈ కావ్యములలోని నాయికలకును అంతియే.

'భగ్నహృదయ' తరువాత రవీంద్రుడు వ్రాసిన పద్య నాటిక 'వాల్మీకి ప్రతిభ' అనునది (1883). దీనిలో సంగీతమునకు ప్రముఖ స్థానము. సాహిత్య రచనలో నాతనికి గల ప్రజ్ఞయెంతయో, సంగీత రచనయందును, అంతప్రజ్ఞయు

3. "The dispersion of interest over a number of minor scenes in the catastrophe of 'Antony and Cleopatra' has often been noted as a great defect in the construction of that play."

—Hudson.

కలదు. యావజ్జీవమును ఆతడు సంగీత రచనలను చేయుచునే యుండెను. ఆతని సంగీతరచనలు 'రవీంద్ర సంగీతము' అను పేర వంగదేశమందే కాక, యావద్భారతమున పేరుపొందిన విషయము సర్వులకు తెలిసిన సంగతియే. పాశ్చాత్య సంగీత సంప్రదాయములను, ప్రాచ్యసంగీత సంప్రదాయములతో బాటు మేళవించుటయందే 'వాల్మీకి ప్రతిభ' నాటికలోని రవీంద్రుని ప్రతిభ కలదు.[4] ఆతడు ఇంగ్లండులో నున్నప్పుడు పాశ్చాత్య సంగీతమున కొంత కృషి చేసినట్లు కూడ తెలియుచున్నది. 'వాల్మీకి ప్రతిభ' లోని సంగీతమున గల పాశ్చాత్య సంగీత వాసనకు, 'మూర్' (Moore) యొక్క 'ఐరిష్ మెలొడీస్' (Irish Melodies) కొంత ప్రోత్సాహకము. నాటికలోని సంగీతమునకు ప్రముఖస్థాన మీయక, నాటికను చదువరాదని నాటిక ప్రారంభమున గలదు. ఈ నాటికలోని సన్నివేశములందు గాని, సంభాషణలయందు గాని అంత చమత్కారము లేదు. కాని వర్ణనలు రమణీయములు. ఆంగ్ల నాటకములలోని 'ఫెయిరీ' (Fairy) పాత్రకు బదులుగా 'వనదేవత'ను సృష్టించి రచన సాగించెను. ఈ కల్పన సంస్కృత సాహిత్యమున క్రొత్త కాదు గాని, అనుకరణను మాత్రము ఈ విషయమున, ఆంగ్లము ననుసరించి చేసెను. 'షేక్స్పియర్' మహాకవి యొక్క 'మిడ్-సమ్మర్ నైట్స్ డ్రీమ్' (Mid-Summer Nights Dream) నాటకమును 'వాల్మీకి ప్రతిభ' రచనలో కొంత యనుసరించినట్లు కన్పట్టును.[5]

ముందుముందు మహాకవి కానున్నవాని మనస్సు, అనుభూతి ఏవిధముగ పరిణామవికాసము లందునో, ఆవిధముగనే రవీంద్రుని మనస్సు బాల్యము నుండియు క్రమపరిణామమును పొందెను. 'వాల్మీకి ప్రతిభ' రచించినతరువాత ఆతనిలో ఎన్ని మార్పులో రాజొచ్చెను. ఆతడు క్రమక్రమముగ అంతర్ముఖుడు కాజొచ్చెను. అర్థముకాని బాధలు, ప్రశ్నలు ఆతనిని ముంచివేయుచుండెను. ప్రకృతిలోని వర్ణవైవిధ్యమునకు వెనుక నవ్యక్తముగనున్న ఏకవర్ణము నాత డింకను దర్శింపలేదు. ప్రపంచములో అనేకత్వమే గాని ఏకత్వ మెచ్చటయు నాతనికి పొడగట్టుటలేదు. ఇంక మనస్సన్ననో అనిర్ధారితముగ, అగమ్యముగ,

4. "From this mixed cultivation of foreign and native melody was born the 'Valmiki Pratibha'."

(Reminiscences - Tagore)

5. "Two English Times served for the drinking - songs of the robber band and an Irish melody for the lament of the wood - nymphs." (Page - 193)
(Reminiscences - Tagore)

అసహ్యా వేదనాభరితముగ నుండెను. ఈప్సితార్థమేదియో దృగ్గోచరము కాని బాల్యయౌవన సంధికాలమున నాతడుండెను. ఈ కాలమున నుండు మనఃస్థితిని 'కీట్స్' మహాకవి, 'ఎన్డిమియాన్' (Endymion) అను కావ్యమునకు వ్రాసిన పీఠికలో చక్కగా నిట్లు వివరించెను. "The imagination of a boy is healthy and the mature imagination of a man is healthy; but there is a space of life between, in which the soul is in a ferment, the character undecided, the way of life uncertain, the ambtion thick-sighted..."

ఇట్టి సంధ్యాకాలమున రవీంద్రుడు 'సంధాసంగీత్' (1884) అను గేయములు వ్రాసెను. వీనిని పరిశీలించినచో, రవీంద్రుడు 'భగ్నహృదయ' 'వాల్మీకి ప్రతిభ' యను రచనలనుండి ఎంత ముందుకు సాగిపోయెనో తెలియును. వీనిలో శబ్దసౌష్టవము, అర్థసంపద అద్భుతావహమై రవీంద్రునియొక్క మొదటి ఉత్తమ నాటికయగు 'ప్రకృతి ప్రతీకారము' (1885) నకు దారితీయుచున్నది.

ఈ సమయముననే అతనికి వైవిధ్యశోభితమైన ప్రకృతి కాంతయొక్క స్వస్వరూపము సాక్షాత్కరించెను. ఆ సాక్షాత్కారము అతని మనోనేత్రమును విప్పెను. ఒకనాటి ఉదయము, చెట్లవెనుకనుండి ఉదయించుచున్న బాలభానుడు, తన బంగారు కిరణములతో జగత్తునంతను హేమించి, రవీంద్రుని సమ్మోహితుని జేసెను. తత్క్షణము, రవీంద్రునకు కనులపొర తొలగినట్లయ్యెను. అర్థరహితముగ నున్న ప్రకృతికాంత పదవిన్యాసములో, అసంస్కృతముగ నున్న ఆమె వర్ణ వైవిధ్యములో అతనికి లయక్రమము గోచరించెను. చిరుగాలి గుసగుసలలో, తలిరాకు రెపరెపలలో, అతనికి నవ్యార్థస్ఫూర్తి కలిగెను. ప్రకృతిలోని సమస్త విషయము లాతనికి రమణీయార్థప్రతిపాదకములే అయ్యెను. చిరకాలము నుండి హృదయకుహరమున బంధింపబడి అజ్ఞాతముగనున్న భావోద్వేగమొక్కసారి పెల్లుబికి అతనిని ఆనందమున ముంచితేల్చెను. ఈ దివ్యదర్శనము కలిగిన నాటినుండియు అతని జీవితములోను, కవితాజీవితములోను మార్పు లనేకములు వచ్చెను.

ఈ మార్పులు మొదలిడిన కాలములో మొట్టమొదలు రవీంద్రుడు వ్రాసిన పద్యనాటిక 'ప్రకృతిప్రతీకారము', బొంబాయి రాష్ట్రములోని 'కార్వారు'లో అన్నగారి ఇంటిలో నున్నప్పుడిది వ్రాసెను. ఈ నాటికలోని నాయకుడు ఒక సన్యాసి. నామ రూప గుణ శోభితయగు ప్రకృతి

బంధహేతువని నమ్మి ఆమెను తృణీకరించి ఆత్మానుభూతి పొందవలెనని ఆతని యత్నము. కాని ఒక దిక్కులేని బాలిక ఆతనిని ప్రేమించి, మరల ఆతనిని ప్రేమబంధము ద్వారమున ప్రకృతిలోనికి తెచ్చి జ్ఞాన మార్గము చూపును. తన్ను నిరాకరించిన సన్యాసిని బాలిక రూపమున ప్రకృతి తరణోపాయము చూపుట యిందలి ముఖ్యవిషయము. నిర్గుణము సగుణముగ, అరూపము రూపముగ, అసీమ సీమగ వ్యక్తమగుచు నెట్లు సాధకుని తరింపజేయునో సన్యాసికి తుట్టతుద కర్థమగును. ప్రకృతి మనము భావవేగమున నిర్మించుకొనిన మరీచిక కాదనియు, నిరాకారముయొక్క సాకార రూపమనియు కవి అన్వయించును. ప్రేమ మూలముననే సత్యమును కప్పియున్న ప్రతిసీర అపావృత మగుననియు, ప్రేమాలసులకు సత్యఫలము లందవనియు రవీంద్రుడు దీనియందు సిద్ధాంతీకరించెను. రవీంద్ర కవీంద్రుని సాహితీ సౌధమును ప్రవేశించుటకు ఈ నాటిక సుగమద్వారము. సగుణమును, సాకారమును తృణీకరింపక, నిర్గుణమును నిరాకారమును అనుభూతిలోనికి తెచ్చుకొనవచ్చునని రవీంద్రుని ఆశయము.

ఈ నాటికలో కృషీవలులు పాడు పాటలో ఈ మహాసత్యమును కవి ధ్వనింపజేసెను. గోపాలురు కృష్ణుని తమతో పంపుమని యశోదను ప్రార్థించు నపు డిట్లందురు.

"తల్లీ ! నందుని సుందరరమణీ !
కృప మానెయ్యావు కృష్ణు నొసంగుము.
.........................
ఆయె ప్రభాతము, సూర్యుడు పొడమెను
పూచెను పూవులు నవవనసీమల
కృష్ణుని గైకొని చనెదము గోష్ఠికి
చిత్తమునం దిది చింతిత మిపుడే.

అడవిపూలనట నల్లి మాలగను
ఇడెదము కృష్ణుని నెరికంఠముపై"

—ప్రకృతిప్రతీకారము - పుట ౮

ఏనాటి కృష్ణుడో ! ఏనాటి గోపాలురో ! వారి వాక్కుల ననువదించు పాటలను పాడుకొనుచు పోవు కృషీవలులు సన్యాసి కెదురగుదురు. పాటలోని



శ్యామసుందరుడు నిర్గుణ నిరాకార బ్రహ్మమునకు సంకేతము. గోపబాలురకు మాత్రము ఆతడు అందుబాటులోని వాడే. సుందర బృందావనమున నంద కుమారునితో క్రీడించుచునే ఆ వ్రజబాలురు మహాపరివ్రాజకులు పొందనేరని అపవర్గమును, దుర్గమ పథమున నున్నదానిని, సుగమముగ పొందుదురు. ఈ ప్రేమ ద్వారమును సన్యాసికి చూపుటకై కవి ఈ పాట నిట కల్పించెను. కాని హృదయకవాటమును బంధించుకొని, జాగరూకుడనని గర్వించుచున్న సన్యాసికా ద్వారము కన్పట్టదు.

ప్రపంచమును విరక్తితో చూచుట నేర్చుకొనిన సన్యాసికి, ప్రకృతిని జయించితినని విఱ్ఱవీగుచున్నవానికి కృషీవలుల పాటలు హాస్యాస్పదము లయ్యెను. "జ్ఞాన చితానలమున విశ్వమును భస్మము చేసితిని" అని తలంచును. ఆతనికి ప్రజలన్న ఏవగింపు. మహానగర మన్న యీసడింపు. రాజపథమున పోవుచు, "ఇదేనా మహారాజధాని! అన్నివైపుల నరపిపీలికలు వచ్చుచు పోవుచుండ చిన్నచిన్న గృహ వల్మీకములతో నిండియున్నది" అనుకొనును.

ఈ నాటికలో ఎందరో పాత్రలు కలరు. వారిలో సజీవులైనవారు తక్కువ. తాము పలుకవలసిన పలుకులను పలికి అదృశ్యులగుదురు. వీరందరిని సన్యాసి నీడలను చూచినట్లు చూచును. సన్యాసిపాత్రను పోషించుటకై కల్పింపబడిన రూపములవి. రవీంద్రుని హృద్గత భావగీతములను వినిపించు పిల్లనగ్రోవులవి. ఆతని భావాకాశమును ప్రతిబింబింపచేయు ఘటములవి.

ఈ నాటిక యొక్క ఆంగ్లానువాదము మాత్రమే చదువువారికి, మూల ములోని విషయమంతయు తెలియదు. సన్యాసిమనస్సులోని సంఘర్షణ మూలమునం దున్నంత విపులముగా, సహేతుకముగా ఆంగ్లానువాదమందు లేదు. మూలము ననుసరించి బయలువెడలిన ఆంధ్రానువాదము యొక్క విశిష్టత ఇట్టి పట్టులందే.

సన్యాసి ప్రపంచములోని జనులను, వారి సుఖదుఃఖములను చూచి నవ్వుకొనును. తనకివేవియు లేవని తన్నుతానభినందించుకొనును. "నేనెట్టి తీవ్ర స్వతంత్రుడను! ఎంత విశాలనిలయము! జగత్ప్రతిబంధకములు నాకు లేవు— శూన్యముననే నేను నివసించుచున్నాను" అని తలంచును. ఈ పరిస్థితులలో— లోకములో అందరిచేతను పరిత్యజింపబడిన, తల్లిదండ్రులు లేని హతభాగ్యురాలైన ఒక బాలిక ప్రవేశించును. ఆమె అనాథబాలికయని జాలిపడిన వృద్ధురాలు కూడ, ఆమె ధర్మభ్రష్టురాలైనవాని కూతురని విన్నంతనే, "ఛీ! ఛీ! ఛీ! ఎంత

అసహ్యాము!" అనును. ఆమెను సన్యాసి పిలిచి, "ఎవరమ్మా నీవు" అని అడుగగా "అశుభ్రమైన అనార్యను నేను" అని ఆమె పలుకును. సన్యాసి ఆత్మతృప్తితో నవ్వుచు, "అందరును అదే. సంసారపుధూళి శుభ్రతను కప్పివేసినది" అని పల్కును. ఇట రవీంద్రుడు సన్యాసిచే పలుమార్లు "నేను సన్యాసిని. ఎవరి ఎడలను నాకు ద్వేషానురాగములు లేవు" అని చెప్పించుచు సన్యాసి చిత్త వృత్తిని మనకు ధ్వనింపజేయుచునే యుండును. 'తాను మహాయోగిని.' అను అహంకారమే చివరివరకును మహాయోగులలో కూడ పోనట్టిదని తత్త్వవేత్త లనుట మనకు తెలియనిదికాదు.

బాలిక తన్నాదరించిన సన్యాసితో, "నేను నీ దగ్గరనే ఉండెదను. నన్ను వదలవు గదా," అని పల్కును. సన్యాసి, "నీవు నన్ను త్యజింపకున్న, నేను నిన్ను త్యజింపను," అని వాగ్దానము చేయును. ఇరువురును బాలిక యొక్క భగ్నకుటీరమును చేరుదురు. అటనామె సన్యాసిని "తండ్రీ!" అని పిలుచును. ఆతడు చకితుడగును. సంసారాంధువున తాను పడుచుంటినని తలంచును. బాలిక నిద్రపోవుచుండగా పారిపోవుటకు యత్నించును. అంతలో సిగ్గిలి, "పరుగెత్తిపోవుటయా! పలాయనమా! ఛీ, ఛీ, అదెట్టిమాట! విశ్వజగత్తునే అవహేళనమొనర్చి, కడకు బాలికను చూచి పరుగెత్తిపోవుటయా! ఎన్నటికిని కాదు. పరుగెత్తిపోను. ఇటులనే ఉండెదను. "ప్రకృతీ, నీ నానా మాయాబంధనములు ఇవేనా! నీ ఉరులలో మిడతలు మాత్రము వచ్చిపడుచుండును." అని తనకుతాను ధైర్యము చెప్పుకొనును. ఈ విధముగా తన ప్రత్యేకతను స్థాపించుకొనుటకు సన్యాసి తంటాలు పడుచుండును. బాలిక "రాజపథమున మహాకోలాహలము" అని పలుకగనే సన్యాసి మరల, "కోలాహలముల మధ్యనే నేను నిర్జనమును నిర్మించెదను. నగర మార్గములోనే నా తపోవనము. సృష్టి హృదయముపైననే నా ప్రళయాసనమును పరచెదను". అని ప్రగల్భములు పల్కును. కాని అప్పటికప్పుడే ప్రకృతి తన ప్రతీకారమును ప్రారంభించినది. బాలికపై పితృవాత్సల్యమను మోహము మెల్లమెల్లగ సంజ చీకటివలె సన్యాసి మానసాకాశమును కప్పుచుండెను. "చూడనిమ్మా నీ అతిమృదుకోమలమగు స్పర్శను. ఆహా నీ స్పర్శయు, నా ధ్యానము రీతియే పరిమితమునుండి అపరిమితద్వారమునకు గొంపోవుచున్నది", అని సన్యాసిచే అనిపించి ఆతని మనస్సుపరిభ్రమించుటను మనకు రవీంద్రుడు తెల్పును. సన్యాసి వెంటనే తెలివితెచ్చుకొని, ఇదేమి ప్రేమయా? ఈమెను నేను ప్రేమించు

చున్నానా ఏమి? లేదు లేదు. నాకు ప్రేమ ఎక్కడిది? ద్వేషములు, అనురాగములు ఎక్కడివి? ఎవరైన దగ్గరకు వచ్చినవానిని దూరముగ నెట్టి వేయను. దూరముగ నున్న వారిని దగ్గరకు రమ్మని పిలువను." అని తనకు తాను సమాధానము చెప్పుకొనును. పాపము! సన్యాసి ఆతనికి హృదయ మాతనికి తెలియకపోవచ్చును. మనకు మాత్రము, రవీంద్రుడు అంతయు తెలిపెను. ప్రకృతిప్రతీకారము ప్రారంభమయ్యెను.

బాలిక అమాయకముగ, "నాలత నిద్రపోయెను. లేత రెమ్మలు వంగి నేలపై పడిపోయెను.... రా, తండ్రీ! వచ్చి దీనిదగ్గర ఇచట కూర్చొనుము. మెల్ల మెల్లగ దీని ఒడలిపై చేతిని నిమురుము." అని పలుకును. సన్యాసికి ఆమె ముద్దుమాటలు మోహపాశము లగుచుండెను. తన పరిమితత్వ మాతనికి, తటిల్లతవలె మానసాకాశమున క్షణకాలము మెరిసినట్లయ్యెను. కాని దాని నంగీకరించుట కాతని కిష్టములేదు. కనుక వెంటనే బాలికతో, "బాలికా, బాలికా, ఇదేమి? ఈ నీ పిల్లల ఆటలు. నేను సన్యాసిని, యోగిని, విముక్తుడను, సంసారపు బంధములు లేనివాడను, స్వతంత్రుడను, సబలుడను. ఈ సంసారపు ధూళిలో నా నయనముల మూయ చూచుచున్నావే!" అని తీవ్రముగ పల్కెను. కాని, మోహము చాల చెడ్డది. కన్నీటి చెమ్మచే తళతళలాడుచున్న బాలిక కన్నులు, ఆతని గుండె దిటవును సడలించెను. ఆతని హృదయములో కార్చిచ్చు రేగెను. ఇంక అక్కడ నిలిచినచో ప్రకృతి మోహములో పడిపోయెద ననుకొనెను. ప్రకృతిలోనే యుండి, దానిని అంటక ముట్టక ఉండుటలో గల కష్ట మొక్కసారి ఆతని కనులకు కట్టినట్లయ్యెను. కాని అహంకారము ఓటమిని ఒప్పుకొననీయదు; "నేను నగరమున తిరుగుటకై వెడలుచున్నాను. రెండు నిమిషములు కూర్చొనియుండుము. ఇపుడే వచ్చెదను." అని చెప్పి సన్యాసి ఆమెను విడిచిపోవును. ఈ పోవుటయందే తన ఓటమి కలదని ఆతడు గ్రహింపలేకపోయెను. ఎందు వెడలినను ఆతనికి ప్రకృతియొక్క సన్నిహితత్వము తప్పదు. ఈ అభిప్రాయమునే పాంధ స్త్రీల పాట మూలమున రవీంద్రుడు వ్యక్తముచేసెను. పర్వత శిఖరముననున్న సన్యాసి, పర్వత పథమున గల స్త్రీల పాటలవలన ఆకర్షింపబడును. వారు పాడుచున్న పాట:

"సుధలనెల్లెడజిమ్ము జాబిలి
జిలుగువెన్నెల జాడుము

మనమునం దిపు డలుక బొలయుచు
బలుకకుండుట వన్నెయా ?"

తనకు అన్వయించుచున్నట్లుండెను. ఆకస్మికముగ సన్యాసికి ప్రకృతి దివ్యసుందరముగ కన్పట్టును. మందారమాలాకలితాలక యైన స్త్రీమూర్తివలెఁ సమస్త సంహారక తాండవము చేయుచున్న కపాలమాలాంకితకంధరుని సృష్టికున్ముఖుని చేయుచున్న ప్రకృతికాంత సన్యాసికి దర్శన మిచ్చినది. సన్యాసి ముగ్ధుడయినాడు. "ప్రకృతీ! ఇటుల నిన్నెన్నడును చూచి యుండలేదు." అనుకొనినాడు. కాని వెంటనే ప్రబోధితుడై "నా సమ్ముఖమున జగత్తు సముద్రము రీతి నొప్పుచుండ, నేను తీరమున పర్వతశిఖరమున కూర్చొని యున్నాను. తరంగముల తాకిడిచే గ్రహతారలు ఆకులమగుచున్నవి. కోటి ప్రాణులు జీర్ణకాష్ఠముల పట్టి వ్రేలాడుచున్నవి......మహాప్రకృతి కుంతలజాలముల నల్లకల విరియబోసి రుద్రతాళమున తాండవ మొనర్చుచున్నది.......ఆశలు, భయములు, అభ్యుదయములు, పతనములు. ఇవి కేవలము తాళతాళమున దాని పదక్షేపములు. దాని ప్రతి పదక్షేపమున జన్మించుచున్నవి. మరణించుచున్నవి. శతగ్రహములు, శతతారలు. శతకోటి ప్రాణులు. ఇక నేనన్ననో వానిలో చేరినవాడను కాను; కాన కూర్చొని నే నేల ఈ నృత్యభంగిమలు చూచుచుండరాదు?" అని తలంచును. ఈ మాటలు అతని నోటివెంట వచ్చుచున్నవే కాని మనస్సంతకు పూర్వమే అతని స్వాధీనము తప్పి, ప్రకృతి పరమైనది. ఇంకను ఎరుక అతనికి కలుగలేదు. తాను సంసారార్ణవమున మునుగకయే 'తామరాకుపై నీటిబొట్టు' వలె ఉండలేనా అని అతని ఊహ. కాలిక్రిందనుండి భూమి జారిపోవుచున్నను గ్రహింపలేని స్థితి అతనిది !

ప్రకృతి మాయను జయించితీరవలెనను పట్టుదలతో గుహలో కూర్చుండి, తత్త్వమసీత్యాది మహావాక్యములను జపించుచున్న సన్యాసి యొద్దకు 'దీపహస్త'యై బాలిక వచ్చును. వచ్చిన బాలిక అతనిని "ఇచట ఏల ఒంటరిగా అంధకారమున కూర్చొనియున్నావు" అని పలుకరించును. ఈ వాక్యములను బాలికచే రవీంద్రు డనిపించుటలో సార్థకత కలదు. సన్యాసి బాలికను విడువలేడు ; విడువలేకున్నానని అంగీకరింపలేడు. ద్విధాభిన్నమైన దాతని మనస్సు. వ్యథా శబలితమైనది ఎడంద. ఈ ద్వైధీభావమునపడి కొట్టుకొనుచున్న సన్యాసిచే రవీంద్రుడి ట్లనిపించును ; "వద్దువద్దు. బాలికా! వచ్చియుండిన వెడలిపోవకుము. నేను నిన్ను పిలువలేదు. స్వయముగా నీవే వచ్చితివి." ఈ మాటలలో



సన్యాసి తన్ను తాను సమర్థించుకొనుటకు చేయు యత్నము మనోహరముగ అభివర్ణితము. తుట్టతుదకు బాలిక "అమృత మయమగు లావణ్యము", "సుధావలి పమగు కంఠము "సరళతాయుతమగు ముఖమండలము" అతనిని ఆకర్షించును. ఆమెతో "సముద్రపు ఒకదరిని ప్రపంచము ఉన్నది. సముద్రపు రెండవగట్టున నేను కూర్చొనియున్నాను. మధ్య నీవు స్వర్ణతరణివిగా ఏతెంచితివి" అని. పల్కును. జగత్తు కేవలము మిధ్యకాదని తలంచును. "అసీమ, ససీమ రూపమును ధరించి వ్యక్తమగుచున్నది." అని ఊహించును. జగత్తును నిరాకరింపక "కన్నులు తెరచి నాల్గువైపుల తిరిగెదను. ప్రేమించి ఈ జగత్తు వైపు చూచెదను; అప్పుడే దీని స్వరూపము వీక్షింప గల్గుదును." అని నిర్ణయించుకొనును. కాని యిదెంతసేపు! ప్రకృతి మాయలో బడి తాను భ్రష్టుడనగుచుంటినని విచారము కలుగును. "నాల్గువైపుల బాష్పబంధములతో తగులుకొనిపోవుచున్నాను." అని భీతిల్లును. తుదకు గుహనుండి బాలికను విడిచి పారిపోవును. బాలిక సాశ్రునేత్రయై అతనిని వెంబడించును. సన్యాసి హృదయము కరిగి ఆమెను అక్కునచేర్చుకొని, "నీ అశ్రుస్రోతముచే నాపాషాణ వక్షమును బ్రద్దలుచేయుము...ఇక నిన్ను వదలివెళ్ళను, నిన్ను వెంటనిడుకొని నూతన జగత్తునకు వెడలెదను. పదాఘాతములచే నా జగత్తును బ్రద్దలుచేసితిని—గానీ, ఈ చిన్నబాలిక ఈ రెండు చిన్నచేతులతో కూలిపోయిన ప్రపంచమును నిర్మించివేసెను....రా. బిడ్డా, నిన్ను వక్షమునకు అదుముకొని మనముండిన గుహకే తిరిగి వెడలెదము" అని పల్కును.

కాని, కష్టార్జితమయిన సంయమనశక్తి బాలికామోహమున కొంత సడలినను, సంయమనదృష్టి పోకపోవుటచే సన్యాసి ఎడంద కలగుండువడుచునే యుండెను. ఈ సందర్భమున రవీంద్రుడు బాలికచే, "చూడు నాయనా, తీగె మొగ్గలు తొడిగినది. వేకువ వెలుగునుపొంది పూయగలదు" అని భావగర్భితముగ పలికించును. తన క్రొత్త బ్రతుకునం దింకను సమన్వయము సాధించుకొనలేక సతమతమగుచున్న సన్యాసి కీ మ్మాటలు 'అగ్నికాజ్యమై', అతనిని కోపఘూర్ణితునిజేయును. తీగను త్రెంపివేయును. ఆమెపై మండిపడి, "...నిన్ను తెలుసుకొంటిని. నేడు తెలుసుకొంటిని - ప్రకృతియొక్క గుప్తచారిణివగు రాక్షసివి నీవు...ప్రకృతి హృదయరహితమగు అపహాస్యమవు నీవు - శృంఖలముల బంధించి పరాజితుడనగు నన్ను పరికించి పకపక నవ్వుచున్న ప్రకృతి పిశాచివి నీవు...ఇంకను నన్నవమాన పరచెదవా?—ఇంకను నా శిరముపై

ధూళుల వెదజల్లెదవా ? ఇంకను పాతాళ బిలములలోనికి ఈడ్చి గైకొనిపోయె దవా ? లేదు. అది కానేరదు—ఇప్పుడె పోరాడెదను. ఇప్పుడే జయమును పొందగలను. శృంఖలముల త్రెంచివేయగలను" అని పల్కి సన్యాసి గుహనుండి వెడలిపోవును. బాలిక మూర్ఛితయై పడిపోవును. ఏమి ! సన్యాసి జయమును పొందెనా ? అనిపించును.

కాని, ఎక్కడకుపోయినను బాలిక ఆర్తనాదము సన్యాసి చెవులకు వినిపించుచునే యుండెను. ఝంఝామారుతము కూడ "బాలికయొక్క క్షీణ కంఠధ్వనిని ముంచజాలకుండెను". సన్యాసి కర్తవ్యతా నిమూఢుడయ్యెను. అరణ్యములలో పరుగెత్తెను. సెలయేళ్ళ తటములందు సంచరించెను. కొండ లెక్కెను. కాని, శాంతిలేదు. ఆతని సంకల్పమే భారమైనది. హాయిగా పది మందిలో బ్రతుకనెంచెను. ఎందులకీ సుగమమార్గమును విసర్జించితి ననుకొనును. "శశితపనులు ప్రకాశించుచున్న పథమును తుచ్ఛమని ఎన్ని, ఆ వెలుగును విడనాడి, నా ఈ క్షుద్రఖద్యోత కాంతిలో మార్గమునకు వెదుకులాడుచు అంధకారమున చచ్చుటేల ?" అని ప్రశ్నించుకొనెను.

వెంటనే ఆతనికి ప్రకృతిలోని రమణీయత దృగ్గోచరమగును. సామాన్య విషయములలో ఆనందము తొణికిసలాడుచున్నటుల తోచును. "అదో, ధాన్య మును కోసి కుప్పలువేయుచున్నారు. అదో, నేలను దున్నుచున్నారు. అదుగో, పాడుచు ఆవులను వెంటనిడుకొని పచ్చిక బయళ్ళ మేపుచున్నారు. పసిబిడ్డలో ధూళిలో కూర్చొని ఆటలాడుచున్నారు" అని ప్రకృతి వైవిధ్యమునకు ముచ్చట పడును. బాలికను జ్ఞప్తికితెచ్చుకొని, ఆమెకు "రామాయణమునుండి కథలను చెప్పి వినిపించెదను—సంధ్యాదీపమును వెలిగించి, శాస్త్రవాక్యముల విని బాలిక నా అంకమున పరుండి నిద్రపోగలదు" అని మురియును. ఇట్టి మురిపెము తొందరపెట్టగా, సన్యాసి గుహాభిముఖుడై పోవును. మార్గమధ్యమున ప్రజలు తన వేషమునుబట్టి సన్యాసిగా నెంచి అర్చింపరాగా, "నేనేమో సన్యాసినికాను. లేవండి అన్నలారా, లేవండి—రండి, రండి, నేడు మనము ఒకరినొకరు కౌగి లించుకొనెదము. నేనును మీలో ఒకడినే. మీవంటివాడనే" అని పలుకును. కాని, వాత్సల్యము వెల్లివెరియుచున్న హృదయముతో, సన్యాసి గుహాముఖ మును చేరునప్పటికి బాలిక మరణించి యుండును. సన్యాసి బాలిక దేహమును చూచి, "బిడ్డా, ఎచటికి పోయితివే! ఏమిచేసితివే, తల్లీ—అయ్యో, అయ్యో, ఎంతటి ప్రతీకారమును కఠినముగ సాధించితివే, అయ్యో !" అని వలవించును.

బాలికా రూపమున ప్రకృతి తన విజయమును సాధించి వెడలిపోయెను! లేదా. సన్యాసికి మార్గమునుచూపి, ఇక తనపనిలేదని వనివిసెను!

ఈ నాటిక రవీంద్రుని కవితా దృక్పథమును చక్కగా చూపును. ప్రకృతి విషయమై అతని భావమును తెలుపును. ప్రకృతి బంధహేతువని కొందరను కొనగా కాదు "అది ఆనందదాయిని" అని రవీంద్రుని విశ్వాసము. ఈ భావమునే అతడు చక్కగా గీతాంజలిలో సూచించెను. అతని దృష్టిలో—విమోచనము, శాంతి సన్యాసములో లేదు. "వేలకొలది ఆనంద బంధములలోనే నాకు స్వేచ్ఛ యొక్క పరిష్వంగము అనుభూత మగును......నే నెన్నడును ఇంద్రియ ద్వారములను మూసివేయను......నా భ్రాంతులన్నియు ఆనంద జ్యోతులుగా ప్రజ్వలించును. నా ఆశలన్నియును ప్రేమ ఫలములుగా పండు"[6] అని రవీంద్రుడు గీతాంజలిలో వ్రాసిన వాక్యములను ఈ నాటికయం దన్వయించుకొనవచ్చును.

ఈ నాటికను గూర్చి రవీంద్రుడు వ్రాసిన ఈ క్రింది వాక్యములను బట్టి అతనికి దీనియం దెట్టి భావమున్నదో మనకు పూర్ణముగా వ్యక్తమగును.

"...Natu's Revenge may be looked upon as an introduction to the whole of my future literary work; or rather this has been the subject on which all my writings are dwelt - the joy of attaining the infinite within the finite."

(Reminiscences. Page - 238) (సశేషము)

---

6. "Deliverence is not for me in renunciation. I feel the embrace of freedom in a thousand bonds of delight."

... ... ... ... ... ...

"No, I will never shut the doors of my senses. The delights of sight and hearing and touch will bear thy delight."

"Yes, all my illusions will burn into illumination of joy, and all my desires ripen into fruits of love." —Gitanjali.

ఆధునికాంధ్ర కవులలో శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు. "సరస చైతన్య రంజిత" మైన ప్రకృతి కవుల కెట్లు ఉపాదేయమో, నానావర్ణ శోభితయగు నామె నెట్లు నిరాకరింపదగదో, తమ 'రమ్యాలోకము' న నిట్లు రమణీయముగ తెలిపిరి. ఇందు గురుదేవుని భావానువాదమున్నట్లున్నది.

"ఇట్టి సౌందర్య మీ సుప్రకృతి ధరించు బహువిధాల ననంత రూపముల నెపుడు ;
రక్తి నర్చింతు రభిరుచి క్రమము కొలది శిల్పులును గాయకులు కవిశేఖరులును."
"కానబడ కనుమాన ప్రమాణమునకె అంది యందని పరతత్వ మవలనుంచి ;
పంచభూత భాసితమైన ప్రకృతి కళనె సన్నిహిత లక్ష్యమనియె వచస్వి నేడు"

గేయం :

# మృత్యూరువాచ

శ్రీ "రసగ్రాహి'

ప్రాపంచిక కంటకితా
ధ్వముపయి పయనింపలేని
మానవుడా ! అనర్హుడవు
మత్పరిరంభమ్ముకొరకు.

కంటక పథప్రయాణమ్ము
గావించిన కర్మిష్ఠుని
నాకసుఖమ్ముల దేల్చెద
నా పులకిత గాత్రమ్మున.

అతి సులభపదమ్మటంచు
ఆత్మహత్య కుద్యమించు
దానవుడా ! అశక్తుడవు
తత్పథ గమనమ్ముకొరకు.

పయనింపక దౌష్ట్యమునకు
పాల్పడు ఆత్మనిహంతకు
నరకయాతనల ముంచెద
నా కంటకితాంగమ్మున.

కంటకిత పథమ్ముపైన
కాలప్రవాహమ్ములోన
నడువుము కోరికదీరగ ;
తడువుము నాదరి సేరగ.

క్షణమాత్రవిచిత్రపరి
ష్వంగమొసగి పునహ కంట
కాలపైన విసరివేతు
కాలప్రవాహమున ద్రోతు.

నాకసుఖమ్ముల పొంగక
నరకయాతనల క్రుంగక
శమదమాదులను ధరించి
శత్రుషట్కమును జయించి
భోగివైననాడె పరమ
యోగివైననాడె నీవు
మృత్యుంజయమూర్తివోయి
సతపదస్ఫూర్తివోయి !



కథానిక

# నలిగిన దారులు

— శ్రీ కొండముది సోదరులు

ఒంటిగంట దాటినట్లుంది.

ఎక్కడో వొకటీ అరా పక్షి చేసే చప్పుళ్ల తప్ప వాతావరణమంతా చీమ చిటిక్కుమన్నా విన్పించేటంత నిశ్శబ్దంగా వుంది.

వరండాలో అంతగా కాంతి లేదు— దూరంగా రోడ్డుమీదవున్న మ్యునిసిపాలిటీవారి గ్రుడ్డిదీపాలు ప్రసరిస్తున్న వెలుగు తప్ప, వాతావరణమంతా ఏదో తెలియరాని నిశ్శబ్దం ఏదో నైరాశ్యం ఆవరించుకుని వున్నట్లుంది. కొబ్బరిచెట్ల మధ్యగానుండి ఎఱ్ఱగా వున్న అష్టమినాటి చంద్రుడు, దొంగ దొంగగా ప్రపంచాన్ని చూస్తున్నాడు.

గాలి లేదు; గాలి లేకపోవడంతోపాటు రగులుకుంటున్న బాధ మూలంగా కూడా అతని మనసుకు విశ్రాంతిలేకుండా పోతున్నది. ఎంతగానో ప్రయత్నించాడు. నిద్ర పట్టడం లేదు. రెండోఝాము గడిచినప్పటినుంచీ ప్రయత్నం చేస్తున్నాడు - ఎల్లాగైనా ఒక్క క్షణం నిద్ర పోదామని.

కానీ, కనుమూసుకుంటే భయంకరమైన ఆలోచనలు. "అయ్యో! వాడేమైపోతున్నాడో" అన్న భయం.

గడిచిపోతున్న రాత్రికి సూచనగా సినిమాల జనం నడివీథిన ప్రవహించడం చూచికూడా, ఆలోచనల ముసురులోంచి తప్పించుకోలేక పోతున్నాడు. వాణ్ని తలంచుకొంటున్నకొలదీ మనస్సు మరింత క్షోభ పడుతున్నది. అయినా తానేం చేయగలడు గనక? పూర్తిగా అసహాయుడు.

కళ్ళు తెరిస్తే చుట్టూతా అంధకారం. కళ్ళు మూసుకుంటే మనస్సులో భయంకరమైన సంగ్రామం;—తానేమైనా తప్పుచేశాడా అని.

'నువే కారణం దీనికి.'

'కాదు. కాదు. నువుకాదు కారణం.'

తలా తోకాలేని సమాధానాలు. తనలో తనకే ప్రశ్నలూ జవాబులూ. నిద్రపోదామన్న ప్రయత్నానికి ఆలోచన అడ్డుకట్ట కడుతున్నది.

విధిలేక, నిద్ర పోలేక, లేచి కూచున్నాడు ప్రకాశం. కళ్ళు మండిపోతున్నాయి. తల తిరుగుతున్నది. లేచి, ఎల్లాగో లైటు వేసుకుని మంచినీళ్ళకూజా అందుకోడం కోసమని ప్రక్కకు, ఆమె ప్రక్కదగ్గరకు వెళ్ళాడు.

ఆమె లేదక్కడ. ఆమె మంచం ఖాళీగా వున్నది. నిద్ర పోనట్టు, విశ్రాంతి లేదన్నట్టు ప్రక్క అంతా నలిగివుంది. కూజాలో మంచి నీళ్ళు లేవు. "ఇదేమిటి? ఎక్కడకు వెళ్ళిందామె?"

వస్తుందని, ఆమెకోసం నిరీక్షిస్తూ అక్కడే నిల్చున్నాడు. ఎక్కడకు వెళ్ళిందో ఆమె? ఒక్క క్షణం, రెండు క్షణాలు, సమయమైతే గడిచిపోవస్తున్నది కాని ఆమె రావడంలేదు. అతనిలో విశ్రాంతికి బదులు, ఆత్రుత ఎక్కువౌతున్నది. ఏం చేయగలడు తాను? ఎక్కడకు వెళ్ళిందామె?

ఏమీ తోచడంలేదు. మనస్సులో ఏదో భయం. "కొంపతీసి ఆమెగాని...." తనకు తాను సమాధానం చెప్పుకోలేక, చెప్పుకో కుండా వూరుకోలేక, ముందువాకిట్లోకి

వచ్చాడు. చేతులు చాచిన కొబ్బరిచెట్టు నీడలను పఱచుకుంటున్నది. నల్లని ఆకాశం కొంచెం కొంచెం తెల్లబడు తున్నది. ఎక్కడో ఓ కాకిపిల్ల కదలిక....ఓ జంతువు కదలిన చప్పుడు. చుట్టుప్రక్కలకు చూశాడు నిశితంగా.

అదేమిటి? ఆ వేపచెట్టు మొదట్లో.... ఎవరు? ఎవరది?

"అమ్మా!"

శాంతమ్మ జవాబుచెప్పలేదు. అతని వేపు తలయెత్తికూడా చూడలేదు. "పోయి పడుకోరా ప్రకాశం, పో!" అని మాత్రం అన్నది.

అతనికి తెలుసు, ఆమె విపరీతంగా బాధ పడుతున్నదని. అయినా అతడేం చేయగలడు గనక? ఆమె దుఃఖాన్ని ఏలా తీసివేయడం?

"అమ్మా! నా మాట వినమ్మా! ఇంట్లోకి రామ్మా! ఈవిధంగా వాడికోసం ఏడుస్తూ కూచుంటే వాడేమైనా తిరిగివస్తాడా? చెప్పు. వాడి ఖర్మ అది. అందుకు మనమా బాధ పడడం?" ఆ తరువాత ప్రకాశం మాట్లాడలేక పోయాడు. గొంతులో ఏదో అడ్డుపడినట్లైంది. అప్పటికీ శాంతమ్మ అంతగా మాట్లాడలేదు. తల దించుకునే మెల్లగా, గద్గదికంగా "నీకు తెలీదు" అన్నది.

ప్రకాశం ఆశ్చర్యపడ్డాడు. తనకు తెలీదా? అవును. నిజంగా తనకు తెలీదు. తెలిస్తే వాణ్ని ఈవిధంగా గాలికి ఎందుకు పెరగ నిస్తాడు?

కోపం ఆలోచనను వోడించింది. అయినా శాంతమ్మ ఇదేమీ గమనించకుండా "నీకు తెలీదు ప్రకాశం! నిజంగా నీకు ఏమీ తెలీదు. పెంచిన ప్రాణం గనక ఇంతగా ఏడవాల్సి వస్తున్నది. ఆరేళ్ళవాడు అది పోయేసరికి. అప్పట్నుంచీ కన్నుల్లో వత్తులు వేసుకు పెంచాను అది ఈనాటికి యీలా ఫలించింది!" అని కళ్ళు తుడుచుకుంది.

ప్రకాశం మ్లాన వదనుడైనాడు. "అవునమ్మా! వాడు దేశాల మీదకు పోతే, దానికి మనమా కారణం? హాయిగా, అమర్చిన భోజనాన్ని అరగించడం వాడికి చేతకాలేదు, దేశాలమీదకు పోయాడు." అని జవాబుకోసం ఎదురుచూచాడు.

శాంతమ్మ మొదట్లో జవాబు ఏమీ చెప్పలేదు. కొంచెంసేపు వూరుకుని, నిందా గర్భితంగా "వాడుకాదు పోయింది. పరిస్థితు లటువంటివి" అన్నది.

"ఒకళ్ళమీద నిందవేయడం ఎందుకమ్మా? మన బంగారం మంచిదికానప్పుడు." ప్రకాశం భారంగా జవాబిచ్చాడు.

శాంతమ్మ ఏమీ మాట్లాడలేదు. గట్టిగా నిటూర్చింది. నిట్టూర్చి "అంతేనా? అన్నట్టుగా అతనివేపు చూసింది. ఎంత దీనంగా వుంది ఆ చూపు! ఆ చూపులో ఎన్ని భావాలు!!

అప్పటికి ప్రకాశం ఇంకా ఈ మాష్టరుగిరీ లోకి ప్రవేశించలేదు. వాళ్ళ అక్కయ్య దగ్గరే వుంటూ, విశాఖపట్నంలో ఆనర్సు చదువు తున్నాడు. శాంతమ్మ కూడా వున్న పొలమూ, పుట్రా కౌలుకిచ్చి, అతని దగ్గరే వుంటున్నది. అందరి చూపులూ అతని మీదే. ఆనర్సు చదివి ఏదో యింత తలకెత్తి ఉద్ధరిస్తాడని! అవునుమరి! భవిష్యత్తును చూచి ఆశపడడం లోనే ఆనందం వున్నది. అయితే ఒకవిచిత్రం. బి.యిడి. చదివి, తెలుగుమాష్టారుగావుంటున్న అతని బావగారిదికూడా అదేతత్వం. అందుకనే గామోసు వీలున్నప్పుడెల్లా అంటుండేవాడు, "వారేయ్! నాకే వొక్క ఆడపిల్ల పుట్టనీరా,

అప్పుడూ నీ పని చెప్పేది!" అని. కానీ ఆయనకు దురదృష్టవశాత్తూ ఆడపిల్లలు పుట్టనూ లేదు. అథవా వొకరిద్దరు పుట్టినా, ఒకటి రెండేళ్లు పెరిగి వాళ్ళ రుణం వాళ్ళు తీర్చుకు చక్కాపోయేవారు. అదిచూచే అనే వాడు ప్రకాశం కాస్త ధైర్యంగా, చనువుగా "పర్వా లేదులే బావా, కట్నంలేకుండానే చేసుకుంటా న్లే" అని. కానీ, అతని అక్కగారు వెంటనే అందుకునేది "ఆదేమిట్రోయ్, నువ్వు కట్నం తీసుకోకపోయినా, ఆడఒడుచు లాంఛనాల మాటో!" అని.

దాంతో ఆ వాతావరణంలో ఒక్కసారిగా వెన్నెల ముసురుకొనేది. అందరూ మనసు నిండుగా నవ్వుకొనేవారు.

ఆలా, ఆసర్పులో మొదటి రెండుసంవత్సరాలూ విశాఖపట్నంలో ఏ బాధా లేకుండా సంతోషమంటేయేమిటో, చదువంటేయేమిటో అన్నట్టుగా మెలిగాడు ప్రకాశం. కానీ, కాలం మెల్లకన్నుతో అతని వైపు గూడా మెల్లగా చూడడంమొదలెట్టింది.

ఆరోజున యూనివర్సిటీలో ఏదో ఫంక్షనుండి ఆగిపోయాడు. అతిదూరంలేని సముద్రం మీదనుండి చలిగాలి తెరలు తెరలుగా ముంచుకువస్తున్నది. అయినా ఆ నాట్య ప్రదర్శనం!—ముద్దుముద్దుగా కళాత్మకంగా వాళ్లు నాట్యం చేస్తున్నారు.

ఒక చిన్నపిల్ల. ఎఱ్ఱగా, సన్నగా శలాకలా వుంది; 'నాయుడు బావ'ను తల్చుకుంటూ అభినయి స్తున్నది. చిన్నపిల్ల నోటినుండి ప్రణయం వినడం కొంత అసహజంగావున్నా, ఆ అసహజత్వంలో కూడా వో అందం, వో ఆనందం వున్నాయేమో ననిపిస్తున్నది. అలాగే కూచున్నాడు ప్రకాశం స్థాణువులా!— ఎంకిని తల్చుకుంటూ, తన అక్కయ్య పిల్లలను తల్చుకుంటూ, "వెధవలు వాళ్ళిద్దరూ మగ పురుగులే అయిపోయారు. ఒక్క నలుసు, ఒక్కటి ఆడపిల్ల కాకూడదూ? దానికి తన మనసులోని ముచ్చటతీరేటట్లుగా సంగీతమూ, నాట్యమూ చెప్పించి, ప్రపంచాన్ని పరవశం చేసేవాడు!"— "ఏం లాభం? ఇవన్నీ పగటి కలలే. భగవంతుడు ఆమె కడుపున ఆడపిల్ల నియ్యదల్చుకోలేదు. అనుకుంటే మొన్న పుట్టిన ఆడపిల్లకూడా పురిట్లోనే ఎందుకు చనిపోయేది?"

ఆ అమ్మాయి నాట్యంచాలించితెరవెనుకకు వెళ్ళింది. కొంచెం నిశ్శబ్దం. ఆడిటోరియంలో ఒక్కసారిగా లైట్లు వెలిగాయి. కుర్చీల్లో ఎక్కువభాగం ఖాళీ- స్త్రీలకోసం ప్రత్యేకింపబడిన భాగం కూడా!

అప్పటికిగాని అతనికి జ్ఞాపకానికి రాలేదు తనూ యింటికి వెళ్ళాలికదా అని. ఆ వూహ మనసులో మెసలగనే, ఉ వ్వెత్తున లేచి గృహోన్ముఖుడయ్యాడు.

సముద్రం మీదినుండి దూరంగా వున్న నౌకల్లోని దీపాలు మిణుకు మిణుకుమంటూ కన్పిస్తున్నాయి. అప్పుడప్పుడే తలయెత్తుకుంటున్న కాల్టెక్స్‌వాళ్ళ ఎయిర్‌కండిషన్డ్ భవనాలు, నైట్‌క్లబ్, స్పెన్సరు కంపెనీ, అన్నీ దాటి పట్టణపు రణగొణధ్వనులలోకి ప్రవేశించాడు— మనసులోనే ఇంట్లోని విషాద వాతావరణాన్ని వూహించుకుంటూ!

అతని అక్కగారికి వారంరోజుల నుంచీ వొంట్లో బావుండడంలేదు. ఆ పసివెధవలకు కూడా వొంట్లో నలతగానే వుంటున్నది. శాంతమ్మగారు సరేసరి! ఏదో ఇంటికి పెద్ద దిక్కు అనుకోవడమే గాని పనిపాటలు చేయలేని వయసు. ఇహపోతే అన్నింటికీ నిలబడవలసింది అతని బావగారు. తప్పితే ప్రకాశం.

మనస్సును చీకటి ఆవరించడంతో అను కోకుండా కళ్ళల్లో, దేహంలో నిస్సత్తువ ఆవరించింది. ఎదురుగా, అనంతంగా వున్నటు కన్పిస్తున్న తారురోడ్డు ఇరువైపులా, శత వృద్ధుని వదనంమీది అనుభవపు రేకల్లా, ముళ్ళగుట్టలూ, బండరాళ్ళూ....పైన కూడా చంద్రుడు, నల్లగా వున్నాడు — అతనిలాగానే.

ఇల్లు సమీపిస్తున్న కొలదీ, తెలియని ఆరాటం... ఎందుకో భయం....జీవితం తన నెత్తిన ఓ పెద్ద భారాన్ని పెట్టబోతున్నదన్న తలపు.

"తనను జూచి తనే నవ్వుకోవలసి వస్తున్నది. ఇంకా యౌవనంలోని ప్రథమార్ధ మైనా దాటలేదు. అప్పుడే జీవితాన్ని గురించి భయపడుతూ, అది అందిచ్చే భారాన్నుండి ఎట్లా తప్పుకోవడమా అన్న ఆలోచనతో సతమతం కావడం."

ఇల్లు సమీపించాడు ప్రకాశం. సమీపించిన కొద్దీ అతనిలో నైరాశ్యం, భయం ఎక్కువ అవుతున్నాయే కాని తగ్గడంలేదు. ఇదమిద్ధ మని చెప్పలేని ఆ అవస్థలోనే, ఏలాగో గడప దాటి హాల్లోకి వచ్చాడు. అక్కడ జూచిన ఆ దృశ్యం....

అతని కళ్ళు మసకలు కట్టున్నవి. హృదయం బరువుతో మూలిగింది. "ఎందుకు వచ్చారు ఈ జనమందరూ తన యింటికి? తనకూ, వాళ్ళకూ అంతకుముందు ముఖ పరిచయం తప్ప మరేమీలేదు." ఆడవాళ్ళు, వయోభేదం లేకుండా, అంతకుముందుపరదాలు తొలగించుకుని వీథిముఖం చూడనివాళ్ళందరూ కూడా అక్కడ వున్నారు. మొగవాళ్ళ మొహాల్లో సంతాపమూ, 'అయ్యో! వీళ్ళగతి ఇలా కాలుందే' అన్న సానుభూతే, స్పష్టంగా కన్పిస్తున్నవి.

అతని అక్కగారి చుట్టూతా వాళ్ళందరూ వున్నారు; ఆమెకు గాలైనా ఆడకుండా. ఆమె మంచంమీద పడుకుని ఉంది - పంజరంనుంచి, ఈతిబాధలనుండి, తప్పించుకొనడానికి స్థిర పడుతున్నట్లుగా.

ఆమె ప్రకాశాన్ని చూచింది జాలిగా. ఏదో చెప్పాలనుకుంటున్నట్లుగా. ఆమెలో ఏదో ఉబలాటం....ఏదో బలీయమైన కోర్కె ...ఏదో ఆశ. అందుకనే అతన్ని పిలవాలని, బలవంతంగా చేయి కదల్చాలని, ప్రయత్నిం చింది. కానీ ఆ చేయి ఎత్తలేకపోయింది. అసహాయంగా క్రిందకు వాల్చేసింది.

ప్రకాశమే ఆమె దగ్గరకు వెళ్ళాడు. ఆమె మంచం చుట్టూతా అప్పటికే శాంతమ్మా అతని బావగారూ ఇద్దరూ చేరివున్నారు. వాళ్ళు ఏడవటల్లేదన్న మాటేకాని, వాళ్ళవేపు జూచిన వారెవరూ ఏడవకుండా వుండలేరు. శాంతమ్మ చేతుల్లో ఆ ఇద్దరుపిల్లలూ వున్నారు. ఆపిల్లలకు ఏమీ అర్థం కానట్టుగా వాళ్ళ మొహాలే చెబు తున్నాయి.

ఆమె, అతన్ని దగ్గరకు పిల్చింది. పిల్చి, మెల్లగా గద్గదికంగా "వీళ్ళు నీవాళ్ళు" అన్నది ప్రకాశం కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. పిచ్చిగా తలూపాడు, మాట్లాడలేక! అయినా ఏం మాట్లాడగలడు గనుక ఆ స్థితిలో? అదిచూచి, అతని బావగారు వూరుకోలేక గొల్లుమన్నాడు. శాంతమ్మ అంతకన్నా. ఇదేమీ అర్థంకాలేదు. ఆ పసికందులకు.

ఇరవైయేళ్ళకే, నూరేళ్ళూ పూర్తిచేసుకుని వాళ్ళ జీవితాల్లో భర్తీ చేయలేని లోటు నొక దాన్ని సృష్టించి, అతని అక్కగారు లక్షిం దేవిలా వెళ్ళిపోయింతర్వాత మొట్టమొదటి



సారిగా అవమానమూ, అసూయా అంటే ఏమిటో అతను తెలుసుకోవలసి వచ్చింది. సరిగ్గా అతని అక్కగారు చనిపోయిన మూణ్నెల్లకు మరో యువతి ఆమె స్థానాన్నీ, ఆమె కర్తవ్యాన్నీ స్వీకరించి, వాళ్లగృహంలో అడుగెట్టింది. ఇందుకు అతనికి వాళ్ళ బావ గారిమీద ఏమీ కోపంగా లేదు. ఇంకా ఆయనకు ముప్ఫయ్యేళ్ళన్నా పూర్తిగా నిండ లేదు. బహుశా గడిచిపోయిన జీవితపు తాలూకు మధురస్మృతులు కూడా ఆయనను బాధపెడుతూ వుండి వుండవచ్చు. పైగా ఇద్దరు నలుసులు. వారినెవరు చూడవలె. అందుకనే ఆయన పునర్వివాహం చేసుకున్నాడు. ఇహ ప్రకాశమా? రక్తసంబంధం ఏనాడు తెగిపోయిందో, ఆనాడే వారిసంబంధం కూడా పుటుక్కుమనేంత స్థితిలోకి వచ్చింది.

కాని ప్రకాశానికి బాధ కలిగిస్తున్న విషయం వొకటే. 'సుశీల కూడా స్త్రీయేకదా? ఆమెకుమాత్రం బిడ్డలన్నా, వాళ్ళు బాధ పడడమన్నా కష్టంగా ఉండదా' అని. ఆ విషయమే అతనికి అర్థంకాకుండా వుంది. "తమమీద సుశీలకు నిరాదరణ వుండడంలో ఆశ్చర్యమేమీ లేదు. కానీ ఆ పసికాయలేం చేశారామెను?"

చదువుతూ, చదువుతూ వున్న 'పారడైజ్ లాస్ట్' ను అవతలపెట్టి కాస్త టీ అయినా తాగివద్దామని వాకిట్లోకి వచ్చాడు ఓరోజు రాత్రి, తలుపు తెఱుచుకుని. ప్రక్క గదిలో నుంచి వో స్త్రీ కంఠస్వరం అతనికి బాగా వినబడుతున్నది. అతనికి తెలుసు. ఆమె తప్పక సుశీలే! అతని బావగారు ఏమీ మాట్లాడకుండా మధ్య మధ్యలో "ఊ! ఆc!" అని మాత్రం అంటున్నాడు. ఆమె స్వరమే కాస్త ఘట్టిగా, కాస్త అధికార యుతంగా వినబడుతున్నది.

"వాళ్ళు ఎందుకు వుండాలీ అని. గతిలేని వాళ్ళందర్నీ మేపడానికి ఇక్కడ మనమేమైనా పోగేసుకు కూచున్నామా? ఆ ముసలామె ఒకతె. చీటికీ మాటికీ అది చెయ్, ఇది చెయ్ అని చెబుతూ. నేనేమైనా తన దాసీదాన్ని అనుకుంటుందా? ఇది ఎవరి యిల్లు? ఇక్కడ సంపాయిస్తున్న దెవరు? అంతగా వుండాలను కొన్నది నోరెత్తకుండా పడివుండాలి కానీ...."

"సుశీలా!" బిగ్గరగా అరవాలనుకున్నాడు. అందుకే ముందుకు రెండడుగులు వేశాడు. ఇంతలో అతని బావగారి కంఠం వినపడింది. "సుశీలా! నే చెప్పేదికూడా విను. ఎందుకు వాళ్ళను మన యింట్లో వుండనిచ్చాననుకున్నావు? నీకారహస్యం తెలీదు. వాడు ఆనర్సు ప్యాసవుతాడు. ఎక్కడో అక్కడ నాలుగు రెక్కలు తెచ్చుకుంటుంటే.... అప్పుడీ యిద్దరు పిల్లలూ ఎవరిదగ్గర వుంటారు?"

సుశీల కిసుక్కుమని నవ్వింది. "అల్లాగుటండీ!" అన్నది లాలనగా, ఎంతోప్రేమగా. ప్రకాశం వొంటిమీద తేళ్లూ, జెర్రులూ ప్రాకుతున్నట్లనిపించింది, "ఇదా మనుషుల్లో వున్న దైవత్వం? ఛీ! ఛీ! లోకమంతా ఒక్కసారి భగ్గుమని మండిపోయినా బావుండును."

టీ తాగడంమాట అటుంచి తిరిగి తన గదిలోకే వెళ్ళిపోయాడు ప్రకాశం. మిల్టనును చదువలేక షేక్స్పియరును తీశాడు. లేడీ మాక్‌బెత్‌ను చూస్తున్నకొలదీ పశుత్వ వాంఛకు పరాకాష్ఠ ఎక్కడో బోధపడుతోంది. బ్రౌనింగ్, స్విన్‌బర్న్ - ఎవర్నీ చదవ బుద్ధి పుట్టడంలేదు. లాంబ్‌ను తల్చుకుంటున్నకొలదీ జాలివేస్తున్నది. హంతకురాలూ, పిచ్చిదీ కవయిత్రీ అయిన సోదరికోసం తన

జీవితాన్నే ధారాదత్తం చేసి, మహోత్తమమైన త్యాగం అంటే ఇదీ అని నిరూపణ చేశాడు. 'తనకూ ఓ సోదరి ఇదివరలో వుండేది. ఆమెను తానూ అత్యధికంగా, ప్రాణాధికంగా అభిమానించాడు. కాని....కాని.... ఆ సోదరి లేదు. ఆమె జ్ఞాపకచిహ్నంగా ఇద్దరు మొగ పిల్లలు నాలుగేళ్ళవాడూ, ఆరేళ్ళవాడూ ఇద్దరు మాత్రం మిగిలారు. అయినా ఒకరి మోచేతి నీరు త్రాగి పడివుండవలసిన జీవచ్ఛవం కాదు తాను. తనకూ ఆత్మాభిమానంవుంది. ఎవరైనా సహాయం చేయమని వస్తేనే తాను సహాయం చేస్తాడు కాని, తనంతట తాను పిచ్చివాడై నలుగుర్లో నవ్వులపాలు కావడానికి తనకు మాత్రం అవసరమేముంది గనుక?'

ఆ రాత్రి ఎల్లా గడిచిపోయిందో ప్రకాశానికే తెలీదు. అతని కళ్ళు మండిపోతున్నాయి హృదయం లాగానే.

బయటినుండి కాకులు అరవడం స్పష్టంగా విన్పిస్తోంది. ఆక్షణంలో పుస్తకాల్లోంచి తెలుసుకున్న విజ్ఞానంకన్న ప్రపంచం నుండి నేర్చుకున్నదే అమూల్యమనిపించిం దతనికి.

మెల్లగా లేచి, చిందరవందరగా పడివున్న పుస్తకాల్నన్నింటినీ వో మూలగా పెట్టి, దంత ధావనం చేసుకొనడం కోసమని దొడ్లోకి వెళ్ళాడు.

అప్పటికే శాంతమ్మ కార్తీక స్నానం చేసి, మడిగా వో మూలగా వున్న అరుగు మీద కూచుని జపంచేసుకుంటున్నది. చుట్టుప్రక్కల ఎవరూ లేరు. ఇంకా సుశీలా, అతని బావగారూ నిద్రలేవనట్లుంది.

అదే మంచి సమయమనుకుని, ఆమె దగ్గరకు వెళ్ళి ప్రకాశం 'అమ్మా!' అని పిలిచాడు. జపం చేసుకుంటున్నది కళ్ళు తెఱచి "ఏమిటి?" అన్నది మెల్లగా, నిర్లిప్తంగా.

"వెళ్ళిపోదా మమ్మా ఇక్కడినుంచి!" అన్నాడు బాధగా.

శాంతమ్మ ఒక్కసారిగా ఆశ్చర్యపడ్డది. కొంతలో కొంతగా పరిస్థితి నర్థంచేసుకుంటూ కలగుండుపడిపోతూ "ఎందుకు?" అన్నది.

చెప్పాడు. అంతా చెప్పాడు ప్రకాశం. చెప్పిందంతా శాంతంగా, సావధానంగా విన్నది శాంతమ్మ. విని అన్నది—

"తొందరపడకు. కావలసింది ఆలోచన. ఆవేశంకాదు. నువు చెప్పినట్లే వెళ్ళిపోదాం. వేరే కాపరం పెడదాం. మరి ఆ ఇద్దరి పిల్లల గతి? ఎవరు చూస్తారు వాళ్లను?"

'అవును. చెట్టునుండి విడివడిన కొమ్మలు వాళ్ళు. తాము కూడా లేకపోతే'— జవాబు చెప్పలేదు ప్రకాశం; ఏమీ చెప్పలేక.

మళ్ళీ శాంతమ్మే అన్నది "తల్లిలేని పిల్లలా వాళ్ళు. ఆలోచించు. కడుపు చించుకుంటే కాళ్ళ మీద పడుతుంది. కనీసం దాని జ్ఞాపక చిహ్నంగానైనా వీళ్ళిద్దరూ బ్రతక్కపోతే ఎల్లారా? వాళ్ళ కింత రెక్కలు తెప్పించు. నలుగుర్లోనూ ఫలానివాడు మంచివాడు అనిపించుకో." అంది.

ఆమె చెప్పిందికూడా నిజమే ననిపించింది ప్రకాశానికి. తన అభిమానం సంగతి తానాలోచించుకుంటే వాళ్ళ జీవితాలు ధ్వంసమౌతాయి. అదెవరు ఆలోచించవలె? అందుకని....

సుశీలచేత పరాజితుడైకూడా ఆ వోటమిని తెల్సుకోలేని మూఢుడిలాగా నవ్వుతూ, ఎప్పటిలాగా ఆమెను ప్రేమగా 'అత్తయ్యా!' అని పిలుస్తూ ఆ యింట్లో తిరగడం మొదలెట్టాడు ప్రకాశం. మరో రెణ్నెళ్ళపాటు జీవితం సాఫీగానే గడిచిపోయింది.

ఇంతలో మరొక్క విశేషం....

సుశీల అంతులేని ఆనందంలో వోల లాడడం ప్రారంభించింది. ఇంట్లో ఎక్కడ చూచినా ఆడపిల్లల గౌన్లు....లక్కపిడతలు. గూళ్ళనిండా చింతగింజలే ! అతని బావగారిలో కూడా ఒక వింత చైతన్యం గోచరిస్తున్నది. మొదటి రోజుల్లోలాగా, చనవుగా "ఒరేయ్! ఈ గారి ఆడపిల్ల తప్పదురా! ఎంత సొమ్ము పెడతావో ఆలోచించుకో!" అనేవాడు. కానీ ప్రకాశం మాట్లాడడు. తనకు తెలుసు. హాలా హలాన్ని కడుపులో దాచుకుని పైకి ప్రశాం తంగా సంచరించవలసి వస్తున్నది. పైగా సుశీల, అతని బావగారు ఆ మాట అన్నప్పు డల్లా మొహం గంటుపెటుకుని కూచునేది. అయనంటున్నట్టు, నిజంగానే తానామెకు అల్లుణ్ణవుతానని భయపడుతున్నది గామోసు !

అసలే అర్భకురాలు. దానికితోడు ఈ క్రొత్తభారం మూలంగా సుశీల మొదటికే పనిపాటలు మానివేసింది. ఇంటిఎనంతా శాంతమ్మగారే చూచుకొనేది. తొలికోడి కూయడంతో లేచి మళ్ళీ రాత్రి ఏ పదింటికో పడుకునేది. ప్రకాశం భయమల్లా తిరిగి ఆమెకు ఆ పూర్వపు చలిజ్వరం ఎక్కడ తిరుగబెడు తుందోనని. కానీ ఆమె అతనిని లెక్కపెట్టేది కాదు.

ఏమైనా, దేవుడు చల్లగా చూచి వో అర్ధరాత్రి సుశీల మగపిల్లవాణ్ణి కన్నది. పాపం! అతని బావగారు ఒక్కసారిగా ఓ మూడేళ్ళు వృద్ధుడైపోయాడు!!! ఆ నూత్న శిశువు అవతరణంతో ఆ యింట్లో మరికొన్ని క్రొత్త విశేషాలు జరిగాయి. సుశీలకు సవతి బిడ్డలంటే పూర్తిగా పొడగిట్టడంలేదు.

ఆ రోజు రాజు అప్పుడే బడినుండి వచ్చాడు. మామూలుగానే, లాగూ చొక్కా విప్పేసి దొడ్లోకి స్నానం చేయటానికని వెళ్ళాడు. ప్రకాశం ముందువున్న గదిలో కూచుని చదువు కుంటున్నాడు.

ఇంతలోకి అకస్మాత్తుగా కేకలు....అర్థాం తరంగా చిన్నపిల్లవాడు ఏడుస్తున్న చప్పుడు....

ప్రకాశానికి బాగా తెలుసు. సుశీలే అరు స్తున్నది. మళ్ళీ ఏం వుపద్రవం వచ్చిపడిందో నని భయపడుతూనే దొడ్లోకి వెళ్ళాడు. పని మనిషికి అంట్లు వేయటానికని అక్కడకు వచ్చిన సుశీల, తను వచ్చినపనే మర్చిపోయి, రాజుమీద విఱుచుకు పడుతున్నది.

"సిగ్గూ, శరమూ లేదూ! మళ్ళీ చూస్తే ఆరేళ్ళ బొందపాపడివి! గోచీగుడ్డ పెటుకో డానికన్నా బద్ధకమైతే మేమెక్కడ చచ్చేదిరా తండ్రీ!"

వాడివేపు చూశాడు ప్రకాశం. పాపం వాడు గుడ్లనీళ్ళు గుడ్ల కుక్కుకుంటున్నాడు. సుశీల మాటలు విన్నతరువాత, తన వేపు చూసుకుని, అయోమయంగానే, అనవసరంగా సిగ్గుపడి పోతున్నాడు.

"బావుంది! బాల్యంలోని అందమూ, నైర్మల్యమూ తొలగిపోని వయసు అది! తెలిసీతెలియని, తప్పుకూ ఒప్పుకూ భేదం గమనించలేని పొద్దుపొడుపు కాలం! అటు వంటి దానికా శిక్ష? మరీ బావుంది!" ప్రకాశం చాలా బాధపడ్డాడు.

ఈ విధంగానే అనేకం. నిద్ర లేచింది మొదలు ప్రొద్దు వాలేవరకూ శాంతమ్మా, ప్రకాశం అక్కడ రెక్కల్లేని పక్షులైనారు. సహాయంచేయాలని వారి మనసుల్లో బలీయ మైన కోర్కె. కొత్త గుడ్డలు కుట్టించాలని, కడుపునిండా తిండిపెట్టి అది వాళ్ళు తింటుంటే చూసి ఆనందించాలని, వాళ్ళు నవ్వుతుంటే—

అవ్యక్తంగా, ఆనందంతో మాగన్నుగా నిద్ర పోతే చూసి ఆనందించాలన్న కోర్కె.

కానీ ఒక్కసారి సుశీలే వాళ్ళకు బాగా బుద్ధిచెప్పింది. "మా బిడ్డలేం అంత గతిలేని వాళ్ళుకాదు- ప్రతిసారీ మీరు అవీ యివీ తెచ్చి యివ్వడానికి. మమ్మల్ని అనవసరంగా మీరు కించపఱచవద్దు" అని.

శాంతమ్మదంతా అదోరకమైన చాదస్తం. అటు పూర్తి పెద్దతనమూ కాదు. అలా అని అనుభవంలేని జీవితమూ కాదు. అందుకనీ వూరుకోలేక బాధగా "అదేమిటే అలా అంటావూ? మా ముద్దు ముచ్చట్లు మాని. అల్లమైనా, బెల్లమైనా చిన్నప్పుడే గాని—" అంటూ ఇంకా పూర్తిచేయనేలేదు. మధ్యలోనే సుశీల అందుకుని, "ఏమో తల్లీ! నా కవేమీ తెలీదు. ఊళ్ళో వాళ్ళంతా వాహటే ఎత్తి పొడుపు. "అదేమిటమ్మా! ఆ కుఱ్ఱవాళ్ళకు ఎప్పుడు చూసినా ఆ ముసలమ్మే అదీ, ఇదీ ఇస్తుంటుంది. వాళ్ళంటే నీకు మరీ బొత్తిగా ప్రేమా, అభిమానమూ లేదట్లుందే" అని, "బావుందమ్మా! చేతి చమురు వదలడం నాకున్నూ, మంచితనం మీకున్నూ; భేషుగ్గా వుంది శాంతమ్మ తల్లీ!" అన్నది. శాంతమ్మ ఏమీ మాట్లాడలేదు. అసహాయంగా తన అల్లుడి వైపు చూసింది. ఆయన కూడా అదే మాట అన్నాడు. "అవునమ్మా! సుశీల కిష్టం లేనప్పుడు అవీ, యివీ కొనిపెట్టడం ఎందుకు చెప్పు నువ్వు? అది బాధపడడం నేను చూడ లేను!"

శాంతమ్మ మళ్ళీ ఆ ప్రస్తావన తీసుకు రాలేదు. ఇదంతా చూస్తున్న కొలదీ ప్రకాశానికి మతిపోతున్నట్లనిపిస్తున్నది. "ఏమిటిదంతా? ఎందుకు తమ కీ అవమానం?"

ఈ ఇంటి గొడవల్లో పడి అత నీ మధ్య బొత్తిగా చదువులను పరామర్శచేయలేదు. అడగబోతే అడివి, కొనబోతే కొఱివి అన్న ట్లుగా వుంది అతని విషయం.

ప్రకాశం బావగారు ఇంటివిషయం పట్టీపట్ట నట్టుగా వ్యవహరిస్తూ, తాళంచేతుల నామె చేతి కిచ్చేశారు.

రాజూ, రఘూ ఇద్దరు శాంతమ్మను వదిలి ఒక్క క్షణం వుండడంలేదు. ఇది చూచి శాంతమ్మ ఒకరోజు అతని బావగారితో అన్నది తగినసమయం చూచుకుని. "వచ్చేసంవత్సరం పిల్లలను నా దగ్గర వుంచుకోవాలని వుంది. ఎక్కడో అక్కడ వాడికీ వుద్యోగంఅవుతుంది కదా! అని."

అతని బావగారు ఏమీ మాట్లాడలేదు. సుశీల వేపు చూశాడు. ఆమెకూడా కొంచెం సేపు వూరుకున్నది. ఏమీ జవాబు చెప్పకుండా తనలో తనే ఆలోచించుకుంటూ. మళ్ళీ శాంతమ్మే అన్నది. "ఇంట్లో పసిపిల్లలు నాకూ ఎవరూ లేరుకదా! వాడికి పెళ్ళయి.... ఓ నలుసు కలిగి.... నందోరాజా భవిష్యతి!"

అతని బావగారు సరేననబోతున్నాడు. ఇంతలో సుశీల మధ్యలో అందుకుంటూ, "అదేమిటండీ! అల్లా అంటారు? వాళ్ళు లేకపోతే నాకుమాత్రం ఏంతోస్తుంది చెప్పండి? అన్నది.

అతని బావగారికి ఇదేమీ అర్థంకానట్లుంది. ఆమెవైపు కుసుకూ, కుసుకూ చూశాడు. సుశీలే మళ్ళీ అన్నది. "వాళ్ళకూ అంత మోజుగా వుంది కాబట్టి, పెద్దవాణ్ణి వాళ్ళదగ్గర వుంచుకోమనండి."

శాంతమ్మ మెల్లగా ఓ నిట్టూర్పు విడిచింది. అప్పటికి ఏమీ చెప్పలేక 'సరే' అన్నది.

# 4

అది జరిగిన కొద్ది మాసాలకే, పరీక్షలు జరగడమూ, దురదృష్టవశాత్తూ అతనికి థర్డు క్లాసు రావడమూ జరిగింది. అందుమీదట అనుకొన్న అంచనాలు కొన్ని తలక్రిందులు కావడమూ, ప్రకాశం ప్రపంచమనే ఈ ఎడారిలో పడి, ఉద్యోగమనే ఒయాసిస్సు కోసం తిరిగి తిరిగి, చివఱకు మ్యునిసిపల్ హైస్కూల్లో, తాత్కాలికంగా ఇంగ్లీషు మాస్టరుగా చేరి, ఆ వూళ్ళో కాపురం బెట్టాడు.

విద్యార్థిజీవితంలో కన్న కలలన్నీ కల్లలయి పోవడంతో ప్రకాశంలో ఒక విధమైన వైరాగ్యమూ, నిర్లిప్తతా నరనరాన జీర్ణించుకు పోయినాయి. ప్రపంచం శూన్యంగా కన్పిస్తున్నది. జీవితం అర్థరహిత మనిపిస్తున్నది.

బ్రతకలేక బడిపంతులన్నారు. ఇల్లు.... బడి .ఇల్లు—ఇంతకన్నా తన బ్రతుకునకు మరేమీ కన్పించలేదు.

తనెందుకు బ్రతుకుతున్నట్లు?

బడినుంచి సాయంత్రం వేళ ఇంటికివస్తూ తనని తాను ప్రశ్నించుకున్నాడు. ఎందుకూ లేదు! ఏ ఆశయసాధనకూ కాదు! అర్థంలేని తన బ్రతుకు వ్యర్థం. ఇంటికి పోబుద్ధి కాలేదు. ప్రకాశానికి. కాళ్ళు పార్కులోకి దారితీశాయి. ఓ చివరకు పోయి కూచున్నాడు.

ఎవరో వెనుకనుంచి తరుముకు వస్తున్నట్లుగా బజారువెంట జనం పరుగులు తీస్తున్నారు. వారిలోని ప్రతి ఒక్కరి బ్రతుకునకూ అర్థమూ, ప్రయోజనమూ వున్నాయా?

"బాబూ! అన్నంతిని రెండు రోజులైంది బాబూ!"

ఎనిమిదేళ్ళ కుర్రాడు. కళ్ళు లోపలికి పీక్కుపోయి, నిర్జీవంగా వున్నాయి. పొట్ట అంటుకుపోయి వున్నది. మొహం పాలిపోయి వున్నది.

"ఏమిటా?" అన్నట్టుగాచూశాడు ప్రకాశం.

"అన్నంతిని రెండు రోజులైంది బాబూ! ఒక్క అణా యిప్పించండి బాబో!" రెండు రోజులనుంచీ అన్నం లేకపోయినా, వాడికి జీవితంమీద విరక్తి కలుగలేదు. ఆశ చావలేదు. ఆశ్చర్యపోయాడు ప్రకాశం.

కన్నెత్తయినా చూడకుండా కసిరికొట్టే వాళ్ళ తరగతికి చెందని ప్రకాశం, తలెత్తి కరుణతో చూసేసరికి ఆ కుర్రవానికి తన కష్టం ప్రకాశంతో చెప్పుకుంటే, అణో బేడో దొరకక పోదనిపించింది.

"మాయమ్మ సచ్చిపోయి ఏడాది అయింది బాబూ! అయ్యేమో ఇంకోపెళ్ళి సేసుకుని దాంతోపాటు ఏడకో సచ్చిండు."

ఒక్కసారి మ్యునిసిపాలిటీ దీపాలు వెలిగాయి. వీధులన్నీ విద్యుత్కాంతితో శోభిస్తున్నాయి. ప్రకాశం వీపుమీద ఛెళ్ళున ఎవరో కొట్టినట్లనిపించింది. ఆ కుర్రవాడిలో రాజు కన్పిస్తున్నాడు... తన బ్రతుకునకూ అర్థం వుంది; తను జీవిస్తున్నందుకూ ప్రయోజనం వుంది. తను లేకపోతే, తను కాపాడకపోతే, రాజుకూడా ఈ కుర్రవాడి లాగానే తయారవాల్సి వస్తుంది. అక్కయ్య కిచ్చిన మాట ఏమవుతుంది? అక్కయ్య ఆత్మకు శాంతి ఏలా లభిస్తుంది?

జేబులు తడుముకున్నాడు. నెలాఖరాయను-అర్ధణాకానుకన్నా ఎక్కువ దొరకలేదు. అదే ఆ కుర్రవాడి చేతిలో పెటి, గబగబా పెద్ద పెద్ద అంగలేసుకుంటూ నడిచాడు. శాంతమ్మ గుమ్మంలోనే ప్రశ్నించింది.

"ఏరా నాయనా! ఇవ్వాళ ఇంతాలస్యం చేశావు?"

శాంతమ్మకు సమాధానం చెప్పకుండానే 'రాజేడీ' అంటూ పెరట్లోకి వెళ్ళాడు. రాజు బడి నుంచి వచ్చి నీళ్ళు పోసుకుంటున్నాడు. అప్పటికి గాని అతని ఆవేదన సమసిపోలేదు, ఆత్మ సంతృప్తిపడలేదు.

ప్రకాశానికి పిల్లనిస్తామంటూ మధ్యాహ్నం ఎవరో వచ్చి సాయంత్రం దాకా కూచుని పోయారు.

పిల్ల బావుంటుంది. కాలేజీ చదువులు లేవు గాని కాస్తోకూస్తో చదువుకున్నదేను. పరువూ మర్యాదగల కుటుంబం. కట్నం ఎంతోకొంత ఈయకపోరు. తన వంట్లోనూ శక్తిపోయింది. ఇంటెడు చాకిరీ ఇక తను చేయలేదు— శాంతమ్మ చెప్పిన మాటల్లోని సారాంశం.

ప్రకాశానికి ఇప్పట్లో పెళ్ళిచేసుకోవడం సుతరామూ ఇష్టంలేదు. బావ రెండోపెళ్ళి చేసుకోవడం వల్లనే రాజూ, రఘూ ఇద్దరూ చెట్టును వీడిన కొమ్మల్లా తయారయారు. రేపు తను చేసుకున్నా ఆ వచ్చేది మాత్రం సుశీల లాగా ప్రవర్తించదని నమ్మకమేమిటి? అదే ప్రకాశాన్ని భయపెట్టున్న కారణం.

శాంతమ్మ ప్రకాశం మంచి మనస్సును మెచ్చుకున్నదిగానీ, అతని అమాయకతను అనుభవశూన్యతను చూస్తే ఆమెకు నవ్వు వచ్చింది. "అందరు ఆడవాళ్ళూ ఒకటిగా వుంటారా నాయనా?"

ఒకటి రెండు రోజులు ఆలోచించగా శాంతమ్మ అన్న మాట నిజమేనేమో నని పించింది. రాధలోనూ, సుశీలలోనూ బేధం వుంటుంది. తప్పదు!

మంచిరోజున పోయి పిల్లను చూశాడు. ఆహ! సౌందర్యాన్నంటే కొలవగలిగాడు కాని, ఆత్మ సౌందర్యాన్నీ, ఆమె గుణగణాలనూ అంచనా వేయలేకపోయాడు. వంశ గౌరవం ఆధారంచేసుకుని కొంతవరకు విలువ కట్టాడు. విలువకట్టి రాధను పెళ్ళిచేసుకున్నాడు. పెళ్ళిచేసుకుని రాజు బాధ్యత నామె కప్పగించినాడు.

వంటా-వార్పూ రాధ నెత్తిన పెట్టి శాంతమ్మ విశ్రాంతి తీసుకుంటున్నది. రాధ అయినా మధ్యతరగతి కుటుంబీకులఆడబడుచు అవడం చాత, ఆపనీ యీపనీ సర్దుకుపోతూ అన్నిటికీ తానే అయి వడికట్టి, రాజుకు వేళకు అన్నం పెట్టి బళ్ళోకి పంపిస్తూ, బడి నుంచి వచ్చాక, సాయంత్రంవేళల వేడినీళ్ళ స్నానంచేయించి, అన్నం పెట్టి ప్రకాశం ఇంటికి వచ్చేదాకా దగ్గర కూర్చుని చదివిస్తున్నది.

శాంతమ్మ వేళ కింత తిని రామా, కృష్ణా అనుకుంటున్నది.

ప్రకాశం ఎంతో సంతోషించాడు. రాధకూ, సుశీలకూ భేదం వుంది. సృష్టిలోనే వైవిధ్యం వుంది.

కాలం దొర్లిపోతున్నది - కళ్ళు మూస్తూ తెరుస్తూ.

"ఇదిగో రాధా! ఒక్క ఆడపిల్లను కన్నావా, ఇహ నాకు దిగులులేదు. రాజును గురించి. నిశ్చింతగా కళ్ళుమూస్తాను"అన్నదిశాంతమ్మ.

ఇంట్లోకి వస్తున్న ప్రకాశం, సమాధానం ఏమని వస్తుందో విందామని, వరండాలోనే ఆగిపోయాడు.

రాధ చెక్కిళ్ళలో గులాబీలు విరిసినయ్. సిగ్గుల పెళ్ళికూతురయిపోయింది. ఆమెమనసు మధురభావంతో నిండిపోయింది.

"మొగపిల్లవాణ్ణి కంటేమటుకు రాజును అశ్రద్ధ చేస్తానా?"

ప్రకాశం ఆశించిన సమాధానమే వచ్చింది.



శాంతమ్మ నెత్తిమీదనుంచి ఎంతో కాలం నుంచి మోస్తున్న బరువును దించుకున్నట్లుగా దీర్ఘంగా నిట్టూర్చింది. ఆ నిట్టూర్పు ప్రకాశం హృదయాన్ని తాకి, ఆ హృదయంలో నిద్రిస్తున్న గతకాలపు స్మృతులను ఒక్కసారి మేల్కొల్పడంతో, అతను ఆనందోద్రేకాలతో వూగిసలాడి పోయాడు.

## 6

ప్రకాశం బడినుంచి వచ్చేసరికి, పెరట్లో, శాంతమ్మ రాధతో ఏదో అంటున్నది. ప్రకాశం గదిలోఉండే వింటున్నాడు.

"ఏమే రాధా! పూలమనిషిని వద్దని పంపించావేమే!"

"ఆఁ! పంపించానులే!"

పూలు కొనుక్కోమని ఉదయం బడికి వెళ్ళేటపుడు ఒక బేడ యిచ్చిపోయాడు ప్రకాశం. కాని రాధ ఎందుకని పూలు తీసుకోలేదో ప్రకాశానికి అర్థం కాలేదు. ఇచ్చిన బేడ కాస్తా ఎక్కడ పోయిందో ననుకున్నాడు.

రాధ లోపలికి వస్తే అడిగాడు. సమాధానం చెప్పకుండా మెత్తగా నవ్వి వూరుకొంది, ప్రకాశం బేడ పోయిందని నిర్ధారణ చేసుకుని "పూలమనిషి నిట్టాపిలు. ఆ బేడ పోతే పోయిందిలే!" అంటూ జేబులు వెతకడం మొదలెట్టాడు. మధ్యాహ్నం ఉన్న ఒక్క పావులాకాసు మార్చి తాఫీ త్రాగి మిగిలిన బేడ జేబులో వేసుకున్నాడు. జేబుకు చిల్లి వున్నసంగతి ఇప్పటికి గాని అతనికి తెలియలేదు. బావురుమన్నవి ఖాళీజేబును తడిమిన చేతులు.

ప్రకాశం మనసు విహ్వలమైంది. మొహం వివర్ణమయింది.

పరిస్థితి నర్థం చేసుకున్న రాధ హృదయం వివర్ణమైంది.

"రోజూ పెట్టుకుంటున్నాను గనుకనా— ఇవాళ లేకపోయినయ్యాని బాధపడడానికి. అందుకనే ఏదయినా కొనుక్కుతినమని పొద్దున మీరిచ్చిపోయిన బేడ రాజుకిచ్చాను." రాధమీది అనురాగం, రాజుమీద ఆగ్రహం కల్గించింది. అర్థంలేని అసహాయత. అతనికి ఆవేశాన్ని అందించింది. ఉద్రేకంతో కంపించి పోయాడు. ఆ పరిస్థితిలో రాజేగనక అక్కడ వుంటే ఏం చేసేవాడో ప్రకాశానికే తెలీదు.

"వాడికి చిరుతిండ్లకేమొచ్చె! పూలకిచ్చిన బేడడబ్బులు కూడా రాల్చుకు పోవాలా? వెధవ... ఏడీ అసలు వాడు?"

రాధ అమితంగా భయపడిపోయింది. పొరపాటున నోరు జారినందుకు, నిజం చెప్పినందుకు ఎంతగానో నొచ్చుకుంది.

దుష్టత్వం పరాకాష్ఠ నందుకొనడానికి అప్పుడప్పుడు దైవంకూడా సహాయం చేస్తుంది కాబోలు! రాజు వచ్చాడు.

రాజు రాక, శిఖరాన్నెగబ్రాకుతున్న ఉద్రేకాన్ని శిఖరాగ్రం చేర్చింది.

రాధ చూస్తుండగానే, రాజు చెంప ఛెళ్ళు మన్నది. ఇంతవరకు ప్రకాశం నోటివెంట కఠినమైన మాటగాని, కళ్ళ బెదురుగాని ఎఱుగని రాజు, ఒక్కసారి అనుకోకుండా ప్రకాశం చేతి చుఱుకైన దెబ్బను తినడంతో సుళ్ళు తిరిగిపోయి, రాధ వొళ్ళో ఒరిగి పోయాడు.

రాధ కళ్ళలో నీరు తిరిగాయి. కంఠం రుద్ధమైంది. రాధ రూపులో అక్కయ్య గోచరించి, "ఇదిట్రా తమ్ముడూ! తల్లిలేని పిల్లవాడిని సాకడం?" అని బాధగా ప్రశ్నించినట్లయింది ప్రకాశానికి.

పరాకాష్ఠ నందుకున్న పశుత్వం తిరోగ మించి, అగాధాల అడుగులకు జారిపోయింది అసహాయంగా, దీనంగా ఒకరి నొకరు మౌనంగా ఓదార్చుకుంటున్న రాధా - రాజుల శోకమూర్తుల చూసే ధైర్యంలేక ప్రకాశం ఇంటోనుంచి వెళ్ళిపోయాడు.

## 7

ఇప్పుడు ప్రకాశానికీ, రాధకూ ప్రభ తోడి దే లోకం. వచ్చీరాని ప్రభ మాటలకు అర్థాలు చెప్పుకోడంతో కాలం ఇట్టే గడిచిపోతున్నది.

"అమ్మాయ్ ప్రభా! రాజు బావను పెళ్ళి చేసుకుంటావా ?" ఒక రాత్రివేళ శాంతమ్మ అలవాటు ప్రకారం అడిగింది. ప్రభ పసిడి పలుకులువింటూ సంతోషిస్తున్న రాధ మొహం వివర్ణమైంది.

"ఆఁ! చేతుకుంతా" పెళ్ళి అంటే ఎరగని ప్రభ 'బిస్కట్లు తింటావా?' అంటే 'ఆఁ! తింటాను,' అన్నట్లుగా తేలికగా జవాబు చెప్పింది.

"ఏవిఁటీ చేసుకుండేది! రాజును చేసుకుని ఏం సుఖపడతావ్ ?"

రెండేళ్ళ పిల్లకు పెళ్ళీ - సుఖమూ అంటే ఏం తెలియదని రాధకు తెల్సును. కాని ఆ ప్రశ్న అడిగింది శాంతమ్మను.

ప్రకాశం మొహంలో ఏవో నీలి నీడలు కదిలాడినయ్! శాంతమ్మ హృదయం రంపపు కోత కోసినట్లయింది.

ఇప్పుడిప్పుడే లోకం అంటే ఏవిఁటో తెల్సుకుంటున్న రాజుకు ఆ ఇంటో తనస్థానం ఇంకెన్నాళ్ళో, ఎంతవరకో లీలగా అర్థమైంది.

ప్రకాశానికి రాధ చెబుతున్నది సబబే నని పించింది. రాధ తమ్ముడు రాజు యీడువాడే వున్నాడు. థర్డుఫారం చదువుతున్నాడు. పది ఎకరాల మాగాణీ వుంది. మండువా యిల్లు పెద్దది ఒకటి వుంది. రాజుకన్నా ఎన్నోవిధాల వాడు మెఱుగు. ఈ విషయం దృష్టిలో పెట్టు కునే రాధ ఆ మాట అంటున్నట్లు వెంటనే గ్రహించాడు గాని, శాంతమ్మ ఆ మాటకు ఎంతగా లోలోపల ఆక్రోశించిందో అర్థం చేసుకోగల పరిస్థితిలో లేడు. తన కూతురు భవితవ్యం వూహించుకుంటూ కూర్చుండి పోయాడు.

ఉండబట్టలేక ఇంకోనాడు మళ్ళీ శాంతమ్మే ఆ విషయం ఎత్తితే, "మీకెందుకు ఆ విషయ మంతా? మీ జపమేదో, మీ తపమేదో చూసు కుంటూ కూర్చోక?" అని కఠినంగా అన్నది, శాంతమ్మ ఆ విషయం మరి ఎత్తలేదు.

## 8

కార్తీక సోమవారంనాడు సాయంత్రం పూట శాంతమ్మ శివాలయానికి వెళ్ళింది. రాధ వంటపనిలో వుండి ప్రభ కాళ్ళకూ చేతులకూ అడ్డంవస్తున్నదని రాజును కేకేసింది- ప్రభ నెత్తుకు వెళ్ళమని.

గదిలో కూచుని చదువుకుంటున్నవాడు చదివే చదువు ఆపేసి ప్రభ నెత్తుకుని వీధి లోకి వస్తూ, అంతఎత్తున వున్న గడప కాలుకు తగలడంతో పిల్లతోపాటు బొక్కబోర్లా కింద పడ్డాడు.

పక్కనే వున్న తలుపు మీద పడడంతో రాజు మొహానికి దెబ్బతగిలి, నిమిషాల మీద బొడిపెకట్టింది. ప్రభ భయపడ్డదేకాని దెబ్బేమీ తగల్లేదు. అయినా వౌహాటేపేడుపు బిగ్గరగా.

వంటింటోంచి "ఏమిటి? ఏమిటి?"అంటూ రాధ ఒక్క గంతులో అక్కడికి వచ్చింది.

"అత్తయా! నేనేం చెయ్యలేదు అత్తయా!" అని రాజు భయంతో, దీనంగా

ఏదో చెప్పుకోబోయాడు గాని, రాధ అదేమీ గమనించకుండా, విన్పించుకోకుండా కనుగుడ్లు రెండూ వూడిపడిపోతాయేమో ననిపించేట్లుగా నెత్తిన ఒక్కటి మొట్టింది. రాజు గుడ్లనీరు గుడ్ల గ్రుక్కుకుంటూ 'అత్తయ్యా! అత్తయ్యా!' అంటున్నాడు.

అంతలోకి శివాలయంనుంచి శాంతమ్మ వచ్చి, ఇదంతా అర్థంకాక, "అదేమిటే! అదేమిటే!" వాణ్ణలా మొట్టికాయ లేస్తా వెందుకే ?" అంటూ అడ్డం పోయింది.

"తినేదంతా ఏమయిపోతున్నదో ఏమో ! చేతుల్లో అంత సత్తువ లేకుండా పోయిందా ? పడేయాలనే పడేశాడు...." అంటూ రాజును వొకటేవిధంగా ఆడిపోయడం మొదలెట్టింది.

"శాంతమ్మ ఏదో అనబోయేసరికి "ఏమిటీ మాయదారి గోల?"అంటూ ప్రకాశం ఇంట్లోకి వచ్చాడు.

"చూడరా. చూడరా. వాణ్ణి అది ఎంత కాల్చుకు తింటున్నదో! పిల్లని పడెయ్యాలని వాడెందుకు పడేస్తాడు చెప్పు ?" అని శాంతమ్మ ప్రకాశాన్ని ప్రశ్నించింది.

"పడేయాలనే పడేశాడు. రెండోసారి ఇహ ఎత్తుకోమనముగదా అని. వేలెడు లేడు-చూడండి ఎన్ని ఎత్తులో వాడికి!...."

రాధ ఇంకా చెప్తూనే వున్నది. ప్రకాశం కళ్ళు కెంపులు కురిసినవి. పళ్ళు పటాపటా కొరుకుతూ రాజుజుట్టు ఒక చేత్తో పట్టుకుని. రెండో చెత్తో ఆ చెంపా, ఈ చెంపా బాది వదిలిపెట్టాడు. శాంతమ్మ నిర్విణ్ణురాలై ఏమీ చేయలేక పోయింది. అడ్డుబోవటానికి కూడా ఆమెకు ధైర్యమే లేకపోయిందో, లేక అడ్డు బోదామనే ఆలోచనే తట్టలేదో, మరి అలాగే చూస్తూ ఉండిపోయింది.

రాధ ప్రభను తీసుకుని వంటింట్లోకి పోయింది.

ప్రకాశం గదిలోకి పోయాడు.

అప్పుడు పోయి శాంతమ్మ అక్కున చేర్చుకున్నది రాజును. వెక్కి వెక్కి ఏడుస్తూ, రాజు శాంతమ్మ వొళ్ళో తలదాచుకున్నాడు.

ఇలాంటి సంఘటనలు ఈమధ్య తఱుచుగా జరుగుతున్నవి. శాంతమ్మ, రాజు విషయంలో ఏమీ చేయలేక పోతున్నది.

రాజుకు తన స్థానం, పరిస్థితీ పూర్తిగా అర్థమవుతున్నవి.

పరిస్థితుల కనుగుణంగానే ప్రవర్తిస్తూ, కాలం వెళ్ళబుచ్చుతున్నాడు రాజు. ఎక్కడి కక్కడ చాలా జాగ్రత్తగా ఉంటున్నాడు. చదువు మానవలసి వస్తే మాని పిల్లనెత్తుకు తిరుగుతున్నాడు; ఆడిస్తున్నాడు. రాధమాటకు కాదనకుండా తలవంచుతున్నాడు. ప్రకాశం అంటే భయపడిపోతున్నాడు.

కానీ, ఎన్నాళ్ళు అగ్నిపర్వతం పేలకుండా ఉంటుంది? ఇవ్వాళ కాకపోతే రేపయినా తప్పదు.

ఆ రోజు దగ్గర పడుతున్నదని రాజు ఒక్కడే గ్రహించగల్గాడు. శాంతమ్మ లీలగా అర్థం చేసుకుంది గాని, ఇలా ఆనాడు పగిలి పోతుందని అనుకోలేదు. రాధా, ప్రకాశమూ, రాజు హృదయంలో రగులుతున్న విస్ఫులింగాల నసలు విలోకించనేలేదు.

## 9

పరీక్షాఫలితాలు తెలిసినయ్. రాజు పరీక్షలో తప్పాడు. రాజు ఏలాగు ఈ విషయం ఇంట్లో చెప్పటమా అని ఆలోచిస్తూ ఇంటికి వచ్చాడు. రాధకు అప్పటికే, రాజు అంటే పడని

ప్రక్కింటి కుర్రాడు వచ్చి, చెప్పిపోయాడు ఆ విషయాన్ని సంతోషంగా.

తన కొంప గుండాం అయిపోతున్నదన్నది. ఏటికేడాదికట్టిన జీతమంతా, బూడిదలోపోసిన పన్నీరయిందన్నది. శుద్ధ మొద్దు. దానికితోడు చదువంటే శ్రద్ధలేదు. ఇంకేం ప్యాసవుతాడన్నది. నీ ఏడుపు నీకేకొట్టిందన్నది చివరకి.

రాజుకు అభిమానం బాగా దెబ్బతిన్నది. తను తెలివితక్కువవాడా? పిల్లనెత్తుకోవడంతో తన కాలమంతా హరించుకుపోయింది. చదవలేకపోయాడు. పరీక్షలు వ్రాయలేకపోయాడు. తప్పాడు. అందుకు తన ఏడ్పుమొహం కారణమా? అసలు తనది ఏడ్పుగొట్టు మొహమా?

అతని మనస్సులో కల్లోలం బయల్దేరింది. ప్రశ్న పరంపర అతనిమీద ఎడతెగని దండయాత్ర ప్రారంభించింది.

మూలిగే నక్కమీద తాడికాయ పడ్డట్టు ప్రకాశం ఇంటికి వచ్చినప్పట్నుంచీ ఎంతెంత లేసిమాటలో అన్నాడు. తన జీవితమూ, తన జీతమూ వృధాగా వాడి జీవితానికి ధారపోశావన్నాడు. తన అక్కయ్యతో పాటు, వీడూ పోయినా తనకు కొంత భారం తగ్గేదన్నాడు. ఎవడిని ఉద్ధరించటానికి వీడు బ్రతికున్నట్లు? అని తీక్షణంగా ప్రశ్నించాడు.

అప్పటికీ అతనికసి తీరలేదో ఏమో వీపు మీద దబదబా నాలుగు బాది తల గోడకేసి కొట్టాడు.

శాంతమ్మ వైశాఖపూర్ణిమ సముద్ర స్నానానికి పోవడంతో అడ్డుపోయినవారూ లేకపోయారు. దగ్గఱకు చేరదీసి ఓదార్చినవారూ లేకపోయారు.

వెక్కి-వెక్కి ఏడుస్తూ అక్కడే కూచున్నాడు — తనని తాను తిట్టుకుంటూ అంత ఏడ్పులోనూ రాజు.

ప్రకాశానికి రాజు ఏడ్పు గోలగా వుంది కాబోలు— "నా ముందు ఏడవకు. దరిద్రమ్మొహమా! అవతలికి పోయి చావు!" అన్నాడు కోపంగా.

రాజు చొక్కా చివటితో, ముక్కూ-కళ్ళూ తుడుచుకుంటూ, ఆగని ఎక్కిళ్ళను ఆపుకుందామని ప్రయత్నం చేస్తూ ఇంట్లోనుంచి బయటకు వెళ్ళిపోయాడు. సూర్యాస్తయమైంది.

ప్రకాశం, స్నానం చేసి 'రాజూ!' అని కేక వేశాడు. సమాధానం రాలేదు. వరండాలోకి పోయి చూశాడు. ఊహూ - అక్కడ కూడా లేడు.

బహుళ పాడ్యమి చంద్రుడు, మొహం ఎఱుపు చేసుకుని, విశాలాకాశంలోకి ఒంటరిగా ఎగబ్రాకుతున్నాడు.

ప్రకాశం, భోజనంచేసి, పడుకోబోతూ రాజు వచ్చాడేమోనని చూశాడు మరోసారి. కానీ రాజు రాలేదు.

"ఎక్కడికి పోతాడు లెద్దూ దౌర్భాగ్యుడు? ఏ స్నేహితుడింటోనో పడుకుని వుంటాడు. తెల్లవారేసరికి రాడూ! తలుపులు వేసెయ్! ఇక్కడ తప్ప మరోచోట వాడి నాదరించే వారెవరు?" అన్నాడు రాధతో అధైర్యంతోనే.

తెల్లవారింది. సూర్యోదయమైంది. రాజు రాలేదు.

సముద్రస్నానం చేసి ఇంటికి తిరిగివచ్చిన శాంతమ్మ యీ వార్త విని బావురుమంది. కుప్పలా మొదలంటా నరికిన వృక్షంలా కూలిపోయింది.

ప్రకాశం మంచం మీద పడుకుని ఎన్నో విధాల ప్రయత్నంచేశాడు నిద్రపోదామని.

కానీ, లాభం లేకుండాపోతున్నది. వారంరోజు లయింది. ఇంతవరకూ రాజు రాలేదు. ప్రక్కయింటివారి గడియారం నాల్గుగంటలు కొట్టింది.

అష్టమి చంద్రుడు మబ్బులతో దోబూచు లాడుతున్నాడు. గ్రుడ్డివెల్తురు, కిటికీలోనుంచి ఇంట్లోకి వచ్చి పడుతున్నది. బెడ్ లైటు వెలగ లేక వెలుగుతున్నది.

శాంతమ్మ అటూ యిటూ వత్తిగిలినపు డయే శబ్దం.... ఆమె హృదయంలోని ఆవేదనను తెలయజేస్తున్న గాఢమైననిట్టూర్పులా ప్రకాశానికి విన్పిస్తూనేవున్నాయి.

శాంతమ్మకు రాజు విషయం ఆలోచించిన కొద్దీ అగమ్యగోచరంగా వుంది. తను ఆనాడు సముద్రస్నానానికి ఎందుకు వెళ్ళాలి? తను ఇంట్లో వుంటే వాడిలా పారిపోయే వాడు కాదేమో!

రాజు ఎక్కడెక్కడ తిరుగుతున్నాడో యేమిటో? విశాఖపట్నం పోయినా బావుండేది! ఏ బాధ నుంచి తప్పిద్దామని ఇక్కడకు తీసుకు వచ్చామో, ఆ బాధకే వాడు గురిఅయినపుడు అక్కడే, విశాఖపట్నంలోనే రక్తబాంధవ్యం కలవాళ్ళలోనే— ఆ బాధలు పడినా కొంతలో కొంత మెరుగ్గా వుండేది! వాడికీ అది భరించ రాని కష్టంగా వుండేదికాదు.

కానీ, వాడు విశాఖకు కూడా పోలేదట!

అసలు ప్రకాశం యిలా ఎందుకు మారి పోయాడో?

అక్కడ సుశీల సరిగా చూడడంలేదని బాధపడి, వాడి జీవితాన్ని ఒక మార్గంలోపెట్టి వాడికి రెక్కలు తెప్పించి ప్రయోజకుణ్ని చేద్దామని తీసుకువచ్చినవాడు, ఇలా.... ఇలా భార్యచేతిలో కీలుబొమ్మయి, వాడి పాత్ర నిర్గమించడానికి కారకుడయినాడేమీ?

తన బావ దగ్గర్నుంచి రాజును తీసుకువచ్చి ఏమిటి ఉద్ధరించింది? సుశీలను చేసుకున్న తర్వాత బావలో మార్పువచ్చిందని బాధపడ్డ ప్రకాశం, తాను రాధను వివాహం చేసుకున్న తర్వాత తనలో వచ్చినమార్పు గ్రహించడేం?

లోకంతీరు అన్నా, మనుషులు మారరమన్నా ఇదేగా మోసు! ఎక్కడున్నదీ యీ లోపం? రాధ కూడా క్రొత్తగా కాపరానికి వచ్చినప్పుడు రాజును ఎంత ప్రేమగా, ఎంత శ్రద్ధగా చూసింది! ఆ పిల్ల పుట్టినప్పట్నించీ బంధుత్వం తెంచుకొని, ధనానికే ప్రాధాన్యం యిస్తూవచ్చింది.

తనలోని మార్పును, రాధలో వచ్చిన మార్పును తను చెప్పినా గ్రహించుకోడేమీ మూర్ఖుడిలా? ఎంతసేపటికీ, పసివాడిదే తప్పంటాడు కానీ, తన విజ్ఞానమూ, విచక్షణా, నలిగినదారుల్లో మూలుగుతోందని తెలుసుకోడు.

ఎప్పటికి తెలుసుకుంటాడు? ఏనాడు రాజు ఇంటికి తిరిగివస్తాడు? అసంఖ్యాకమైన ప్రశ్నల భారానికి ఆమె మనసు క్రుంగిపోతున్నది.

క్షణ మొక యుగంగా గడుస్తున్నది శాంతమ్మకు.

ఎప్పుడు తెల్లవారుతుందా అని ఎదురు చూస్తున్నాడు ప్రకాశం.

కానీ—

ఇప్పుడిప్పుడే తెల్లవారేటట్లులేదు!!



# మంగళాశాసనము

— శ్రీ శ్రీనివాస సోదరులు
శతావధానులు

౧

*కవివి, కవిమండలైకవర్తి,
వనుశాసితవును, అపహతపాప్ముడ
వవుర! వేదపారిషద్యుడవు;
తరమె ప్రస్తుతింప?
కీర్తనీయ!
బూర్గుల రామకృష్ణరాయ!

౨

నీ యనంతలక్ష్మి మనోనీతవృత్తి,
విబుధ రక్షార్థమైన నీ విష్ణుశక్తి,
రామకృష్ణాభిధైకత్రరంజనంబు
ఆదినారాయణత్వ చిహ్నములుగావె?

౩

మత్స్యమూర్తివిధాన మహితాంధ్రభారతి
జెరనుండి తప్పించి చెలువుగూర్చి,
కూర్మమూర్తియనంగ గోర్కి విశాలాంధ్ర
మును మున్గిపోకుండ మోచి నిలిపి,
కిరిమూర్తివడువున బరిపంథిహృతమైన
యాంధ్రతేజంబు వెలార్చి తీర్చి,
నరసింహమూర్తివై గురుహుంకృతిస్ఫూర్తి
నాంధ్రడింభద్రోహి నతకరించి,

* "కవిం పురాణ మనుశాసితారం", "అపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః" అను శ్రుతు లనుసంధేయములు.

పూర్వపూర్వావతార విస్ఫురణ నెరపి
యవధరించిన యధునాతనావతార
మచ్చువడ కేరళమ్మున నడుగువెట్టి
సలుపుచుంటివి ధర్మసంస్థాపనమ్ము.

అరువదియేండ్లు నిండిన మహమ్మున
బాలుడవైతి వెండియున్,
సరవి మరొండు పూర్ణపురుషాయుషముం గొనుమందు,
మద్దియుం బరువడి నిండ నింకొకటి,
పై నికనొక్కటి, యింకనొండు,
నీ సరణిని
నీకు బూర్ణపురుషాయుషముల్ శతమాన మయ్యెడున్.

ఇ॥

వితథవచసో భవేమే
త్యలం భియా ; యదిహ రామకృష్ణవరః
స్వయమేవ సకలఫలద
శ్చకాస్తి సవిధే ప్రసన్న అతిసులభః.



# ప్రధానంగా సాహిత్యవ్యక్తి

—శ్రీ డి. రామలింగం

బూర్గుల రామకృష్ణరావు పంతులుగారిని నేను ఎరుగుదును కాని వారు నన్ను ఎరుగరు. పోలీసుచర్య తరువాత హైద్రాబాదులో ఇంకా ప్రజాప్రభుత్వం ఏర్పడని రోజులవి. అప్పుడు నేను "సారథి"అను వారపత్రికలో సహాయ సంపాదకుడుగా పనిచేస్తూ వుండేవాణ్ణి. రాష్ట్ర రాజకీయాలు అనిశ్చిత పరిస్థితుల్లో వున్న రోజులవి. మా వారపత్రికకు నాటి పరిస్థితులను గూర్చి ఒక వ్యాసం దయచేయవలసిందిగా వారిని వెళ్ళి అడిగాను. అలాగే వారు వ్రాసిఇచ్చారు. ఒక తెలుగు వారపత్రికలో పడ్డ ఆ వ్యాసం ఆంగ్లంలోకి కూడా అనువదింపబడి, స్థానిక ఆంగ్ల దినపత్రికలోకూడా ప్రచురితమైంది. రామకృష్ణరావు పంతులుగారు ఒక అభిప్రాయమంటూ ప్రకటిస్తే దానికి అంత ప్రాముఖ్యం. ఆ తరువాత నేను వారిని మళ్ళీ కలుసుకోలేదు.

మనిషిని వెళ్ళి కలుసుకోలేదేగాని వారి ప్రజాహిత జీవితం ఎప్పటికప్పుడు గమనిస్తూనేవచ్చాను. పంతులుగారు బహుముఖ ప్రజ్ఞావంతులు. లాయరుగా వారి ప్రజ్ఞాప్రాభవా లెట్టివో పలువురి నోట విన్నాను. రాజకీయవేత్తగా, పరిపాలకులుగా వారి ఔన్నత్యాన్నీ, సామర్థ్యాన్నీ తెలుసుకొంటూ వచ్చాను. కవిగా, రచయితగా, సాహిత్యకులుగా వారికి గల స్థానాన్ని పత్రికలలో ప్రచురింపబడుతూ వస్తూవున్న వారి రచనలు చదివి ఆకళింపుచేసుకొంటూవచ్చాను. బహుముఖమైన వారి ప్రతిభనూ, సేవలనూ, కార్యకలాపాలనూ పరిశీలిస్తే వారు ప్రధానంగా సాహిత్యకులన్న అభిప్రాయం నాకు కలిగింది. జీవితంలో ఒక్కొక్కప్పుడు ఒక్కొక్క కార్యక్రమంలో నిమగ్నులై వుంటూ వచ్చారు. ఒకప్పుడు విద్యార్థి, తరువాత లాయరు, ఇంకొకప్పుడు రాజకీయ ప్రజానాయకులు. వేరొకప్పుడు మంత్రి, ముఖ్యమంత్రి. ప్రస్తుతం ఒక రాష్ట్రానికి గవర్నరు. ఇన్ని దశలలోనూ వారు ఎల్లప్పుడూ సాహిత్యకులుగా కూడా వుంటూ వచ్చారు. ప్రతి దశలోనూ ఏదో ఒక రచన చేయకపోలేదు. ఆ మాట కొస్తే యావదాంధ్రంలోనూ రాజకీయ ప్రజానాయకులైన వారిలో సాహిత్యాన్ని అంత అభిమానవిషయంగా, అలా రెండవ వృత్తిగా పెట్టుకొన్నవారు లేరేమో అనిపిస్తూవుంది. వృత్తి అంటే ఆ పదం యొక్క పరిపూర్ణార్థంలో నేను వాడడంలేదు నిరంతరాసక్తితో కూడిన వ్యాపకం అనే అర్థంలో వాడు

తున్నాను. సాహిత్యం వారికి కేవలం అభిమాన విషయమే కాదు. కేవలం రెండవ వృత్తి మాత్రమే కాదు, అది వారి జీవయాత్రలో ఒక అభ్యాసం. ఏపనీ లేకుండా విశ్రాంతిగా గడపగలరేమో కాని, చదువకుండా ఏదో వ్రాయకుండా వుండలేరనుకుంటాను. వ్రాసిన ప్రతిదీ ప్రకటించే అలవాటు వారికిలేదు. కాని ఉబుసుపోకకై ఏదో వ్రాస్తారు. అలాగే సాహిత్యసభల్లో పాల్గొనడమన్నా వారికి అత్యంతానందకరమైన విషయం. రాజకీయమైన లేక తదితరమైన సభలో తమ అభిప్రాయాన్ని కారణాంతరాల చేత వెలువరచడానికి వెనుదీస్తారేమో గాని, సాహిత్య సభలో ఏదేని విషయం ప్రస్తావనకొచ్చినప్పుడు తమ అభిప్రాయాన్ని ప్రకటించకుండా వుండరు. పాశ్చాత్యులు చెప్పే Man of letters అనే మాట వారిపట్ల పూర్తిగా సార్థకమవుతుంది. తెలుగులో చెప్పాలంటే వారు నూటికి నూరుపాళ్ళు సాహితీవ్యక్తి. మాన్ ఆఫ్ లెటర్స్ అన్నమాటలో కేవలం తన భాష, తన సాహిత్యం పట్ల మాత్రమే ఆసక్తి అభిమానాలు వుండడం కాదు. ఏ భాష అయినా ఏ సాహిత్యమైనా సరే. అందులోని అందచందాలకు ఆకర్షితుడై, వాటి స్వారస్యాన్ని అర్థంచేసుకొని, సొగసులను ఆస్వాదించి. ప్రశంసించ గలిగిన వ్యక్తిత్వం వుండాలి. ఆ వ్యక్తిత్వం రామకృష్ణరావు పంతులుగారిలో ప్రస్ఫుటంగా కన్పిస్తుంది. కాబట్టే వారు సంస్కృతాంధ్రాంగ్ల మహారాష్ట్ర కర్ణాటక ఉర్దూ పారసీ సాహిత్యాలను తెలుసుకొన ప్రయత్నించారు. కొన్నింటిలో ప్రత్యేకంగా కృషి చేసి రచనలుచేశారు. పంచ భాషా కవిసమ్మేళనాలతో వినోదించారు. వ్యవధిలేకపోయిందేమో గాని రెండు మూడు యూరపుఖండ భాషల సాహిత్యాలను కూడా అధ్యయనంచేసేవారేమో. దీనికంతటికీ కారణం సాహిత్యమంటే ఏమిటి అన్న విషయంలో వారికి ఇదమిత్థమైన భావాలున్నవి. ఆ భావాలను వారు తరచు ప్రకటిస్తూవచ్చారు కూడా.

తెలంగాణా రచయితల సంఘం ప్రథమ వార్షికోత్సవాన్ని ప్రారంభిస్తూ "ప్రపంచంలో ఉత్తమ నాగరకతా లక్షణములలో ముఖ్యమైనది సాహిత్యము. యుగయుగముల చరిత్రను సూక్ష్మదృష్టితో పరిశీలించినచో ప్రపంచమునకు నాగరికతను ప్రసాదించినవారు సాహితీపరులేనని స్పష్టమగుచున్నది" అని పంతులుగారన్నారు. 'Poets are unacknowledged legislators of mankind' అన్న అభిప్రాయాన్ని వారు తరచు నొక్కి చెబుతూవుంటారు. అంతేకాదు, నేటి సంక్షుభిత ప్రపంచానికి శాంతిని ప్రసాదించి విశ్వశ్రేయస్సు చేకూర్చగలది సాహిత్యమే అని కూడా వారి ప్రగాఢ విశ్వాసం. వ్యక్తిగా మానవునికి

సంతుష్టినీ, ఆనందాన్నీ ఇవ్వగలది సాహిత్య కృషియేనని వారి నమ్మిక. కనుకనే ప్రజాహిత జీవనంలో వారు ఎప్పుడు ఏమైనా సాహిత్యం వారి ఐచ్ఛికవిషయం. సాహిత్యకారులు - వారు ఏ అంతస్తుకు చెందినవారైనా సరే - వారికి ఆప్తులు. గ్రంథపఠనం వారికి తీరికవేళ పని. తీరిక కల్పించుకొని అయినా సరే, సాహిత్య కృషి చేయవలసిందే. స్వయంగా అనేక గద్య పద్య రచనలు చేశారు. సంస్కృత పారసీకముల నుండి అనువాదాలు చేశారు. విమర్శలు వ్రాశారు. చర్చాగోష్ఠుల్లో పాల్గొన్నారు. వారెక్కడున్నా అది సాహితీ నిలయం.

రామకృష్ణరావు పంతులుగారి సాహితీ వ్యక్తిత్వంలో నన్ను ప్రబలంగా ఆకర్షించింది వారి పరిశీలనా స్వభావము, సత్యాన్వేషణా కృషి. సాహిత్యకునికి ఇవి అత్యంత ప్రధానవిషయాలు. ఆంధ్ర సాహిత్యరంగంలో - ముఖ్యంగా ఉద్యమదశల్లో ఇవి కొరవడడంచేతనే అతివ్యాప్తికి అవకాశం కలిగింది. అన్వేషణా దృష్టి తగ్గినప్పుడు, పరిశీలకులు లేనప్పుడు ఈ లోపం ఏ భాషా సాహిత్యానికైనా వస్తుంది. అప్పుడు చర్వితచర్వణంగా, వెర్రితలలుగా, నానా దోష భూయిష్టంగా వుంటుంది పరిస్థితి. నిశతంగా పరిశీలనచేసి, రచయిత దృష్టితో కూడా సానుభూతితో అర్థంచేసుకొని, వివేచనతో విలువలుకట్టేవా రున్నప్పుడు సాహిత్యం ప్రవర్ధమాన మవుతుంది. అలాంటివారు పరిశీలకులు, విమర్శకులు. పంతులుగారు ఈ పాత్రను వైదుష్యంతో నిర్వర్తించారు. వెలువడుతూన్న సాహిత్యాన్ని ఒక కంట విమర్శనా దృష్టితో చూస్తూవొచ్చారు. కనుకనే ఒక సందర్భంలో "మన రచయితలు ఎక్కువగా తాత్కాలిక ఆనందమును లేక సద్యఃపరనిర్వృతిని మాత్రమే ఒసంగు సాహిత్యమును వెలువరించుచున్నారు... మాస పత్రికలు నేడు చిట్టికథలతో నిండియున్నవి. విజ్ఞానప్రదమైన వ్యాసములు అరుదుగా ప్రకటించబడుచుండుట చూచుచున్నాము. రైలుబండ్లలోను, ప్రవాసములలోను తాత్కాలికానందమును చేకూర్చు రచనలును అవసరమే. కాని అంతకంటె అవసరమైన సాహిత్యము విజ్ఞానప్రదమగు గ్రంథములు" అని దేశాన్ని హెచ్చరించారు. అవసరమని భావించినప్పుడు తామూ రంగంలోకి దిగి తమ అభిప్రాయాలను స్పష్టంచేశారు. ఆ అభిప్రాయాలను ఈ నాడు పునః పరిశీలనచేస్తే వారు ఆధునిక భావాలు గలవారనీ, నవ్యమార్గానురక్తులనీ విశద మవుతుంది. ఉదాహరణగా దేశంలో ఎంకిపాటలపై దుమారం రేగినప్పుడు "నవీన వాఙ్మయము - ఎంకిపాటలు" అను శీర్షికతో వారు వ్రాసిన వ్యాసం తెలుగు విమర్శనాసాహిత్యంలో గణనీయమైంది. సాహిత్యంలో ఉచితా

నుచితాల ప్రస్తావన వచ్చినప్పుడు పరిశీలకునికి ముఖ్యంగా కావలసింది పూర్వాపరయుక్తమైన, వాస్తవమైన, అభ్యుదయశీలంగల ఉదాత్త దృష్టి. ఆ దృష్టి వున్న విమర్శకుడు చేసిన విమర్శ నిలుస్తుంది. హెచ్చుమంది దాన్ని ఆమోదిస్తారు. అది న్యాయమైన విమర్శ కూడా అవుతుంది. జ్ఞానాన్ని విశాలం చేస్తుంది. పైన పేర్కొనబడిన వ్యాసంలో రామకృష్ణరావుగారు ఆ దృక్పథాన్నే అనుసరిస్తూ "వాఙ్మయము సక్రమ పద్ధతులపైన నిర్మింపబడిన విజ్ఞానసౌధము. అది యెల్లప్పటికిని నిర్మింపబడుచు ఒకప్పటితో పరిపూర్ణతనొందని నిర్మాణరాజము. అట్టి దాని స్వరూపమును సంకుచిత పరచుట కెవరి తరము?" అని ప్రశ్నించారు. అంతేకాదు, నవీనవాఙ్మయానికి సార్వజనీనత (Universality), సత్యానుకరణము (Realism), స్వాతంత్ర్యం (Freedom) మూడు ముఖ్యగుణాలని ఉద్బోధించారు. మొదలు భాష తరువాత వ్యాకరణము, మొదలు కవిత్వము తర్వాత లక్షణము పుట్టినవన్నారు. కవిత్వము లాక్షణికుల సొమ్మా? పండితులసొమ్మా! ఒక భాషసొమ్మా! అని ప్రశ్నిస్తూ వాడుకభాషను వాఙ్మయమునందుపయోగించుట తప్పు కానేరదని ఘంటాపథంగా చెప్పారు. కవియొక్క అనుభవమందు ఇంచుకైన పాల్గొనలేనిది విమర్శకుడు కాజాలడని స్పష్టీకరించారు. ఎంకి, నాయుడు పాత్రలను విపులంగా పరామర్శచేస్తూ కావ్యములోని అన్ని చిత్రముల సమన్వయము గావించినచో నాయికా నాయకు లనురూపులును, ననుకూలురునగు కృషిక దంపతులనియు, మొదట యౌవన చాపల్యంబున నొకరి నొకరు నేమరించుచు, ప్రణయ కోపాది సహజ వికారములు జూపుచు, రానురాను భావములు పరిపక్వదశనొంది ఉత్తమ దంపతుల పవిత్ర ప్రేమయొక్క లౌకికానుభవమును పొందియున్నారు." అని వ్రాసినారు. ఎంకిపాటలు సరసశబ్ద కల్పనము, భావసౌకుమార్యము, ధ్వని ప్రాధాన్యంతో విరాజిల్లుతూ వున్నవని చెప్పారు. ఎంకిపాటపై జరిగిన, జరిగే తర్జన భర్జనలలో పంతులుగారి అభిప్రాయము అస్మదాదులకు ఆఖరిమాట. అంతకుమించి మరేమైనా చెప్పొచ్చేమోకాని వారు చెప్పిందాన్నిమాత్రం కాదనలేరు.

రామకృష్ణరావు పంతులుగారి చారిత్రక దృష్టికి "కాకునూరి అప్పకవి జన్మస్థానము" "రెడ్డిరాజులకాలపు మత సంస్కృతులు" అను రెండు వ్యాసాలు ప్రమాణప్రాయమైన నిదర్శనాలు. అప్పకవీయము రచించిన అప్పకవి జన్మస్థానం తెలంగాణాలో మహబూబ్‌నగర్ జిల్లాలోని కాకునూరని తేల్చి

చెప్పినారు. చరిత్ర, సాహిత్యం—ఇవి రెండూ అభిమాన విషయాలైన వారికి ఈవ్యాసం ఎంతో ఆసక్తికలిగిస్తుంది. అంత సహేతుకంగా వ్యాసరచనసాగింది. అల్లాగే రెడ్డిరాజుల 150 సంవత్సరముల కాలపు మత సంస్కృతుల పూర్వాపరాలను సోపపత్తికంగా, శాసన ప్రమాణంగా వివరించడానికి ప్రయత్నించారు. సాంఘికచరిత్రకు ఒక అధ్యాయమని చెప్పదగిన ఈ వ్యాసం ఎక్కువగా సాహిత్యం ఆధారంగానే రచింపబడింది.

ఫారసీ, ఉర్దూ సాహిత్యములతో పంతులుగారికి గల పరిచయం "ఉమర్ ఖయ్యాం", "ఉర్దూభాషాసారస్వతములు" అను వ్యాసములవల్ల విదితమవుతుంది. ఉమర్ ఖయ్యాం తెలుగు అనువాదాల ప్రసక్తి వచ్చినప్పుడు వారు రాయప్రోలు సుబ్బారావుగారి "మధుకలశము" నే పేర్కొన్నారు. దువ్వూరి రామిరెడ్డిగారి "పానశాల" ప్రస్తావన తేనేలేదు. ఇంకా మరికొందరు కూడా అనువదించారు. అయితే వారు ఈ వ్యాసాన్ని 1927 లో రచించారు. అప్పటికింకా వారు ఇతర అనువాదాలు చూడలేదేమో. సరే స్వయంగా వారు ఫారసీ రుబాయీలనే ఉదహరించి చర్చ చేసినప్పుడు అనువాదాల ప్రసక్తి అంతగా అక్కరలేదు. మొత్తంపై ఈ వ్యాసంలో ఫారసీ భాషయొక్క చారిత్రకవారసత్వ పరిణామాన్ని ఉమర్ ఖయ్యాం ఈశ్వరతత్వాన్ని, జీవన్మిథ్యాత్వాన్నీ, అతని మనస్సు నాందోళనపరచిన అనేక అంశాలను దిఙ్మాత్రంగా సూచించారు. అయితే "సూఫీసర్మద్" అను వ్యాసంలో ఉమర్ ఖయ్యాం ఇతర అనువాదాల ప్రసక్తి తెచ్చి తాము సర్మద్ గీతములను కొన్నిటిని తెనిగించినట్లుగా చెప్పారు. ఈ వ్యాసంలో సూఫీల తత్వాన్ని వివరిస్తూ సత్యస్వరూపమజ్ఞేయమనీ, సర్వాంతర్యామి యగు శక్తి నిర్గుణమని, జీవుడు కర్మబద్ధుడనీ, జీవితము క్షణభంగురమనీ, కాబట్టి ప్రేమలో భక్తియేముక్తిసాధనమని సూఫీల ఉపదేశమని చెప్పారు.

"ఉర్దూభాషాసారస్వతములు" అను వ్యాసంలో ఉర్దూభాష పుట్టుకను, ఉర్దూ కవితా ప్రథమయుగాన్ని రెండవ యుగాన్ని, ఆయా యుగాలకు చెందిన కవులను పరిచయంచేశారు.

పంతులుగారి స్నేహశీలమును, సహృదయతను చాటడానికి కీ. శే. ప్రతాపరెడ్డిగారిని గూర్చి వారు వ్రాసిన వ్యాసము మహోత్కృష్ట నిదర్శనం. వ్యాసం వ్రాయ నారంభించగానే "ప్రతాపరెడ్డి అన్నగారు" అన్న మాటలు దొర్లివచ్చినవట. ఎన్నివిధాల వారు తమకు అగ్రజులో పంతులుగారు ఈ

వ్యాసంలోచెప్పి, "స్పష్టమైనలక్ష్యం, వంకరలేనిగురి, అమోఘమైనప్రయోగం, విడుపులేని పట్టు, విశిష్టమైన సాధన ప్రతాపరెడ్డిగారి ప్రతిభకు వన్నెతెచ్చిన సుగుణాలు" అన్నారు. అలాగే రామకృష్ణరావు పంతులుగారిని గూర్చి చెప్పాలంటే, అనన్యమైన ప్రతిభాసంపద, సరసవైఖరి, సాహిత్య జిజ్ఞాస, వ్యామోహం లేని ఉదాత్తమైన ప్రజాహిత జీవనం, నిండుకుండవలె తొణకని వ్యక్తిత్వం, సర్వ సంప్రదాయాలనూ సమానంగా గౌరవించే సంస్కృతసంస్కారం— ఇవి వారి ప్రత్యేకతలు. గ్రీకు తత్వవేత్తలు చెప్పిన ఆదర్శ రాజకీయవేత్త గుణాలు వ్యక్తిత్వంలో కన్పిస్తాయి.

రామకృష్ణరావుపంతులుగారి వ్యాసాలను కొన్నింటిని "సారస్వతవ్యాస ముక్తావళి" అను పేరుతో గ్రంథంగా ప్రచురించి ఆంధ్రసారస్వతపరిషత్తు వారు ఆ కొరతను తీర్చారు. అయితే పంతులుగారు వ్రాసిన వ్యాసాల నన్నిటినీ సేకరించి సమగ్ర గ్రంథంగా పాఠకులకు అందజేయవలసిన ఆవశ్యకత వుంది. దాదాపు నలభై సంవత్సరాల వారి సాహిత్య సేవలో ఎన్నో వ్యాసాలు రచించి వుంటారు. అవన్నీ అనేకపత్రికల్లో వున్నాయి. వాటిని ఒకచోట చేర్చితే ఎంతో బాగా వుంటుందని నా ఆశ. అలాగే వారు తమ స్వీయచరిత్రను కూడా వ్రాసి ప్రకటిస్తే రాబోవు తరాలవారికి అది ఉత్తేజకరమైన గ్రంథంగా వుంటుంది. ఆ పని వారిచేత చేయించవలసిన బాధ్యత సాహితీపరులపైన, సాహిత్య సంస్థలపైన వుంది.



# చిన్న రాష్ట్రానికి చిన్న గవర్నరు

—శ్రీ దేవులపల్లి రామానుజరావు

భారత దేశంలోని రాష్ట్రాలన్నింటిలో కేరళ రాష్ట్రము చిన్నది. ఆ రాష్ట్రానికి గవర్నరైన డాక్టర్ బూర్గుల రామకృష్ణరావుగారు మన దేశము లోని గవర్నర్లందరిలోను పొట్టివారు. ఒకమారు స్వయంగా డాక్టర్ రావుగారే ఒకచోట ప్రసంగిస్తూ, భారత ప్రభుత్వము బాగుగా ఆలోచించియే కాబోలు, యీ చిన్న రాష్ట్రానికి వామనులైన తమను గవర్నర్‌గా నియమించి యుండ వచ్చునని ఒక ఛలోక్తిని విసరియుండిరి. ఆకార పరిమాణముమాట యెట్లున్నప్పటికిని, మన దేశములోని గవర్నర్లందరిలో రామకృష్ణారావు పంతులుగారు కుశాగ్ర బుద్ధియని నిస్సందేహముగా చెప్పవచ్చును.

హైదరాబాదు రాష్ట్ర ముఖ్య మంత్రిగా పంతులుగారు చాల కొద్ది మెజారిటీతో పరిపాలనా రథానికి సారథ్యము వహించినారు. వారికి హైదరాబాదు శాసన సభలో ముఖ్య ప్రతిపక్షము కమ్యూనిస్టు పక్షము. ముఖ్యమంత్రి కాకపూర్వము ఆంధ్ర మహాసభలలోను, స్టేటు కాంగ్రెసులోను, శ్రీ రామకృష్ణారావు కమ్యూనిస్టుల వ్యాప్తిని అరికట్టు ఉద్యమాలకు నాయకత్వము వహించినారు. శ్రీ కొండా వేంకటరంగారెడ్డి, శ్రీ మందుముల నరసింగరావు ప్రభృతులైన తెలంగాణా నాయకుల ఉద్యమాలకు రామకృష్ణారావు పంతులుగారు ముఖ్య సలహాదారుగా నుండినసంగతి అందరికి తెలిసిన సత్యమే. కాని విధివిధానము బూర్గులవారిని మనదేశ రాష్ట్రాలలో తొలి కమ్యూనిస్టు ప్రభుత్వానికి గవర్నరుగా చేసినది. ఈ పరిస్థితియందుగూడ రాణించగల నేర్పు వారికి కలదని గడచిన సంవత్సరాల అనుభవము ఋజువు చేయుచున్నది. ఎప్పటికెయ్యది ప్రస్తుతము అప్పటికది యాచరించి, కీర్తికాంత మెడలో పూలదండవేయు నేర్పు రామకృష్ణారావుగారికి వెన్నతోపెట్టిన విద్య.

వామనులైన రామకృష్ణారావుగారి తెలివితేటలు మహోన్నతమైనవి. సాధారణముగా వామనమూర్తులు మందబుద్ధులు కాకపోవుటయే కాక, మంచి కుశాగ్రబుద్ధులగుట అనివార్యమని ఒక లోకోక్తి కలదు. ఆ లోకోక్తిని అక్షరాల సత్యమని నిరూపించుటకు రామకృష్ణారావుగారు ప్రముఖ ఉదాహరణము. "ఇంతింతై వటుడింతయై" పెరిగిన వామనుని వలెనే, శ్రీ రామకృష్ణారావు గడచిన దశాబ్దములో క్రమక్రమముగా పెరిగినారు. పోలీసుచర్యకు పూర్వము

స్వామి రామానందతీర్థ బృందము శ్రీ రామకృష్ణారావు ప్రభృతులను కాంగ్రెస్ క్రమశిక్షణ చర్యకు గురిచేసి యుండెను. కాని తరువాత క్రమక్రమముగా స్వాములవారు కాంగ్రెస్ రాజకీయాలలో తమ వ్యక్తిత్వమును కోలుపోయి నారు; స్వాములవారి శిష్యులు నానాముఖముల పరుగెత్తి చీలిపోయినారు. అసహాయశూరులైన రామకృష్ణారావుగారు మాత్రము తమ వ్యక్తిత్వమును వికసింపజేసికొని, రాష్ట్రములోని కాంగ్రెస్ రాజకీయాలకు నేతృత్వము వహించి నారు. జనార్దన్‌రావు దేశాయిగారి అధ్యక్షతన యేర్పడిన పోటీ కాంగ్రెస్‌కు కార్యదర్శియై వెల్లోడి ప్రభుత్వములో రెవెన్యూ విద్యాశాఖలకు మంత్రి వర్యులై, తరువాత హైద్రాబాదు రాష్ట్రానికి ముఖ్యమంత్రియై, ఆ పిమ్మట కేరళ రాష్ట్రానికి గవర్నరై, రామకృష్ణారావుగారు ప్రకాశించుచున్నారు. ఇందుకు కారణము వారి ప్రతిభాసంపద, లోకజ్ఞానము, వ్యవహారచాతుర్యము లేనని చెప్పుటలో ఆవంతయును అతిశయోక్తి లేదు. అవసరమైనప్పుడు స్వపక్ష పరపక్షముల మధ్య భేదమును గూడ పాటించక, కార్యసాధన గావించుకొన గలిగిన సమర్థులు రామకృష్ణారావుగారు. ఈ గుణము వారి ప్రత్యేకతలలో పేర్కొనదగినది. తమ్ము అనుసరించువారున్నను, లేకున్నను అసహాయశూరులై అనుకున్నదానిని సాధింపగల అద్వితీయచాతుర్యము గలవారు శ్రీ రావుగారు.

సాధారణముగా తెలివితేటలతో అదృష్టము కలిసివచ్చుట అరుదు. కాని రామకృష్ణారావుగారు యీ సాధారణ సూత్రమునకు అపవాదము. అయితే వారి జీవితములో గూడ సుమారు అర్ధశతాబ్దము గడచిన అనంతరమే, ప్రాయపుప్రొద్దు కొంత పడమటివైపుకు మరలిన పిమ్మటనే, వారి ప్రతిభకు తగిన అవకాశాలు లభించినవని చెప్పవలెను. న్యాయశాస్త్రనిష్ణాతులై "హాజర్ జవాబు" శక్తిలో అద్వితీయులై, వాదనాపటిమ గలిగిన పంతులుగారు పోలీసుచర్యకు పూర్వము న్యాయవాదమును వృత్తిగా స్వీకరించినారు. కాని యీ వృత్తిమీద వారు యెక్కువ శ్రద్ధను, ఆసక్తిని చూపించలేదని ప్రతీతి. ఈ వృత్తి వారి జీవనసౌధమునకు గట్టి పునాదులను వేసికొనుటకు వినియోగ పడినది. సంఘాభిమానము వంటి సంకుచిత భావాలకు లోనుగాని విశాలదృష్టి వారిది. అందువల్లనే రాష్ట్రము విడిచినా రాణించగలుగుచున్నారు. రేపు విదేశాలకు వెళ్ళినా వాసికెక్కగలుందురు.

రామకృష్ణారావుగారు బహుభాషలు మాట్లాడగలిగిన ప్రవీణులు. తెలుగు వారి మాతృభాష; ఉర్దూ ఫార్సీలు చిన్నప్పుడే అలవడిన ఆంధ్రేతర భాషలు;

ఆంగ్లము ద్వారా, ఉన్నత విద్య నార్జించి వారు బి.యే.బి.యల్. పట్టభద్రులైనారు; మహారాష్ట్ర కర్ణాటకములతో విద్యార్థి జీవనమునందే సహవాస బలమున వారికి పరిచయము కలిగినది; విశ్రాంతిసమయాలలో వారు సంస్కృతమును అధ్యయనము గావించుచుందురు; ఇప్పుడు మళయాళములో గూడ వారు ప్రవేశము సంపాదించినట్లు పత్రికలు తెలుపుచున్నవి. పంతులుగారు తెలుగులోను, ఉర్దూలోను గద్యరచనను, పద్యరచనను రెండింటిని సాధించినారు; ఎదుటివారి భాష యేమిటో తెలుసుకొని, అందులోనే వారితో పంతులుగారు సంభాషించు దృశ్యమును హైద్రాబాదీయులందరును అవలోకించియున్నారు.

ఇన్ని ప్రజ్ఞలు గలిగిన రామకృష్ణరావు పంతులుగారి వ్యక్తిత్వమును గూర్చి ఆలోచించినప్పుడు ఒక ప్రశ్న వెంటనే ఉత్పన్నమగుచున్నది. 'వీని యన్నింటిలో వారికి అభిమానపాత్రమైన ప్రజ్ఞ యేది?' అనునది యీ ప్రశ్న. ఒక వ్యక్తికి బహు భార్య లున్నప్పటికిని, అందులో యెవరో యొకరిమీద కొంచెము యెక్కువ ప్రేమ యుండకతప్పదు. దక్షిణనాయకుడైన శ్రీకృష్ణునికే యీ పరిస్థితి తప్పలేదు. ఈ ప్రశ్నకు సమాధానము ఆలోచించినప్పుడు నాకు జూడగా వారిలో ప్రబలముగా గోచరించు శక్తి పార్లమెంటరీ ప్రతిభ. ఎదుటివారి వాదమును యెదుర్కొని ఖండించుట, అందుకు తత్క్షణమే సమాధానము యిచ్చుట, మాటకు మాట బదులుచెప్పగలుగుట, బాణమునకు ప్రతిగా బాణము వేయుట ఒక ప్రత్యేకవిద్య. ఈ విద్యలో పంతులుగారు పరమ ప్రవీణులని చెప్పుటకు తార్కాణము లెన్నియైనను చూపించవచ్చును. ప్రతిపక్షము వారిని పల్టీలుగొట్టించుటలో పంతులుగారి నేర్పు అసాధారణమైనది.

కవిత, లత, వనిత యీ మూడు ఆలంబనము లేక శోభించవని ఆర్యోక్తి. కాని పరమలౌకికులైన పంతులుగారు యీ కోవకు చెందినవారు కాదు; వారికి అంగబలము మీద విశ్వాసమున్నట్లు తోచదు. వారికి స్వశక్తిసామర్థ్యాలమీదనే పూర్తి నమ్మకము; ఆ నమ్మకముతోనే వారు ముందడుగు వేసినారు.

వారి మేధాబలము విశిష్టమైనది, బహుముఖమైనది. కావుననే ఇతరుల ప్రతిభా విశేషములు వారి ప్రతిభ ముందు వటవృక్షము క్రింది తరులతాదులవలె శోభాహీనమైనవి.

రామకృష్ణారావు పంతులుగారి కీర్తికాంతకు కొన్ని దశాబ్దాల నుండి విహారస్థలమైన భాగ్యనగరమున ఈ నాడు వారి షష్టిపూర్తి ఉత్సవము వైభ

వోపేతముగా జరుగు చున్నది. ఈ ఉత్సవమును నిర్వహించు ఆ ప్రబృందము సర్వవిధాల అభినందనీయము. పంతులుగారు ఇంకను ఇటువంటి ఉత్సవములు ఇతోధికముగా జేయించుకొందురని ఆశించుచున్నాను. పరిణతమైన వారి ప్రతిభకు అవకాశాలు భవిష్యత్తులో ఇతోధికముగా లభించగలవని పశ్వసించుచు, వారికీ, వారి కుటుంబానికీ శ్రీ కల్యాణ పరంపరలు నిరంతరము కలుగజేయు వలెనని యీ సంతోష సమయమున భగవంతునికి నా ప్రార్థన.



# పంచరత్నాలు

—శ్రీ గిడుగు వేంకట సీతాపతి

శ్రీ బార్గులోత్పన్న వంశాబ్ధిసోమః
శ్రీరామకృష్ణః ప్రబంధ ప్రవీణః,
సారస్వతీ సర్వ సేవాధురీణో
దీర్ఘాయురారోగ్యమాప్నో త్వమోఘమ్. ౧

శ్రీరామకృష్ణ జీవిత శతపత్రే షష్టివర్ష పత్రాణి,
వికచాని యథా రమ్యమ్ శేషాణ్యధిక విభవేన విలసన్తు. ౨

యస్మాత్ శ్రీరామమూర్తే రవన చతురతాత్వాముపేయాయ తూర్ణమ్
యస్మాత్ శ్రీకృష్ణమూర్తే ర్లసిత రసికతా సుస్థితా త్వయ్యభీష్టా,
యస్మాత్ శ్రీరామకృష్ణ ద్విగుణిత విభవో విద్యతే త్వయ్యమోఘః
తస్మాద్యాథార్థ్యమేవం ఖలు తవ లభతే రామకృష్ణాభిధానమ్. ౩

వివిధ మధుర భాషాపాండితీ యస్యవశ్యా
సరసవిబుధ గోష్ఠ్యాం మోహినీ యస్యవాణీ,
విధిహత జనరక్షా యస్య నిర్వ్యాజదీక్షా
జయతు విహితకార్యం రామకృష్ణస్యతస్య. ౪

ఆదౌ ధర్మసభాభియోగ విషయే సద్ధర్మవాదీ భవన్
హైదర్‌బాద్సచివాగ్రణీ రభవ ఇత్యానంద యుక్తావయమ్,
సద్యః కేరళ మండలాధిప పదే సుస్థాపితో దీవ్యసే
సర్వేశోనను సుప్రసన్నవరదో దేయాత్ సదా తే శుభమ్. ౫



# సాహితీ బంధువు

—శ్రీ దాశరథి

పూర్వపు హైదరాబాదు రాష్ట్రంలో తొలి తుది ప్రజాముఖ్యమంత్రి రామకృష్ణరావుగారు. అంతకుముందు వారంతా నైజాంనవాబో, కేంద్ర ప్రభుత్వమో నియమించినవారే. కనుక రామకృష్ణరావుగారి విశిష్టత ఇందులోనూ కనిపిస్తుంది. ముఖ్యంగా అటు రాజకీయాలు, ఇటు సాహిత్యం రెండూ కలగలిసిన మూర్తి ఆయన. "మాకు ప్రథమ ప్రజాముఖ్యమంత్రివీవు" అన్నాను నేను నా 'మహాబోధి' అన్న కావ్యం అంకితం చేస్తూ.

భిన్నభిన్న భాషలవారు నివసించే ఆనాటి హైదరాబాదురాష్ట్రంలో అందరి మన్ననలను పొంది, అందరినీ ఆదరించి, అందరి అభిమానం చూరగొని నిరాటంకంగా ఆంధ్రప్రదేశావతరణం దాకా ముఖ్యమంత్రిగా వుండి అటు రాజకీయాలలోనే గాక, ఇటు సాహిత్యరంగంలోనూ సంపూర్ణ వికాసం జరగడంలో తోడ్పడిన రామకృష్ణరావుగారిని ఇక్కడి ఏ సాహిత్యకుడూ మఱువలేడు. ఆయన అనేక సాహిత్యసంస్థలకు ఆర్థికంగా ప్రభుత్వం సహాయ పడేట్టు చూడడంలో తోడ్పడ్డారు. అసహాయస్థితిలో ఉన్న సాహిత్య సేవకులకు బాసటగా నిలచారు. అన్నివిధాలా సహాయం చేశారు.

బహు కార్యనిమగ్నులై ఊపిరి సలుపనిస్థితిలో ఉన్నప్పుడు కూడా కవులు వెళితే సావధానంగా వారి రచనలను వినడం, వారి సమ్మేళనాలలో పాల్గొనడం, తాము రచించిన రచనలను వినిపించడం. రాత్రుళ్లు సంస్కృత కావ్యాల అధ్యయనం చేయడం — ఇవన్నీ ఎలా చేశేవారో ఆయన!

సాహిత్యం మానవ మనోవికాసానికి అత్యుత్తమ సాధనం. కనుక అధికారంలో ఉన్నవారు సాహిత్యవికాసానికి తోడ్పడితీరాలనే సంకల్పం ఆయనకు ఉండేది కనుకనే ఇక్కడ ఉన్నంతసేపూ అందుకు కృషి చేస్తూనే ఉన్నారు.

నారాయణరెడ్డిగారు నాగార్జునసాగరం రాశారని తెలియగానే తమ అధికార నివాస సౌధంలోని సమావేశమండపంలో పెద్ద విందు జరిపి నగరంలోని సాహిత్యికులనందరినీ పిలిచి వారి ముందు రెడ్డిగారితో కావ్యగానం జరిపించారు. రామకృష్ణరావుగారికి యువక కవులపైన ఎంత ఆదరమో చూడండి. బుద్ధసంగీతి సందర్భంగా నేను రాసిన 'మహాబోధి'ని దయతో

అంకితం పొంది నాకు ఎనలేని గౌరవం కలిగించారు. శ్రీ వానమామలై వరదాచార్యులుగారు అనారోగ్యస్థితిలో ఉండగా వారికి ఆర్థికంగా ప్రభుత్వం ద్వారా తోడ్పాటు లభించడానికి రామకృష్ణరావుగారి దయాగుణమే కారణం. ఆంధ్ర సారస్వత పరిషత్తు, తెలంగాణా రచయితల సంఘం మున్నగు అనేక సంస్థలకు ప్రభుత్వ విరాళాలు ఘనంగా లభించడానికీ, ఆ సంస్థలు బృహత్ కార్యక్రమాలను నిర్వహించడానికీ రామకృష్ణరావుగారి తోడ్పాటే కారణం.

రామకృష్ణరావుగారికి బహుభాషా పరిజ్ఞానం ఉండడం, ఆయనను బహుభాషాసంగమమైన హైదరాబాదు రాష్ట్రానికి ఏకైక నిర్వివాద ప్రతినిధిగా రూపొందించింది. ఫారసీ, ఉరుదూ, ఇంగ్లీషు, సంస్కృతం, మహారాష్ట్రం, కన్నడం, తెలుగు, హిందీ, మున్నగు భాషా సాహిత్యాలతో పరిచయం ఉండడంవల్ల ఈ భాష లన్నిటి తీరుతెన్నులనూ క్షుణ్ణంగా ఎరిగి ఉండడంవల్ల ఆయనతో ఒక గంట సల్లాపిస్తే బహుభాషలలోని విషయాలు కొద్దో గొప్పో సులభంగా పరిచయం అవుతాయి. ఏవిషయాన్ని అయినా ఇట్టే ఆకళించుకోగల ఝటితిస్ఫూర్తి ఉండడంవల్ల ఎంత కొత్తభాష అయినా ఇట్టే ఆ భాషా విశిష్టతను పట్టేస్తారు.

వారు కేరళలో ఉండి రెండుమూడు ఏళ్ళే అయినా ఆయన మలయాళ సాహిత్యాన్ని గూర్చి తెలుసుకోవడమేగాక ఆ భాషలోకూడ అప్పుడే అభినివేశం సంపాదించగలగడం అందరినీ ఆశ్చర్యపరుస్తుంది.

సాహిత్య రంగంలో ఒకనాడు వెనుకబడిఉన్న తెలంగాణం పుంజుకోడంలో తోడ్పడ్డవారిలో ముఖ్యులు శ్రీ రామకృష్ణరావుగారు. వారి కిదే నా నీరాజనం.



# డాక్టరు బూర్గుల రామకృష్ణరావుగారు

—శ్రీ ఆదిరాజు వీరభద్రరావు

ప్రపంచములో ఘనతకు వచ్చినవారు మూడు విధములుగా నుందురు. మొదటివారు తమ వంశ ప్రతిష్ఠలను తెలుపుకొనుచు కీర్తిమంతులగుదురు. రెండవవారు తమ వంశ ప్రతిష్ఠలను నిలుపుకొనుటయే గాక తమ ప్రజ్ఞావిశేషములచే ఉన్నట్టి కీర్తిప్రతిష్ఠలను మరింత ప్రకాశము గావించువారు. మూడవవారు వంశప్రతిష్ఠలు ఏమియు పూర్వరంగమున లేకున్నను తమ స్వయంప్రతిభా విశేషముల చేతను, విద్యా పాండిత్యముల చేతను, గుణ గ్రహణ పారీణత చేతను కీర్తి శిఖరాగ్రము నందుకొన్నవారు. ఈ మూడువిధములైన ఘనులలో ఏ యొక్కరితోనైనను డాక్టరు బూర్గుల రామకృష్ణరావుగారి జీవిత విధానమును పోల్చి చూచినచో సరియైన ప్రత్యుత్తరము దొరకదు. ఒకానొక పరిధిలో నిర్వచనము చేయుటకు శ్రీ రామకృష్ణరావుగారి జీవిత మతీతమైనట్టిది.

డాక్టరు రామకృష్ణరావుగారి పితృ పితామహులు విద్వాంసులే. రాజకీయోద్యోగములలో పేరుపొందినవారే. తమ వంశమునకు కీర్తిప్రతిష్ఠలు తెచ్చినవారే. అయినను, దేశ, కాల, రాజకీయ మార్పులవలన శ్రీవారికి తమ పూర్వుల పేరుప్రతిష్ఠలు ఎంతమాత్రము తోడ్పడలేదు. కావున మొదటితరగతి వారగు ఘనుల పట్టికలో వీరు చేరుటకు వీలులేదు.

రెండవ తరగతి వారిలో వంశగౌరవమును నిలుపుకొనుటయే ప్రధాన కర్తవ్యముగా నుండును. కాని కర్తవ్య నిర్వహణమున పూర్వకాలపు ఆదర్శములు వేరుగా నుండును. తండ్రి తాతలు తహశ్శీలుదారులుగా నుండినచో తామకూడ తహశ్శీలుదారుగా నుండినచో ఆ వంశప్రతిష్ఠను నిలిపినట్లుగా భావించెదరు. కాని రామకృష్ణరావుగారికి శీఘ్రముగా గొప్ప పదవులు లభించనులేదు. వారట్టిపదవులను వాంఛించనులేదు. విద్యారంగమును వీడినంతనే వారు చేపట్టినది ప్రజాసేవారంగము. వరించినది కంటక పరివృతమైన రాజమార్గము. ఇది నవీనాదర్శముల కనుగుణముగా నుండినను పూర్వులు త్రొక్కని త్రోవ. కావున రెండవతరగతి వారగు ఘనుల పట్టికలో శ్రీవారు చేరుటకు వీలులేదు.

ఇక మూడవతరగతి వారిలో వారి వంశ పూర్వచరిత్ర మృగ్యముగా నుండుట. కాని యది యట్టిదికాదు. కస్తూరిని బరిణలో దాచిపెట్టునట్లుగా నది

యుపకరించలేదు. అంతే! అందుచే శ్రీ రావుగారు మూడవతరగతి ఘనుల పట్టికలోను చేరుటకు వీలులేదు. సారాంశమేమనగా ఈ త్రివిధాత్మక ఘనులకు ఏకైక ప్రతినిధిగా శ్రీ రామకృష్ణరావుగారు వంశప్రతిష్ఠను ఆధారము చేసుకొని, వంశ గౌరవమును కాపాడి, స్వయంప్రతిభా విశేషముల చేతను, విద్యా పాండిత్యముల చేతను, గుణ గ్రహణ పారీణత చేతను కీర్తి శిఖరాగ్రము నధివసించినారనుటయే మా యాశయము.

శ్రీ రామకృష్ణరావుగారి యింటిపేరు పుల్లమరాజువారు. నివాసము బూర్గుల గ్రామము. వీరు పునహా, బొంబాయి విద్యాలయములలో విద్యాభ్యాసము గఱచిన వారగుటచే, అచ్చటి మహారాష్ట్రీయుల సంప్రదాయము ననుసరించి గ్రామనామమే గృహ నామ ము గా వరించినారు. బూర్గుల రామకృష్ణరావని ప్రసిద్ధి కెక్కినారు.

శ్రీవారు అత్యున్నత విద్యాగౌరవములనుబొంది హైద్రాబాదు విచ్చేసినప్పుడు, తెలంగాణ ప్రజలు అత్యంతవిదారకమైన పరిస్థితిలో నుండిరి. ప్రజలలో విద్యలేదు. ధైర్యము సున్న, అభివృద్ధి మందునకయిన గానరాకుండెను. ప్రజాహితజీవన మనునది యెరుగనిమాట. ఇట్టి విపరీత పరిస్థితిని గమనించి ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంతరావుగారు కటకటపడి నిద్రాణమై యున్న తెలంగాణ ప్రజలను మేలుకొలుప పరిశ్రమించుచుండిరి. నూతన భావవిరాజితులైన శ్రీ రామకృష్ణరావుగారు రంగమునందు దూకి శ్రీ హనుమంతరావుగారికి నండగా నిలుచుండిరి. ఆంధ్రోద్యమ పరివ్యాప్తికై యంగలు చాచుచున్న హనుమంతరావుగారికి విద్వాంసుడు, రాజనీతివిశారదుడు, మహావక్త, ప్రజ్ఞావంతుడు, పరోపకారశీలి, ప్రతిభాశీలి నిరుపమాన తేజశ్శాలియగు శ్రీ రామకృష్ణరావుగారి సాహచర్యము అత్యంత ముదావహము గొల్పెను.

ఆంధ్ర పితామహులు ప్రారంభించిన ఆంధ్రోద్యమ క్రియాకలాపరంగము లందు శ్రీ బూర్గుల రావుగారు వహించిన ప్రశంసనీయ పాత్రను ఇతర కార్యకలాపములను నభివర్ణించుటయే యీ వ్యాసము యొక్క యుద్దేశము. ఆ యుద్దేశము ననుసరించి మాకు తెలిసినది అల్పమైనను, తెలిసినంతవరకు ఈ శుభసమయమున విశదీకరించదలచుకొన్నాము.

కట్టుదిట్టములతో ఆంధ్రోద్యమము ప్రారంభించుటకు ఆంధ్ర జనసంఘ స్థాపనము 12-11-1921 నాడు జరిగినది. ఆ సంఘస్థాపనకు ముఖ్యకారణము వివేకవర్ధనీ థియేటరులో ఆంధ్రులుపొందిన పరాభవము, ఒక్క యాంధ్రునకు

జరిగిన పరాభవమునకు కినిసి ఆ రాత్రి ఆ మహాసభనుండి లేచిపోయిన పంౘెండు గురు ఆంధ్రమహాశయులలో శ్రీ రామకృష్ణరావుగా రొక్కరు. ఈ విధముగా శ్రీ రావుగారు ఆంధ్రమహాసభా విధాయకులలో నొక్కరుగా వన్నె కెక్కిరి. 1930 నుండి ప్రారంభమయిన ఆంధ్ర మహాసభలు 13 సమావేశమయి ఆంధ్ర మహాసభ సమావేశములు విరమించువరకు వీరు కర్ణధారులుగ, రూపకల్ప కులుగా, ఆలోచనా తత్పరులుగా, రాయబారులుగా పరిశ్రమించి యున్నారు.

రెండవ ఆంధ్రమహాసభ దేవరకొండలో 3, 4, 5 మార్చి 1931 లో సమావేశమయ్యెను. ఆ మహాసభకు శ్రీ రామకృష్ణరావుగారు అధ్యక్షులుగా వరింపబడిరి. శ్రీవారి అధ్యక్షోపన్యాసము వివిధ సమస్యా విచారణభూషిత మయి ప్రబోధాత్మకముగా నుండెను. విషయనిర్ణాయక సభయందును, మహాసభా తీర్మాన చర్చయందును శ్రీవారి వాణి పరిష్కారయుతమై వాసికెక్కెను. దేవరకొండ మహాసభా సమావేశమునకు సపరివారముగా హైదరాబాదునుండి బయలుదేరినప్పుడు త్రోవపొడుగునను ప్రజలు తమ అధ్యక్షుని ఎంతయో సన్మానించిరి. శ్రీవారు ప్రశంసావాక్యములు పలుకుచు గ్రామీణులకు నెంతయో ప్రబోధము గావించిరి.

మూడవ మహాసభ ఖమ్మముమెట్టులో జరుగవలసి యుండెను. కాని నిజాం ప్రభుత్వమువారు పెక్కు ప్రతిబంధకములు కల్పించి ఆంధ్రనాయకుల మనస్సులను నొప్పించిరి. అయితే ఆంధ్ర పితామహులు నిరుత్సాహపడువారు కారు. అట్లే ఆంధ్ర మహాసభాధ్యక్షులయిన శ్రీ రామకృష్ణరావుగారు నిరుత్సాహపడక అవిశ్రాంతముగ కృషి సలిపిరి. మూడవ మహాసభ జరుపుటకు అనుజ్ఞను సంపాదించుటలో వీరు పెక్కుమార్లు ప్రభుత్వమువారిని దర్శించ వలసి వచ్చుచుండెను. శ్రీ రామకృష్ణరావుగారు, శ్రీ హనుమంతరావుగారు, అప్పుడు పోలీసుశాఖా మంత్రులుగా నుండిన కల్నల్ ట్రెంచిగారిని 13-3-1934 నాడు సందర్శించిరి. ఆంధ్రజన కేంద్రసంఘపక్షమున శ్రీ రామకృష్ణరావుగారు మంత్రిగారితో వాదించిరి. వారి సంభాషణము ముచ్చటగా నుండెను ఆ సంభాషణమును చరిత్రకారుడు ఇట్లు లిఖితము చేసియున్నాడు :

"బూ-రా : మా యుద్యమము కేవలము రాజకీయేతరము. విశేషముగ గ్రంథాలయముల మూలమున విజ్ఞానము వ్యాపింపజేయునది.

మంత్రి: అయ్యా! గ్రంథాలయోద్యమమనగా నేమో నేను బంగాళాదేశము నుంచి అనుభవము సంపాదించితిని. గ్రంథాలయములనగా విప్లవ సంఘములు. అంతే! మరేమియులేదు.

జమానతు దాఖలుచేయుట కేల ఆక్షేపణ? అంతమాత్రము ద్రవ్యము మీరు చెల్లించజాలరా? చెల్లించినచో అది తుదకు ప్రభుత్వము వారు లాగుకొనెదరనుకొనుచున్నారా?

బూ-రా: రాజ్యములోని సగము భాగమునకు ప్రాతినిధ్యమువహించు మేము ఈ మాత్రపు ధనము చెల్లించజాలమనికాదు. దీనిని సర్కారువారు ఎట్లయినను లాగుకొనెదరనియుకాదు. జమానతు ఇచ్చి మహాసభ నిర్వహించుచున్న విద్యా, వైజ్ఞానిక, సామాజికసేవను గురించి దేశీయుల హృదయమునందుగల గౌరవభావమును ఇట్టిపరతు నిర్మూలించగలదని మాకు భయము కలదు. కనుక మేము ఒప్పుకొనము.

మంత్రి: మంచిది. సెలవిత్తుము. ముందైన బుద్ధిగల పిల్లలవలె వర్తింపుడు."

పాపము! ఆ కల్నల్ ట్రెంచిగారు తన యెదుట నున్నది బుద్ధిమంతులకు బుద్ధిగఱపే ప్రతిభాశాలి యని గ్రహింపజాలకపోయెను! ఆ కాలములో ఇంగ్లీషువారు తాము ఆకాశమునుండి యూడిపడినట్టులుగా తలంచుచుండిరి కదా!

ఆంధ్ర మహాసభా సమావేశముల విషయములో ఎప్పుడును ఘర్షణలు తప్ప వయ్యెను. శాంతగుణ భూషణులగు శ్రీ హనుమంతరావుగారేమి, శ్రీ రామకృష్ణరావుగారేమి కార్యశూరులు. కార్యసాధనయందు పట్టు విడుపులు కలవారు. ఆ గుణవిశేషముననే మహత్తరమయిన ఆంధ్రోద్యమము నవ్యమార్గముల నడపింపగలిగిరి.

ఖమ్మముమెట్టు మహాసభాసమావేశమునకు ఎట్లో అనుజ్ఞను సంపాదింపగలిగిరి. కాని సర్కారువారు కుటిలరాజనీతి అవలంబించిరి. సభకనుజ్ఞ యిచ్చి నట్లుండవలెను. సభను జరుగకుండ చేయవలయును అనుట సర్కారువారి సంకల్పము. ఈసంబంధమున వరంగల్ జిల్లా అవ్వల్ తాలూకుదారు (కలెక్టరు) గారు ఎన్నో చిక్కులు కల్పించిరి. అంతేగాదు. భేదోపాయమును ప్రయోగించి ఖమ్మముమెట్టు వకీళ్ళను ఉసిగొల్పిరి. ఈ వకీళ్ళు సనాతనధర్మపరాయణులట! వీరు పెద్ద మహజరును తయారుచేసి, సభనాపుచేయవలసినదిగా కలెక్టరుగారికి సమర్పించిరి. ఇది సాకుగా బెట్టుకొని గడియగడియకు కార్యకర్తలను బిలుపించు



కొని కొన్ని నిషేధాజ్ఞలను కలెక్టరుగారు ప్రసాదించసాగిరి. ఈ యధికారితో రాయబారములు నలుపుటకు, వాదించుటకు శ్రీ రామకృష్ణరావుగారు పూను కొనిరి. అప్పట్టున శ్రీ రావుగారు ప్రదర్శించిన సహనశీలము, కార్యచతురత, సమయోచితబుద్ధి గణనీయాంశములు. ఆత్మగౌరవమునకుగాని, సభాగౌరవము నకుగాని భంగము రాకుండ మహాసభానిర్వహణమే పరమకర్తవ్యముగా భావించి కృతకృత్యులయిరి. "అలవి కానిచోట నధికులమన రాదు-కొంచెముండు టెల్ల కొదువగాదు" అను సూక్తిప్రకారము ఖడ్గవాదులుగాక కార్యవాదమునే ప్రధానముగా భావించి సమాధానపూర్వకముగా ప్రవర్తించిరి.

తరువాత సమావేశమయిన ఆంధ్రమహాసభ పరంపరలో ప్రముఖపాత్రను వహించి కృషిసలిపిరి. ఆలోచనాశక్తి, రచనాశక్తి, విషయగ్రహణశక్తి క్లిష్ట సమస్యాపరిష్కారశక్తి శ్రీ రావుగారియందు పుష్కలముగానుంటచే ఆ శక్తులు ఆంధ్రమహాసభ కెంతయో ఉపకరించెను. నియమావళీ నిర్మాణము, మహాసభ సూత్రనిర్ణయము, నిర్బంధ ప్రాథమిక విద్యావిధానము, ఆంధ్రనిధి సేకరణము మున్నగు వివిధకార్యకలాపములకు సంబంధించిన ఉపసంఘములందు సభ్యులై, మార్గదర్శకులయి రాజ్యాంగ సూత్ర వేదిత్వమున తమకుగల అపార వైదుష్య మును, రాజనీతి చతురతను ప్రదర్శించి అందరను ముగ్ధుల గావించిరి.

డాక్టరు రామకృష్ణరావుగారు బహుముఖ ప్రజ్ఞా ధురీణులు. అందుచే శ్రీవారు చేపట్టని యుద్యమము నిజాం రాష్ట్రమున లేకుండెను. ముఖ్యముగా శ్రీ రామకృష్ణరావుగారి నాకర్షించినది రాజకీయోద్యమము. అయితే యీ రాజకీయ విషయములందు పౌరులు ప్రజ్ఞావంతులగుట యవసరముగదా! ప్రజల కాయా విషయ పరిచయము కలిగించుటకై 1939 లో శిక్షణ తర గతులు ఏర్పాటుచేయబడెను. రాజకీయ, ఆర్థిక, వైజ్ఞానిక విషయములు, రైతు సమస్యలు, కార్మిక విషయములు - ఇత్యాదులు బోధక విషయములుగా నుండెను. ఈ తరగతులకు పదునేడుగురు విచ్చేసియుండిరి. శ్రీ రామకృష్ణా రావుగారు ఉపన్యాసకులై ఆచార్యపీఠము నధిష్ఠించిరి.

నిజాం రాష్ట్రము రాజకీయ సభా సమావేశమునకు అనుకూలముగాని దగుటచే శ్రీ రామకృష్ణరావుగారు ఎత్తుకు పైయెత్తువేసి, అకోలా పట్టణము హైదరాబాదు రాజకీయ మహాసభా రంగముగా నొనర్చిరి. ఈ రాజకీయ మహా సభకు ప్రధాన కార్యదర్శిగా రావుగారు ఎన్నుకొనబడిరి. (1931) అకోలా పట్టణము బెరారు రాష్ట్రములో నుండుటచేతను, ఆ రాష్ట్రము బ్రిటిషువారి

స్వాధీనములో నుండుటచేతను నిజాం ప్రభువుగారి యాజ్ఞల కచ్చట చలామణి లేకుండెను. మరియు బెరారు ప్రాంతము తమకు రావలయునని, నిజాం ప్రభువు వారు వాదించుచుండుటచే నది నిజాం రాష్ట్రములోని భాగములోనిదే యని రావుగారి వాదము గనుక అకోలా పట్టణములో జరిగే సభ నిజాము రాష్ట్రములో జరిగినట్లేయని యర్థము. బాధ్యతాయుత ప్రభుత్వ మొసంగినచో బెరారు ప్రాంతము నిజామునకు దత్తము చేయవచ్చునని రామకృష్ణరావుగారి తర్కము.

నిజాము ప్రభువుగారు కాలము యొక్క మార్పును గమనించి, నిరంకుశ పరిపాలనా విధానము మానివేసినామని ప్రపంచమునకు చాటుటకుగాను "రాజ్యాంగ నిర్మాణార్థము ఒక కమిటీ"ని నిర్మించిరి (1937). దీనికి శ్రీమాన్ అరవమధుఅయ్యంగారు అధ్యక్షులు. కావున దీనిని అయ్యంగారు కమిటీ యందురు. ఇది ప్రపంచపు కండ్లలో దుమ్ముకొట్టి, పౌరుల కెట్టి యధికారములు, బాధ్యతలు లేకుండ నేతిబీరకాయవతుగా తయారు అగునని ప్రజానాయకులు శంకించిరి. అందుచే ఆ రాజ్యాంగసూత్ర ధర్మములు ఎట్లుండవలెనో, ప్రజల స్వేచ్ఛాస్వాతంత్ర్య సంపాదనకెట్టి విధాన మవసరమో నిర్ణయించుటకు హైదరాబాదు ప్రజాపరిషత్తును (Hyderabad Peoples Convention) స్థాపించిరి. ఈ కథావిధానమునకు ప్రపంచరాజ్యాంగముల సమాలోచనము, రాజకీయ, ఆర్థిక, న్యాయ, నైతిక, సైనికాది సకల విషయము లందు పరిజ్ఞానము, దూరదృష్టి కావలసియుండును. ఈ రాజ్యాంగ రచన మున్నగు కార్య నిర్వహణమునకై శ్రీ రామకృష్ణరావుగారిని ప్రధాన కార్యదర్శిగా ప్రజాపక్ష పరిషత్తువా రెన్నుకొనిరి. ఆ పరిషత్తులో మహారాష్ట్రులు, కన్నడులు, ముస్లిము లెందరో యున్నను, వారందరు హేమాహేమీలుగా నున్నను, పరిషత్తువారు శ్రీ రామకృష్ణరావుగారిని కార్యదర్శిగా నెన్నుకొనుటలో అత్యంతవివేచన చూపిరని చెప్పకతప్పదు. కార్యదర్శిగారగు రామకృష్ణరావుగారు ఆ కార్యమును జయప్రదముగ నిర్వహించిరి. అదియొక ఉద్గ్రంథము. "ఆ సంబంధమైన గౌరవమును పొందుటకు యథార్థముగ వారే యర్హులు." అని ఆ సమితి యధ్యక్షులుగా నుండిన ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంతరావు పంతులుగారు వచించియున్నారు.

రాజకీయాది విషయములను చర్చించుటకు ఏకైక వేదిక నిర్మించుటకై హైదరాబాదు పౌరులు "స్టేటు కాంగ్రెసు" ను స్థాపించ సంకల్పించి కొంత

కార్యకలాపము జరిపిరి. ప్రభుత్వమువారికి ప్రజలు మేల్కొనుట సుతరాము గిట్టదు గనుక ఆ కాంగ్రెసును అది పూర్ణస్వరూపము తాల్చకముందే మతపాక్షికసభయని నిషేధించిరి. మతపాక్షికసంస్థయట ! ప్రజలు గత్యంతరము లేక "సత్యాగ్రహము"నకు బూనిరి. అట్టి సత్యాగ్రహులలో నొక్కరయి శ్రీ రామకృష్ణరావుగారు శ్రీకృష్ణ జన్మస్థాన సందర్శన గౌరవమును సంపాదించుకొనిరి.

కర్తవ్యవిచారణముచేయు ప్రతి కమిటీయందు రామకృష్ణరావుగారుండుచుండిరి. హైదరాబాదువారికి రామకృష్ణరావుగారి శేముషీ విభవమునందట్టి గాఢాభిప్రాయముండెను. స్టేటు కాంగ్రెసు నిషేధానంతరము ఢిల్లీకి ఒక రాయబార మంపబడినది. ఆ రాయబారసంఘములో ఆంధ్రుల పక్షమున శ్రీ రామకృష్ణరావుగారు ఏకైక ప్రతినిధిగానుండిరి.

డాక్టరు రామకృష్ణరావుగారి ప్రజ్ఞా పాండితీవిభవములు ప్రజల కంగరక్షగానుండగా ప్రభుత్వము వారికి నవి కొరుకరాని కొయ్యలయ్యెను. ప్రత్యర్థిని లోబరచుకొనుటకు ప్రభుత్వమువారి యంబులపొదిలో సమ్మోహనాస్త్ర మొకటి యున్నది గదా ! ఆ సమ్మోహనాస్త్రమును డాక్టరు రామకృష్ణరావుగారియెడ ప్రయోగించ సంకల్పించిరి. రామకృష్ణరావుగారికి హైకోర్టు జడ్జిపదవి యిత్తుమనియు, మంత్రిపదవి యిత్తుమనియు ఆశపెట్టి వశపరచుకొన జూచిరి. కాని ప్రజాసేవాతత్పరులగు రామకృష్ణరావుగారు ఇతరులవలె ఆ మాయాజాలములో పడక, అన్ని విధములయిన సర్కారువారి ప్రార్థనలను నిరాకరించిరి. ఇట్టి సాహసము ఇట్టి నిస్స్వార్థపర్వము, ఇట్టి దూరదృష్టి ప్రకటించిన శ్రీ రామకృష్ణరావుగా రెంతయు నభినందనపాత్రులు.

పరమేశ్వరుని పరమానుగ్రహమున హైద్రాబాదులో నిరంకుశ పరిపాలనము నశించి పౌరులు స్వేచ్ఛావాయువులు పీల్చిన తరుణమున డాక్టరు రామకృష్ణరావుగారే అధికారగౌరవపరంపరకు వరింపబడిరి. 1948 పోలీసుచర్య తరువాత మంత్రిగా, ముఖ్యమంత్రిగా రాజ్యచక్రమును పాలించసాగిరి. శ్రీ రావుగారి మంత్రిపదవీ కాలములో ప్రజాసౌభాగ్యముకొరకెన్నియో సత్సంకల్పములు చేయబడెను. శాసనసభారంగములో ప్రతివాదిభయంకరులుగా వాదనాపటిమను జూపిరి. శాంతముతో, సహనముతో ప్రజాసంక్షేమ కార్యకలాపములు నెరపిరి. విష్ణుమూర్తి పంచమావతారమునందువలె అల్పకార్యారంభములతో విజృంభించి జగద్వ్యాప్తముగ డాక్టరు రామకృష్ణరావుగారు

తమ ప్రతిభను ప్రదర్శించిరి. జగద్వంద్యులయి నెగడినారు. కేరళ రాజ్యపాలకులుగా వరింపబడినారు. హైద్రాబాదు సంస్కృతీ సంఘములవారు కృతజ్ఞతాపూర్వకముగా డాక్టరు రామకృష్ణరావుగారి షష్టిపూర్త్యుత్సవమును నేడు సలుపుచున్నారు. శ్రీ రామకృష్ణరావుగారు లక్ష్మీకటాక్షవీక్షణములనంతముగా గలిగి విరాజిల్లుచున్నారు. స్వయం ప్రతిభావిశేషములచేతను, అష్టభాషా విశారదత్వముచేతను, కార్యశూరతచేతను, యోగ్యప్రవర్తనచేతను పుల్లమరాజువంశమునకు మకుటాభరణముగా వెలుగొందుచున్నారు. ఆంధ్రజాతి గౌరవమునకు వన్నెతెచ్చినారు. మాదన్న మంత్రిని మరపించినారు. ప్రాచీనాంధ్రవైభవమును సముద్ధరించుటకు వివిధరంగములందు ప్రకాశమానముగా పరిశ్రమించుచున్నారు. పరిశ్రమించగలరు.

డాక్టరు బూర్గుల రామకృష్ణరావుగారి మూర్తి చిన్నది. కీర్తి గొప్పది.



# రామకృష్ణప్రశంస

—శ్రీ వానమామలై వరదాచార్యులు

కవితావధూటి నాకాంక్షించువేళల
        కవి రామకృష్ణుడై కానిపించు
సంక్షేమ రాజ్య సంస్థాపనాకుశలతన్
        శ్రీరామకృష్ణులస్థితి వహించు
వేదాంతకాంతాప్రసాదాప్తి వంగియ
        రామకృష్ణుండయి రహిజరించు
వివిధభాషాజ్ఞాన విభవాప్తిభండార
        కరరామకృష్ణుడై ఘనతమించు
అవనిఁ బ్రజ రామకృష్ణయం చనవరతము
వినుతి నొనరించు నిహ పర విభవమబ్బ
యలర గలరంచు రామకృష్ణాఖ్య నిన్ను
పిలిచినారలో యేమొ నీ పితరు లనఘ !

గాఢాంధకార సంక్రాంతకకుప్ప్రాంత
        దేదీప్యమానార్క దీప్తియనగ
క్షామకరాళదంష్ట్రానిపీడితసస్య
        భూజీవనదతటిత్పుంజ మనగ
ఘనవీవధ నిరోధక క్ష్మాధరశిరో వి
        నిర్దళద్వజ్రకాంతిచ్ఛటయన
బర్హి ర్వదన హవిర్భాగప్రదాయక
        శ్రీల సద్యజ్ఞాగ్ని శిఖయనంగ
వర చకోరకముఖ కైరవప్రమోద
కారక హిమాంశుబింబ ప్రకాశ మనగ
భరతభువి నీ యశఃకాంత పరిఢవిల్లె
బూరుగుల రామకృష్ణ సత్పుణ్య తృష్ణ !

కర్ణాటరూపాన కస్తూరి వెదజల్లి
మధురమరాఠియై మరులు గొల్పి
అరభీముఖమ్మంటు పరదానుతొలగించి
పార్సిరూపున మధుపాత్ర నొసగి
ఆంగ్లయై యేలుమం చధికారము నొసంగి
ఉరుదయి తొల్తి కాపుర మొనర్చి
సంస్కృతరూపాన శారదాకృతిజూపి
తెనుగయి వాతెర తేనెగురిసి
సకల ముఖముల సరసవాక్సరణి నెఱపి
నీదు తలవాకిటన్వాణి నృత్యమాడి
యితఁడు చతురాననుండని యెరుకపరచె
బూరుగుల రామకృష్ణ విబుధవరేణ్య!

సుకవులకుం గవీంద్రుడవు సువ్రతులౌ ఘన రాజకీయ నా
యకులకు నాయకాగ్రణివి యాత్మికతత్వ రహస్యవేత్తలం
దొకడగు తత్వవేత్త విలనొప్పు విమర్శకులందు సద్విమ
ర్శకుడవు ప్రాడ్వివాకకులరత్నమ వేమనజెల్లు నీ మతిన్.

చనియె శరత్తు లర్వది వసంతసుఖాంతములై త్వదీయ జీ
వనవనమందునెందు విభవప్రభవప్రథితాఖ్య లొప్పగన్
మనుజ శతాయురాప్తి నిరుమాఱులు నల్వదెవచ్చునందు ద
క్కనవియొ రామకృష్ణులనె కూడిరుతేపలటంచుగాంచనౌ.

మును పరతంత్రతత స్సచిత ముఖ్యులమయ్యును తానషానృపా
లునికడ పూర్ణసమ్మదవిలోపతనుంటి మటంచు నిప్పుడో
యనఘ తెనుంగునేల నిటు లక్కనమాదన లిర్వురేకమై
జననము నొంది రాజ్యరమఁ జక్క నొనర్చిరి నీ స్వరూపతన్.



పుట్టెద రెందరో ధరణి బుట్టినవారిని సత్పథమ్ములం
బెట్టెడి నేత యీతడన పేరువహించి స్వజాతినెల్ల మే
నెట్టి పథాలనేగునటు లేగెడి నీడనొనర్చి తీరముం
ముట్టగజేయు త్వాదృశుఁడు పుట్టుట లెట్టి తపోవిశేషమో.

గవి తన పొట్టనింప నిడగాగల దెయ్యెడ క్షీరధారలం
గవియును బొట్టనింప నిడగాగలడచ్ఛకవిత్వ ధార లి
భ్భువినన రామకృష్ణులును బూరుగులాన్వయ రామకృష్ణులుం
సువిదితముం బొనర్చిరన సూరిజనాలికొసంగవే భృతుల్.

కవియగువానికే కవుల కష్టము లర్థములౌను వారి గౌ
రవమన నెట్టిదో తెలియు రాజ్యరమాపతి సత్కవీంద్రుడై
యవతరణమ్ము నొంద గవితాంగన భాగ్యముపండు మెండు ని
బ్భువినని కృష్ణరాయలిటు బుట్టెనొ బూర్గుల రామకృష్ణుడై.

పదవులమించి వీరి ప్రతిభాగతి భాసిలుచుండె వామనుం
డెదిగి త్రివిక్రమాకృతి వహించెననం బ్రజలోనొకండడై
మొదట నమాత్యుడై సచివముఖ్యపదస్థ యుగంధరుండు గా
గ దనరి కేరళావనికి గౌర్నరునై మును విక్రమించుచుం.

సరసుడు సత్యవర్తనుడు సత్కులజాతుడు రాజకీయ సం
గర గురుధాత్రినోటమిని గాంచుట లెట్టిదొ స్వప్నమందు నె
ప్డెరుగని వీరవిక్రము డహీన మహాంధ్ర సువర్ణహర్మ్య గో
పురవరశిల్పి జౌహరుని బుద్ధికి మెప్పగునేత యీతడో.

ఆంధ్రలోకపు పూర్వపుణ్యములపంట
మంత్రి మాణిక్య చాణక్య మహితుడంట
అతని కరువది వర్షమ్ము లరిగెనంట
మాకు నరపదియేడులె మదికిదోచు.

# శ్రీ బూర్గుల రామకృష్ణరావుగారి ప్రజాసేవ

—శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనం

తెలంగాణమును నిరంకుశ పరిపాలనా దృఢపంజరమునుండి విడిపించి స్వేచ్ఛావాయువులను పీల్చుటకు అనువు కల్పించిన ప్రజా సేవాపరాయణులలో మాన్యశ్రీ బూర్గుల రామకృష్ణరావుగారు ప్రముఖులనుట సర్వజన విదితము. ఈ నాయకవర్గమును తెలంగాణము పాలిటి పాండవ పంచకమని భావించినచో దానియందు తప్పక చేర్చవలసినవారు ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంత రావుగారు, శ్రీ కొండా వెంకట రంగారెడ్డిగారు, శ్రీ బూర్గుల రామకృష్ణా రావుగారు, శ్రీ మందుముల నరసింగరావుగారు, స్వర్గీయ సురవరం ప్రతాప రెడ్డిగారు. ఇది సామాన్య పరిగణన మాత్రమే. తెలంగాణా విమోచనమునకును, అభ్యుదయమునకును పోరాడిన అసంఖ్యాక వీరవరులను పేరుపేరున చెప్ప గలమా? శ్రీ రావి నారాయణ రెడ్డిగారు, స్వర్గీయులు జమలాపురం కేశవరావు వంటివారు ఎందరో త్యాగధనులు. ఎటు గుణించినను గణించినను ఈ నాయక బృందములో మాన్యశ్రీ బూర్గుల రామకృష్ణరావుగారు పాండవ మధ్యము డనుట తథ్యము. శ్రీవారు రాజకీయ రంగమునందును, విద్యా సాంస్కృతిక రంగమందును గూడ వన్నెకెక్కినవారై సవ్యసాచి బిరుదమునకు చక్కని లక్ష్యమగుచున్నారు.

రామకృష్ణరావుగారి పూర్వీకులు పలువురు పాండిత్యము చేతను, రాజకీయ ధురంధరత్వముచేతను, విభూషితులైనట్లు తెలియవచ్చుచున్నది. వీరి ముత్తాతగారగు నరసింగరావుగారు గత శతాబ్దమునందలివారు. అప్పటి కాలములో నిజాముగారివద్ద ప్రసిద్ధ సచివుడుగా నుండిన రాజా చందూలాల్ బంధువర్గములోని రాజా రాంబఖ్షు అనువారివద్ద పుల్లమరాజు నరసింగరావు గారు ముఖ్యగణకుడుగా నుండి మన్ననలు పడసెనట. ఆ కాలములో పారసీభాష రాజభాషగా నుండుటచే నరసింగరావుగారు పారసీభాష యందును, గృహ సంస్కృతికి పట్టుగొమ్మలైన సంస్కృతాంధ్రము లందును చక్కని వైదుష్యము గలవారై యుండిరి. రామకృష్ణారావుగారి తాత వెంకటేశ్వరరావుగారును, తండ్రి నరసింగరావుగారును కూడ ఉభయ భాషాప్రవీణులై యుండిరి. రామకృష్ణరావుగారు నియోగి బ్రాహ్మణులు. వీరిది కౌండిన్యసగోత్రము.

వీరి యింటిపేరు పుల్లమరాజువారు. ఇటీవలనే వీరి గ్రామనామమైన 'బూర్గుల' వీరి యింటిపేరైనట్లు తెలియవచ్చుచున్నది. రామకృష్ణరావుగారు పూనా నగరమునందు విద్యాభ్యాసము చేయుచున్నప్పుడీ మార్పు కలిగినట్లు తోచును. మహారాష్ట్రులు తమ గ్రామనామము పేర వ్యవహరింప బడుచుందురు. ఆ యాచారము మేరకు, వీరును, ఆర్. ఆర్., బూర్గుల యని వ్రాసుకొనిరట. క్రమముగా నది బూర్గుల యింటిపేరయినది.

రామకృష్ణరావుగారు విళంబి సంవత్సర ఫాల్గుణశుద్ధ విదియనాడు (అనగా మార్చి 13, 1899 సం) కల్వకుర్తి తాలూకా పడకల్లు గ్రామములో తమ మాతామహులైన వెల్దండ శేషరావుగారింట జన్మించిరి. కథానాయకుని గన్న పుణ్య దంపతులు రంగనాయకమ్మ, నరసింగరావుగారలు. పుల్లమరాజు వారిది మహబూబునగరం జిల్లా, షాదునగరు తాలూకా, బూర్గుల గ్రామము. ఈ గ్రామమునం దొకప్పుడు బూరుగుచెట్లు విస్తారముగా నుండుటచే గ్రామమున కాపేరు వచ్చియుండునని రామకృష్ణరావుగారే యొక సందర్భమున ఊహచేసినట్లు జ్ఞాపకము. వీరి విద్యాభ్యాసము హైదరాబాదులో జరిగెను. మాధ్యమిక పరీక్షను ధర్మవంతు పాఠశాలలో ముగించుకొని, బొంబాయి మెట్రికును ప్రైవేటుగా చదివి విజయమునందిరి. ఆ దినములలో మిడిలు కామ్యాబు అగుట (ఉత్తీర్ణుడగుట) ఒక గొప్ప విద్యాశ్రేణి నధిగమించుటగా భావింపబడెడిది. విద్యా విషయమున దేశమంత వెనుకబడి యుండెడిదన్నమాట. వాస్తవమునకు ఆనాటి విద్యా ప్రమాణము మిడిలు తరగతియందుకూడ ఇప్పటి ప్రమాణములకన్న ఎన్నియో మడుగులు కఠినతరముగ నుండెడిదని చెప్పుదురు. బొంబాయి మెట్రికునం దుత్తీర్ణులై శ్రీ రామకృష్ణరావుగారు నిజాం కళాశాలయందుచేరి ఇంటర్మీడియెటు పరీక్షకు చదివిరి. ఇట్లు హైదరాబాదు నగరమందలి రెండు విద్యాసంస్థలు శ్రీవారి విద్యారంగములైనందుకు గర్వింపదగియున్నవి.

విశ్వవిద్యాలయ విద్యకై రామకృష్ణరావుగారు పూనా ఫెర్గుసన్ కాలేజికి వెళ్ళి అచ్చట 1920 ప్రాంతమున బి. ఏ. ఆనర్సునం దుత్తీర్ణత బడసిరి. ఆనర్సునందు వీరి యభిమాన పాఠ్యవిషయము వేదాంతము. అప్పటికే వీరికి భాషాధ్యయమునందును వినియోగమునందును సౌలభ్యము ప్రావీణ్యము అలవడి యుండెను. ఆనర్సు తరగతిలో వీరు ఇంగ్లీషునందు ప్రథములుగ విజయము నందుటచే 'ఎల్లిసు స్కాలరు షిప్పు'ను సంపాదించుకొనిరి. పూర్వ హైదరాబాదు

రాష్ట్రమున ముసల్మానుల తరువాత మహారాష్ట్రులు రాజకీయ ప్రాధాన్యము వహించియుండిరి. వారు నిర్మించుకొన్న సంస్థలును రాజధాని నగరమున ఎక్కువగా నుండెను. వారినిబట్టి తెలంగాణావారికి బొంబాయి రాష్ట్రముతో సన్నిహితసంబంధము లేర్పడి యుండెను. గోపాలకృష్ణ గోఖ్లే, బాలగంగాధర తిలకువంటి గొప్ప నాయకులు మహారాష్ట్రమును భారత రాజకీయములందు సమున్నతస్థాన మలంకరించునట్లు చేయుచుండిరి. పై యాకర్షములచే శ్రీ రామ కృష్ణరావుగారు తమ ఉన్నత విద్యను బొంబాయి ప్రాంతములో సాగించిరి. ఆనర్సు పట్టమునుబొంది న్యాయశాస్త్రాధ్యయనమునకై బొంబాయి చేరుకొనిరి.

పూవుపుట్టగనే పరిమళము వెదజల్లును. నూనూగుమీసాల నూత్న యౌవనము నాటికే వీరు రాజకీయ చైతన్యమును విజ్ఞతను ప్రకటింప నారంభించిరి. 1920 ప్రాంతమున నిజాముగారు బీరారు రాష్ట్రము తమకు తిరిగి రావలెనని బ్రిటిషు ప్రభుత్వముతో రాయబారములు జరుపుచుండిరి. బీరారు ప్రాంతము మొదట నిజాము రాజ్యములోనిదే. ఇప్పటి నిజాముగారి తండ్రికాలమున ప్రభుత్వ ఋణము లధికములయి యుండుటచే కాబోలు వాని పరిష్కారమునకై బీరారు ప్రాంతమును ఇండియా ప్రభుత్వమువారు చేతిలో నుంచుకొనిరి. మొదటి ప్రపంచ సంగ్రామములో తాముచేసిన సహాయము మొదలగు సేవలను గుర్తించి బిరారును తిరిగి తమకు దత్తము చేయవలెనని నిజాముగారి వాదన. నిరంకుశ పరిపాలనలోనికి తాము వెళ్ళుట కిష్టపడమని బిరారు ప్రజలు ఆందోళన చేయుచుండిరి. ఈ వివాదములో బొంబాయియందు న్యాయశాస్త్ర విద్యార్థిగా చదువుచున్న రామకృష్ణరావుగారు ప్రవేశము కల్గించుకొని, ఈ సమస్య నంతను చక్కగా చదివి, ఉత్తమ పరిష్కారమార్గమును సూచించు కొన్ని ప్రముఖ వ్యాసములను వ్రాసి ప్రకటించిరి. వీరి పరిష్కారమార్గ మేదన— బిరారులు నిజాముగారికి చెందవలసినవే. అచ్చటి ప్రజలు నిరంకుశ పరిపానలకు వెరచుచున్నారు గనుక వారికి బాధ్యతాయుత పరిపాలనను కల్గించి బిరారులను పునర్దత్తము చేయవచ్చునని. ఈ వ్యాసములు నిశితమై దుష్యముతోను రాజకీయ చతురతతోను పరిపూర్ణములై యుండుటచే అవి పెద్దలదృష్టి నాకర్షించెను. ముఖ్యముగా నిజాముప్రభుత్వ ప్రతినిధులు ఈ యకారణబంధు వెవరని ప్రీతితో అన్వేషింపసాగిరి. బిరారులు తమకు లభించుట వారికి సమ్మతమే కాని బాధ్యతాయుత ప్రభుత్వము నిచ్చుట వారికి అంత సమ్మతము కాకుండెను. ఇండియా ప్రభుత్వమును దాని కంగీకరించినట్లులేదు. ఏది యెట్లున్నను నవయౌవనము

నుండియు రామకృష్ణరావుగారు చిక్కు సమస్యలను విడదీయుట యందును, సామరస్య మార్గములను సూచించుట యందును గొప్ప మేధావులని ప్రతీతి వహింపజొచ్చిరి.

బొంబాయిలో న్యాయపట్టమును బొంది శ్రీ రామకృష్ణరావుగారు 1923 ప్రాంతమున హైదరాబాదులో న్యాయవాదవృత్తి నారంభించిరి. వీరి వాదకౌశల్యము, సద్యస్స్ఫురణము, హాస్యచతురత, భాషాపాండిత్యము, వక్తృత్వము, ఎట్టి కఠినము నూతనము అయిన సమస్యనైనను క్షణములో గ్రహింపగల్గుట మున్నగు ప్రశస్త గుణములు వీరిని అగ్రశ్రేణికిచెందిన న్యాయవాదిగా చేయదగియుండెను. ధనార్జనయే వీరి లక్ష్యమైనచో వీరు రెండు చేతుల ధనమార్జింపగలిగియుండిరి. అంతయేల? బిరారు సమస్యపై నిజాముగారి వాదమును బలపరచిన సదుపాయమునకై వీరికి ప్రభుత్వాదరము ఘనముగా లభించియుండెడిది. బాధ్యతాయుత ప్రభుత్వపు షరతును విడిచి బిరారు పునర్దత్తతను వీరు సమర్థించినచో పెద్ద యుద్యోగమే వీరి పాలబడి యుండును. కాని రామకృష్ణరావుగారు ప్రజాస్వత్వవాది యగుటచే దాని కంగీకరింపరైరి. వీరు న్యాయవాదవృత్తిలో చేరుకాలమునకు తెలంగాణము మిక్కిలి దుస్థితి యందుండెను. విద్యా, వైజ్ఞానిక, రాజకీయ సాంఘికరంగములందన్నింటను రాష్ట్రము వెనుకబడి యుండెను. అప్పటికే మాడపాటి హనుమంతరావు పంతులుగారు ఏకాకియై, ఎడారిలోని ఒంటరి బాటసారివలె, దేశమునందు చైతన్యము కలిగించుటకై బావుటాయెత్తి మోయలేక మోసికొని వచ్చుచుండిరి. వారికి బాసటగా నుండువారు ఆ దినములలో బహు అరుదు. విద్యాధికులు, ఉపాయశీలురు అగు రామకృష్ణరావుగారివంటి యువకుల సహాయమును పంతులుగారు ఎదురుచూచుచుండిరి. వారభిలషించినట్లే రామకృష్ణరావుగారు న్యాయవాదవృత్తిని జీవికసాధనగామాత్ర ముంచుకొని, శేషించిన కాలమును ప్రజాహిత కార్యములకై వినియోగింపజొచ్చిరి.

అప్పటి ప్రజా సంస్థలలో చెప్పుకొనదగినది శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయము. దీని రజతోత్సవము 1927 సంవత్సరారంభమున జరిగియుండెను. రామకృష్ణరావుగా రప్పుడు కార్యదర్శిగానుండి ఈ పెద్ద కార్యభారమును దక్షతతో నిర్వహించిరి. ఈనాడు మనకు గ్రంథాలయ నిర్వహణము వేలపిండి బుక్కుటవంటిదిగా తోచును. కాని మనము 1927 ప్రాంతమున నిజాంరాష్ట్ర పరిస్థితులను చారిత్రక దృష్టితో గమనించినచో ఇది యెంత

అసిధారావ్రతమో తెలిసివచ్చును. భారతమునందు జరత్కారు మహర్షి చరిత్రను వ్రాయుచు నన్నయ భట్టారకుడు చెప్పినమాట జ్ఞప్తికివచ్చును. జరత్కారుమహర్షి భార్య జరత్కారువు. మగనియెడ భయభక్తులు గలిగి 'వాలుమీగ నడచునట్లు' నడచుకొనెడిదట. అట్లే నిరంకుశ హైదరాబాదులో ప్రజాకార్య కర్తలు కత్తిమీద సామువలె చరింపవలసియుండెను. ఏ కొంచెము లోపము కనిపించినను ప్రభుత్వము కన్ను ఎఱ్ఱజేయుచుండెను. ప్రభుత్వమును అధికముగా సమాధాన పరుపదలచినచో ప్రజలు అసంతృప్తిపడుచుండిరి. ఇట్టిది యానాటి కార్యకర్తల విషమస్థితి. 1921 సంవత్సరముననే ఆంధ్రుల సర్వతోముఖాభివృద్ధికి పాటుపడుటకై నిజాంరాష్ట్రాంధ్రజన సంఘము స్థాపింపబడెను. స్థాపకులలో శ్రీ రామకృష్ణరావుగారొకరు. ఈ సంస్థయే ఆంధ్ర మహాసభలకు దారితీసి కార్యకర్తలు స్వయముగా ఊహించని; ప్రభుత్వము బొత్తుగా హర్షింపని—గొప్ప చైతన్యమును జనులలో కల్గించుటకు కారణభూత మయ్యెను. రామకృష్ణరావుగారు దేవరకొండలో జరిగిన రెండవ ఆంధ్ర మహాసభకు అధ్యక్షులుగా ఎన్నుకొనబడిరి. వీరిది ఎక్కువగా బౌద్ధికభాగము. కష్టమైన తీర్మానములను జాగ్రతతో పదజాలమును వాడి వ్రాయుట, క్లిష్టసమస్యలకు సమన్వయ మార్గములను సూచించుట, వివాద సమయములలో చక్కని మాధ్యస్థము చేయుట, ప్రభుత్వము కడకు ప్రతినిధి వర్గములను నడపి చాతుర్యముతో కార్యసాధన గావించుకొని వచ్చుట, ఇట్టివి వీరి పాలబడిన పనులు. ఇన్నిట వీరు సమర్థులై భారతమునందు కర్ణునివలె, ఇప్పుడు 'రామక్రిష్ణరాయడు' వచ్చిన బాగుండును గదాయని సహకార్యకర్తలు కోరునట్లు మెలగుచుండిరి.

ఆంధ్రుల ప్రత్యేకసమస్య లట్లుండగా యావత్తు హైదరాబాదు ప్రజలకు సంబంధించిన ముఖ్యసమస్య లెన్నియో ఉండెను. వానిలో ముఖ్యముగా చెప్పదగినది, 'గస్తీనిషాన్ ౫౩' అని పేరువడసిన హిరణ్యకశిపు శాసనము. దీని ప్రకారము రాష్ట్రమునందెట్టి సమావేశము చేసినను, ఉపన్యాసము కావింపదలచినను అర్హతగల ప్రభుత్వోద్యోగుల లిఖితపూర్వక అనుమతి యుండవలెను. లేనిచో దానికి బాధ్యులైన కార్యకర్తలు శిక్షార్హులు. ఈ శిక్షలును సుకుమారమైనవి కాకుండెను. భారతదేశమునుండి ప్రభుత్వాగ్రహమునకు గురియయినవారు అండమానుదీవుల కెట్లు నిర్వాసితులగుచుండిరో, హైదరాబాదునందు, ప్రభుత్వాగ్రహమునకు పాల్పడినవారు మన్ననూరు అని చెప్పబడు మన్యప్రాంత



మునకు దాఖలు చేయబడుచుండిరి. ఈ ప్రదేశము దుర్గమారణ్యసీమ ప్రజల యందు రాజకీయ చైతన్యము ప్రచారము కాకుండుటకు కలి గప్తి చక్రా యుధమువలె పనిచేయుచుండెను. ఇంతటితో తృప్తిపడక నిరంకుశపాలకులు పాలిత ప్రజలయందు విద్యావ్యాప్తికి పెక్కు అడ్డంకులు కల్గింపజొచ్చిరి. పాఠ శాలలు మున్నగునవి స్వేచ్ఛగా నిర్వహించుకొననిచ్చినచో ఏమి కీడు మూడునో యని వీరు శంకించి, ప్రభుత్వానుమతి లేనిదే యెట్టిపాఠశాలలును నడుపరాదని శాసించిరి. ప్రభుత్వానుమతి కోరినచో అది ఒక విధమున లభించునదికాదు. ఇట్లు బాలబాలికల విద్యానిరోధముచే ప్రజలకు నూతులు కట్టినట్లయిపోయెను. ఏవంవిధములైన దుష్టశాసనములను రద్దుచేయించుటకై భగీరథయత్నములు చేయవలసివచ్చెను. వీటన్నిటియందును తెలంగాణా పాండవ పంచకము ఏదో రూపమున పాల్గొనుట తప్పనిసరి యయ్యెను.

శ్రీ రామకృష్ణరావుగారు సౌమ్యస్వభావులగుటచేతను, ఉర్దూ పార్సీ భాషలలో మంచి వైదుష్యముకలిగి, ఇస్లాము మతతత్త్వమును, సూఫీ వేదాంతమును బాగుగా అర్థముచేసికొన్నవారగుటచేతను ముసల్మానుసోదరులు వీరియందు ఎక్కువ విశ్వాసము ప్రదర్శించుచుండిరి. ఆనాడు ముస్లిములు హైదరాబాదునందు అధికారవర్గమగుటచే వారిని ఒప్పించుటయే పెద్ద గడ్డు సమస్య. ఇంతేకాక రామకృష్ణరావుగారు మహారాష్ట్రము, కన్నడము మున్నగు భాషలను చక్కగా మాట్లాడి యుపన్యసింపగలిగియుండిరి. కావున మహారాష్ట్రులలో మహారాష్ట్రుడుగను, కన్నడిగులలో కన్నడిగుడుగను వారు కలిసిపోయి, రాష్ట్రమునందలి అన్నివర్గములవారికిని సేవకులుగా ఉపకరించు చుండిరి. శ్రీమతి సరోజినీనాయుడుగారు వీరి పాండిత్యము, బహుళభాషా కోవిదత్వమును గాంచి వీరియం దాదరము కలిగియుండెడిది.

నిజాం ప్రభుత్వ మెంత నిరోధించినను, కాలప్రభావముచే హైదరాబాదు ప్రజలందు రాజకీయచైతన్యము జాగృతము కాకమానలేదు. సంస్థాన ప్రజలు రాజకీయస్వత్వములకై పోరాడుట మొదలయ్యెను. హైదరాబాదు ప్రజలును ముందడుగు వేయకోరిరి. అట్టి సందర్భమున హైదరాబాదు ప్రజారాజకీయ సభ, బిరారు ప్రాంతమున అకోలాపట్టణమున జరుపబడెను. శ్రీ రామకృష్ణ రావుగారు ఉద్యమమునందు సముచితపాత్ర నిర్వహించిరనుట చర్విత చర్వణము. నిజాముగారి ఛత్రఛాయక్రింద బాధ్యతాయుత ప్రభుత్వము ఏర్పడవలెనని అప్పటి కార్యకర్తలు తీర్మానములు చేయుచుండిరి. నిజాము

రాష్ట్రాంధ్ర మహాసభలలో కూడ బాధ్యతాయుత ప్రభుత్వ తీర్మానము ఆమోదము నందెను.

కాల్బలమును గుర్తించి యేవియో కొన్ని రాజకీయపు మెతుకులు విదల్చినగాని ప్రజలు ఊరుకొనరనియు, లోకవిమర్శకు వెరచియు, అప్పటి ప్రభుత్వము దివాన్ బహద్దర్ అరవముదు అయ్యంగారి అధ్యక్షతన ఒక రాజకీయ సంస్కరణల సంఘము నేర్పరచిరి. ఈ కమెటీవారి సిఫారసులు 'నీళ్ళకుంబల్చనై' యుండెనని భావించి ప్రజలు అసంతృప్తులై, పీపిల్సు కన్వెన్షన్ (ప్రజా రాజ్యాంగసభ) స్థాపించుకొనిరి. దీనికి మాడపాటి హనుమంతరావు పంతులుగా రధ్యక్షులుగను, బూర్గుల రామకృష్ణరావుగారు కార్యదర్శిగను ఉండిరి. హైదరాబాదునందు ఆంధ్రుల ప్రాధాన్యత తప్పదనుట క్రమముగా అవగతమగుచుండెను. ప్రజా రాజ్యాంగసభ వారు ఎంత అనుకూలమైన సంస్కరణలను ప్రతిపాదించినను అంగీకరించు చిత్తవృత్తి ప్రభుత్వములో లేకుండుటచే, ఇకముందు విన్నపములు, తీర్మానములు, ప్రార్థనలు చాలించి, నడుముకట్టి హక్కులకై పోరాడవలెనను స్థిరసంకల్పము ప్రజలలో తలచూపెను.

ఈ సంకల్పస్వరూపమే 'హైదరాబాదు స్టేటు కాంగ్రెసు' అను మహాసంస్థ. దీని నిర్మాతలలో శ్రీ బూర్గుల రామకృష్ణరావు, స్వామి రామానందతీర్థ, కాశీనాథరావు వైద్య మున్నగు ప్రముఖులుండిరి. ఇది 1939 లో ఏర్పడెను. భారత జాతీయ మహాసభాదర్శములకు లోబడి యిది పనిచేయును. ఇప్పటినుంటియు ప్రాంతీయ మహాసభలు కొంత వెనుకపట్టెను. భారతదేశము స్వాతంత్ర్యము నొందిన తరువాత హైదరాబాదు ప్రజల రాజకీయ వాంఛలు తీవ్రతరములయ్యెను. భారత సమాఖ్యలో హైదరాబాదు చేరవలెనని స్టేటు కాంగ్రెసు వారు కోరగా, నిజాము ప్రభుత్వము విముఖమై యుండెను. దీనిపై రేగిన పోరాటములో బూర్గుల రామకృష్ణరావుగారు మున్నగువారు జైళ్ళకు పోయిరి.

పోలీసు చర్యతో హైదరాబాదున శాంతివర్షము చినికెను. రజాకారుల ఆగడము అరికట్టబడెను. భారతప్రభుత్వము తన యధికారమును క్రమముగా ప్రజానాయక పరమొనర్ప మొదలిడెను. ఈ యదనున, వెల్లోడే ప్రభుత్వమునందు శ్రీ బూర్గుల రామకృష్ణరావుగారు మొదట విద్యామంత్రిగను, తరువాత భూమ్యాదాయశాఖా మంత్రిగను వ్యవహరించి తమ పూర్వాదర్శములను క్రమముగా పరిపాలనలో ప్రవేశపెట్టిరి. విద్యారంగమున, మాతృభాషలకు విద్యావిధానమునందగ్రస్థానమిచ్చుట, ఖాస్గీ పాఠశాలలను స్వేచ్ఛగా పెట్టు

కొననిచ్చుట ముఖ్యమైనవి. తెలంగాణము ఉన్నత విద్యావీథిలో వెనుకబడి యుండుట గమనించి రామకృష్ణరావుగారు జిల్లా కొకటిచొప్పున కళాశాలలను తెరిపించి ప్రశంసనీయమైన పాత్ర వహించిరి. వీరు మార్చి 1952 నుండి, అక్టోబరు 1956 వరకును అవిభక్త హైదరాబాదు రాజ్యమునకు ముఖ్యమంత్రులుగనుండి మెచ్చుకొనదగిన కార్యకుశలతను, పరిపాలనా స్థిరత్వమును, అందరిని కూడ గట్టుకొని రాగల్గుటను ప్రదర్శించిరి. రామకృష్ణరావుగారు సంధి విగ్రహముల రెంటను తుల్య సమర్థులని రాష్ట్ర ప్రజలేకాక భారతప్రభుత్వమును గుర్తించెను. తెలంగాణములో వీరి పరిపాలనా కాలమున భూసంస్కరణలును వేగముతో అమలునడచెను. భూముల గరిష్ఠ పరిమాణమును నిర్ణయించుటకు పథకము వేయబడి కొన్నిచోట్ల ఆచరణలో పెట్టబడెను. గోల్కొండ రాజ్యమునందు కీర్తి గడించిన అక్కన్న మాదన్నగార్ల తరువాత ఇన్నూట డెబ్బది సంవత్సరములకు శ్రీ బూర్గుల రామకృష్ణరావుగారు మంత్రియై, ఆంధ్రులయందు రాజకీయ ప్రాగల్భ్యము కొరవడలేదని రుజువుచేసిరి.

ఇంతలో విశాలాంధ్ర నిర్మాణసమస్య కార్యరూపమునుదాల్చు శుభ సమయ మాసన్నమయ్యెను. చరిత్ర ప్రసిద్ధులైన కాకతీయ రాజన్యుల కాలమున తెలుగుదేశ మంతయు ఏక ప్రభుత్వ శాసనమున సుఖించెను. నాటినుండి నేటివరకును ఆంధ్రులు వివిధ ప్రభుత్వముల క్రింద విభజింపబడి, ఆంధ్రుల కాంధ్రులు పరాయివారగు దుస్థితి శతాబ్దములు చెల్లుమండెను. కావున స్వతంత్ర భారతమున, అఖిలాంధ్రు లేకము కావలెనను స్థిరసంకల్పము మన నాయకులకు గల్గెను. ప్రజలును దీని కువ్విళ్లూరుచుండిరి. ఇది యేర్పడినచో కొన్ని పూర్వ సౌకర్యములు నశించునని కొందరు భయపడుచుండిరి. ఇట్టి సందిగ్ధ సమయమున శ్రీ రామకృష్ణరావుగారు ఆశాజ్యోతిగా వెలిగిరి. తాత్కాలికమైన అసౌకర్యములు నష్టములు ఎట్లున్నను, భవిష్యత్కాలమందు మహోజ్జ్వల ప్రయోజనములను సాధించుటకు విశాలాంధ్రమే తరుణోపాయమనియు, ఆంధ్రుల చారిత్రక ఘనత కిదియే యుక్త పరిణామమనియు రామకృష్ణరావుగారు గుర్తించి ముక్త కంఠముతో విశాలాంధ్రమును బలపరచి ఆంధ్రుల భావిభాగ్యోదయమునకు పునాదులువైచిరి. హైదరాబాదు రాష్ట్రమునకు ముఖ్యమంత్రియై, భారతప్రభుత్వ విశ్వాసమును చూరగొనుచు కీలక స్థానమందున్న శ్రీ బూర్గుల రామకృష్ణరావుగారు ఆనాడు విశాలాంధ్ర లక్ష్యము విషయమై ఏ రవంత వెనుకాడినను, ప్రాల్మాలినను ముక్కోటి

ఆంధ్రులు దశాబ్దములు చింతాగ్రస్తులయి యుందురు. శ్రీవారు కోమల హృదయులయ్యు గాఢ ధైర్యవంతులనుట ఆ పుణ్యక్షణమున వ్యక్తమయ్యెను. తపస్సు చేయబూనిన పార్వతి దేహమును గురించి కాళిదాసు చెప్పిన మాటలు "ధ్రువం వపుః కాంచనపద్మ నిర్మితం - మృదుప్రకృత్యాచ ససారమేవచ" రామకృష్ణరావుగారియెడ అక్షరాల నిజమగుచున్నవి.

ఆంధ్రప్రదేశ నిర్మాణమునకు ఆయువుపట్టుగా నుండియు, తన్నిర్మాణ ఫలితమైన యధికారవాంఛకు దూరముగా నుండదలచిన శ్రీవారి నెంతయని కొనియాడగలము. ఇటలీదేశమునకు స్వాతంత్ర్యము సాధించిపెట్టి నాగలి బుజమున పెట్టుకొని భూమి దున్నుకొనుటకై మరలిపోయిన గారిబాల్డీ మహావీరుని ఛాయలు రామకృష్ణరావుగారియందు స్ఫుటముగా నున్నవి. ఛాయలేల! శ్రీవారి తత్త్వమట్టిదే. కేరళరాజ్యము సమస్యానిలయమని కాన్పించుటచే భారత ప్రభుత్వమువారు రామకృష్ణరావుగారి రాజకీయ విజ్ఞతను వినియోగించుకొనగోరి అచ్చట రాజపాలకులుగా నుండ పంపుటయు, తమ సౌమనస్యము నంతయు ప్రదర్శించి శ్రీవారు కేరళ ప్రజలు అన్ని వర్గములవారి ఆదర విశ్వాసములను చూరగొనుచుండుటయు మన కనులయెదుట జరుగుచున్న విషయము.

శ్రీ రామకృష్ణరావుగారి రాజకీయసేవను సంగ్రహముగా వీక్షించితిమి. శ్రీవారు సవ్యసాచి యనియు రాజకీయములందేకాక సారస్వత రంగమునందును సముచితస్థానము నలంకరింతురనియు సూచించియుంటిని. రామకృష్ణరావుగారు బహు భాషా వేత్తలు. సంస్కృతము, తెలుగు, మహారాష్ట్రము, కన్నడము, ఉర్దూ, హిందీ, పార్సీ, ఆంగ్లము— ఈ భాషలు వీరికి చక్కగా పరిచితములు. వీనిలో కొన్నిటియందు వీరు ధారాళమైన పాండిత్యమును వహించి, రచనా వ్యాసంగము చేయుచున్నారు. మాతృభాషయగు ఆంధ్రమునందు గద్య పద్యములను వీరు సమర్థతతో వ్రాయగలరు. పార్సీ, ఉర్దూ భాషలలో వీరికి చక్కని ప్రవేశముండుటచే ఉమర్ ఖయామ్ రచనలను మూలమునుండి భావస్ఫోరకముగ అనువాదము చేయుటకు వీరు త్రోవ చూపియున్నారు. ఉర్దూ సాహిత్య చరిత్రలోను, ప్రక్రియలలోను వీరికి గాఢ పరిచయముండుటచే ఆ వాఙ్మయమునందలి మేలిమి రత్నములను తెలుగువారి కందజేయగల్గుచున్నారు. పార్సీ వాఙ్మయ చరిత్రను తెలుగులో వ్రాయుటకు వీరు కడు సమర్థులు. ఆ ప్రయత్నము జరుగుచున్నదనియు విందుము.

ఆంధ్రమునందు వీరు వ్రాసిన వ్యాసములు 'వ్యాసముక్తావళి' యను పేర సంకలితములై యున్నవి. రామకృష్ణరావుగారు రసహృదయులనియు, విమర్శనమునందు విశాలదృక్పథము కలవారనియు, ఈ వ్యాసములు సాక్ష్యమిచ్చును. చారిత్రక విషయముల విమర్శించుటయందును వీరు కడు సమర్థులు. ఇటీవల శ్రీవారు సంస్కృతభాషయందు అనవరతకృషి సల్పుచు, వైదుష్యమును సంపాదించుటతో విడువక చక్కని రచనా వ్యాసంగమును కూడ చేయుచున్నారు. రామకృష్ణరావుగారిది ప్రధానముగ తాత్త్వికదృష్టి. వారి హృదయము భక్తిభరితము. వైష్ణవ భక్తిభావములు వారిగద్య పద్యాత్మక రచనలయందు ఇమ్ముగా కుదురుకొనియుండును. 'శ్రీ వేంకటేశ్వర సుప్రభాతము' అను లఘుకృతివలన వీరికి సంస్కృతాంధ్ర పద్యరచనయందు శైలీ ప్రసన్నతయు భావగాంభీర్యమును అలవడినవని చెప్పవచ్చును. ఇప్పుడిప్పుడే వీరు పండితరాజ జగన్నాథుని లహరీ పంచకమును సులభ సుందర భాషలో తెనిగించియున్నారు. కృతులు చెప్పుటకును కృతులు గైకొనుటకును శ్రీవారు సర్వథా అర్హులు. వీరు కృతిభర్తలైన గ్రంథములు వాసికెక్కియున్నవి. అందు ముఖ్యముగ పేర్కొనదగినది మళయాళ దేశపు సంస్కృత కవీంద్రుడు రచించిన 'నారాయణీయ' నామక భాగవత సార గ్రంథము. దీని నాంధ్రీకరించి కల్లూరి సోదరులు శ్రీ రామకృష్ణ రావుగారి కంకితమిచ్చియున్నారు. 'వజ్రచ్ఛేదిక' యను బౌద్ధకావ్యమును, దాశరథి కవీంద్రుని "మహాబోధి" అను కావ్యమును వీరు కృతి స్వీకరించి యున్నారు. శ్రీవారి వైదుష్యమును, ప్రజాసేవానిరతిని పరిగణించి ఆంధ్ర విశ్వవిద్యాలయము, ఉస్మానియా విశ్వ విద్యాలయముల వారు వీరికి గౌరవ డాక్టరు బిరుదమును బహూకరించి తమ్ము గౌరవించుకొన్నారు.

ఇట్టి దేశసేవా పరాయణుడు, బహుశ్రుతుడు, సజ్జనుడు, మృదుహృదయుడు అగు మన కథానాయకుని షష్టిపూర్తి మహోత్సవము, ఏప్రిల్ 8, 1959 తేదీని మహావైభవముతో జరుగనున్నది. భగవంతుడు శ్రీవారికిని వారి కుటుంబమునకును దీర్ఘాయురారోగ్యములను ప్రసాదించి శ్రీవారిచే ఇతోధిక మహాకార్యములను సాధింపజేయుగాక యని కోరుచున్నాను.

